ఈ సంశయం ఆత్మకు సంబంధించింది. ఆత్మకు సంబంధించిన అజ్ఞానం వల్ల సంభూత మైంది. నీ అజ్ఞానం వల్ల ఏర్పడిన సందేహము కనుక నీవు పొందే జ్ఞానం వల్లనే పోవాలి. మరో మార్గం లేదు. అంటే, నీకు కలిగిన సంశయాన్ని నీవు తొలగించుకోవాలే గాని పరులు తొలగించ లేరు. నీ హృదయంలో పరులకు ప్రవేశం లేదు. విష్ణుదత్తుని సంశయాన్ని దేవదత్తుడు తొలగించ లేడు.

దూరంగా ఉన్న చెట్టు మోడును చూచి, అది స్థాణువా, లేక పురుషుడా? అనే సందేహం కలిగితే, ఈ సంశయాన్ని మన ప్రక్కనే ఉన్న మరొకడు తొలగించవచ్చు. ఎందుకని? అది బాహ్యంలో ఉంది కనుక. పైగా అతనికి కూడా దృశ్యంగా ఉంది. కాని, నీ హృదయగత సంశయాన్ని మరొకడు ఎలా నివారిస్తాడు? పరుడు నివారించలేడు కనుక నీవే నివారించుకోవాలి ***(న హి పరస్య సంశయః పరేణ ఛేత్తవ్యతాం ప్రాప్తః యేన స్వస్య ఇతి విశిష్యతే).***

ఎవరి సందేహం వారిదే. ఎవరి జ్ఞానం వారిదే. ఎవరి అజ్ఞానము వలన సంభూతమైన సంశయం వారి జ్ఞానం వల్ల కలిగే వివేకంతో నశించ వలసిందే. ఒకరి హృదయం లోకి మరొకరి ప్రవేశం సాధ్యపడదు కనుకనే, ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి ***(ఉద్ధరే దాత్మ నాత్మానం - 6 - 5).***

కర్తను సంస్కరించడానికి, శుద్ధి చేయడానికి ఉపకరించేది కర్మయోగము. కర్మలో అకర్మను దర్శించి, తనను కర్తగా కాకుండా అకర్తగా దర్శించడానికి సహకరించేది జ్ఞానయోగము. కర్మయోగాన్ని ఆచరించిన వానికి జ్ఞానయోగంలో అవాంతరాలు ఉండవు. కనుక, కర్మయోగమును ఆచరించు ***(ఆతిష్ఠ కురు ఇత్యర్థః)*** అంటున్నాడు భగవంతుడు.

అర్జునా! ఇక లే! ***(ఉత్తిష్ఠ)*** అంటున్నాడు. కూర్చోవడం అంటే కర్మను సన్యసించడం. దానిని అంగీకరించని భగవంతుడు, అర్జునా! పైకి లే! అంటున్నాడు. కర్మయోగానికి నడుము బిగించు అంటున్నాడు. లే! సంశయము నుండి పైకి లే! మోహము నుండి పైకి లే! రాగద్వేషాల నుండి పైకి లే! అజ్ఞానం నుండి పైకి లే! కర్మయోగాన్ని ఆచరించు!

ఉత్తిష్ఠ! అంటే లెమ్మని అర్థము. కర్మయోగాన్ని ఆచరించడానికి లెమ్మని భావము. మరి, కర్మ యోగానుష్ఠానానికి నేను యజ్ఞయాగాదుల నాచరిస్తాను. యుద్ధం చెయ్యను అని అర్జునుడు అనొచ్చు. కనుకనే, ఇక్కడ అర్జునుణ్ణి ***భారతా!*** అని సంబోధించాడు భగవంతుడు. భరత కులమున అనగా క్షత్రియ వంశాన జన్మించిన వాడు కనుక, లేచి యుద్ధం చెయ్యమని ఆజ్ఞాపిస్తున్నాడు. కనుక ఉత్తిష్ఠ అంటే, యుద్ధము చేయడానికి నిలబడు అని అర్థము ***(ఉత్తిష్ఠ ఇదానీం యుద్ధాయ భారత ఇతి).***

కర్మయోగం కానపుడు ఏ కర్మ అయినా బంధమే. అదే కర్మయోగ మైనపుడు, ఫలాసక్తి లేకుండా కర్మలను ఆచరించడం చేత ఏ కర్మ కూడా బంధము కాదు. ఇది అర్థమైతే, క్షత్రియ ధర్మంగా తనకు ప్రాప్తించిన యుద్ధకర్మను ఆచరించడానికి సంశయించాల్సిన అవసరం లేదు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానయోగో నామ చతుర్థోஉధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు జ్ఞానయోగ మనే నాల్గవ అధ్యాయము.**



# చైతన్య భగవద్గీత

## అథ పంచమోஉధ్యాయః - అయిదవ అధ్యాయము

## కర్మసన్న్యాస యోగః - కర్మసన్న్యాస యోగము

మంచి విషయాలు ప్రపంచంలో ఎన్నో ఉంటాయి. అన్నీ అందరికీ అవసరం లేదు. ఆచరించ దగినవే అయినా, అందరూ అన్నిటినీ ఆచరించ లేరు. అలాగే, శ్రేయోదాయక మైనవి ఎన్నయినా ఉండొచ్చు. కానీ తన కేది శ్రేయస్కరమో అదే వాంఛనీయము.

**సిద్ధిరూప సన్న్యాసము**

కర్మల వలన అంతఃకరణము పక్వమైతే జ్ఞానము ప్రాప్తిస్తుంది. కర్మయోగము చేత శుద్ధిపడిన బుద్ధి కలవానికి సన్న్యాసము సిద్ధిస్తుంది. సన్న్యాసమునకు పరమగతి జ్ఞానమే. ఇక్కడ జ్ఞానము అంటే ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానము లోనే సర్వకర్మ సన్న్యాసము జరిగి పోతుంది. ఈ విధమైన జ్ఞానకర్మ సన్న్యాసము ఆత్మవిదునికే గాని అనాత్మజ్ఞునికి కాదు.

జ్ఞానకర్మ సన్న్యాసమునకు ఆత్మజ్ఞుడే కర్త. ఇక్కడ కర్త అంటే, తాను అకర్త అనే జ్ఞానం కలిగిన కర్త. అంటే తాను అకర్తగా శోభించే వాడే గాని, కర్తగా వ్యవహరించే వాడు కాదు. మరి కర్త లేనపుడు కర్మ సన్న్యాసము సంభవము కాదు కదా! కర్త లేనపుడు కర్తవ్యం ఎలా ఉంటుంది? కనుక, కర్మ సన్న్యాసము అనేది కర్తవ్యం కాదు. జ్ఞానం యొక్క ఫలం. ఆత్మవిదునికి జ్ఞాన సామర్థ్యం ఉన్నందున కర్మ సన్న్యాసము అనేది నిశ్చితము. కాయ పెరిగి నపుడు పూలరేకులు వాటంతట అవే ఊడి రాలి పోయినట్లు, సిద్ధిప్రాప్తిలో ఆత్మవిదునిలో సహజంగా జరిగే కర్మత్యాగమే సన్న్యాసము.

**తద్బ్రహ్మాஉహ మస్మీతి కృతకృత్యో భవతి నైஉవాస్తి కించి త్కర్తవ్యమ్**

'అనంతమైన బ్రహ్మ స్వరూపమును నేనే అయి ఉన్నాను. కృతకృత్యత పొందినాను. నేను చేయదగిన కర్తవ్యము ఏ కొద్ది కూడా లేదు'. ఇది అకర్తగా ఆత్మవిదుని అద్వైతానుభూతి. ఇదే జ్ఞానకర్మ సన్న్యాసము. ఆత్మజ్ఞాన ఫలంగా జరిగిన కర్మత్యాగము. ఇది చేసేది కాదు, చూచేది. ఇక్కడ కర్త లేడు, అకర్త ఉన్నాడు. కర్మ లేదు, జ్ఞానం ఉంది. ఒకవేళ ఆత్మవిదునికి కర్మ తెలిసినా, అది అకర్మ గానే తెలుస్తూ ఉంది. స్వరూప వైభవంతో శోభించే ఈ జ్ఞానకర్మ సన్న్యాసాన్ని నాల్గవ అధ్యాయంలో భగవంతుడు అద్భుతంగా ప్రవచించాడు.

**కర్మణి అకర్మ యః పశ్యేత్** - ఎవడు కర్మలలో అకర్మను దర్శిస్తాడో *(4 - 18).*

**స యుక్తః కృత్స్న కర్మకృత్** - అట్టి ఆత్మజ్ఞాని సర్వ కర్మలను చేసినవాడే అయ్యాడు *(4 - 18).*

**కృత్వాஉపి న నిబధ్యతే** - కర్మ చేసినా దాని చేత బద్ధుడు కాడు *(4 - 22).*

**సర్వం కర్మాఖిలం జ్ఞానే పరిసమాప్యతే** - సర్వకర్మలు జ్ఞానము నందు అంతర్భూత మవుతాయి *(4-33).*

**యత్ జ్ఞాత్వా న పునర్మోహం** - అది తెలిసిన తరువాత మరల మోహం దరి చేరదు *(4 - 35).*

**జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి భస్మసాత్ కురుతే** - జ్ఞానమనే అగ్ని సర్వ కర్మలను భస్మం చేస్తుంది *(4 - 37).*

**ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి** - ఆత్మజ్ఞానిని కర్మలు బంధించ లేవు *(4 - 41).*

పై వాక్యాలన్నీ బ్రహ్మాత్మవిదునిలో శోభించే కర్మత్యాగాన్నే సూచిస్తున్నాయి. ఇదే జ్ఞానకర్మ సన్న్యాసము. ఇది సిద్ధిరూప సన్న్యాసమే గాని సాధనరూప సన్న్యాసము కాదు. సిద్ధిరూప సన్న్యాసాన్ని శాస్త్రంలో విద్వత్ సన్న్యాసము అంటారు. అంటే అకర్త అయిన ఆత్మవిదునిలో కనిపించే కర్మత్యాగము. ఆత్మస్వరూప వైభవము.

**సాధన రూప సన్న్యాసము**

సిద్ధిరూప సన్న్యాసము కాకుండా మరొకటి ఉంది. అది సాధన రూప సన్న్యాసము. మనము సన్న్యాస మని భావించేది దీనినే. దీనిని శాస్త్రంలో వివిదిషా సన్న్యాసము అంటారు. అంతఃకరణ శుద్ధి ఏర్పడి, వివిదిష దృఢ మవుతూ ఉంటే, శ్రవణ మనన రూప వేదాంత విచారమును కొనసాగించి జ్ఞానమును పొందుటకు సర్వ కర్మలను విడిచి, సన్న్యాసిగా జీవనమును సాగించుట వివిదిషా సన్న్యాసము. ఆత్మజ్ఞానం లేనివాడు ఆత్మజ్ఞానం కొరకు శుద్ధ బుద్ధితో ప్రయత్నం చేయడమే వివిదిషా సన్న్యాసములో గోచరిస్తుంది. వివిదిషా సన్న్యాసములో కర్త ఉన్నాడు అనేది మరువకూడని విషయము.

కర్మల్ని త్యజించడం పెద్ద విషయ మేమీ కాదు. ఎవరైనా కర్మలను త్యజించ వచ్చు. కర్మల్ని త్యజిస్తారు గాని, 'నేను కర్మల్ని త్యజించాను' అనే భావనను మాత్రం పట్టుకొనే ఉంటారు. పట్టుకోవడం జరుగుతుంది కనుక, కర్త ఉన్నాడు. కాని, విద్వత్ సన్న్యాసములో కర్త లేడు. అకర్త శోభిస్తున్నాడు. ఆత్మజ్ఞాని అకర్తగా తెలుస్తున్నాడు. వివిదిషా సన్న్యాసములో ఆత్మజ్ఞానం కొరకు సర్వకర్మలను త్యాగం చేసి, కేవలం శ్రవణ మనన నిదిధ్యాసలను సాగించే కర్తగా వివిదిషా సన్న్యాసి తెలుస్తున్నాడు. ఇక్కడే జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ముగ్గురిని స్పష్టంగా మనం అర్థం చేసుకోవాలి.

***(1) విద్వత్ సన్న్యాసి :-*** ఆత్మజ్ఞానం కలవాడు. తాను అకర్త అని తెలిసిన వాడు. సమస్తాన్ని పొందిన వాడు. పొంద వలసినది లేని వాడు. కనుక చేయ వలసింది కూడా లేని వాడు. కర్మలలో అకర్మను దర్శించే ఆత్మజ్ఞాని.

***(2) వివిదిషా సన్న్యాసి :-*** మోక్షేచ్ఛ తప్ప మరొకటి లేని వాడు. సర్వ కర్మలను త్యజించి కేవలం జ్ఞాన సాధన లోనే జీవనాన్ని కొనసాగించే వాడు. నివృత్తి మార్గానుయాయుడు.

***(3) కర్మయోగి :-*** ఆత్మజ్ఞానం లేనివాడు. కర్మలలో చరిస్తూ కర్మల యొక్క, కర్మఫలాల యొక్క అనిత్యత్వాన్ని అర్థం చేసుకున్న వాడు. మోక్షాపేక్ష కలవాడు. మోక్షానికి ఏకైక సాధనమైన జ్ఞానానికి అవసర మైన చిత్తశుద్ధిని పొందే ప్రయత్నంలో కార్యక్షేత్రంలో కర్మలను ఆచరించే వాడు. ప్రవృత్తి మార్గానుయాయుడు.

విద్వత్ సన్న్యాసి ఆత్మజ్ఞాని. అతడు సన్న్యాసి దుస్తులలో శోభించ వచ్చు. లేదా గృహస్థుడుగా అగుపించ వచ్చు. దేహంతో గోచరిస్తున్నాడు కనుక కర్మలను ఆచరించ వచ్చు. లేదా కర్మల నుండి విరమించ వచ్చు. గృహస్థుడుగా కూడా ఉండవచ్చు. అతడు ఆత్మజ్ఞాని కావడం చేత విధి నిషేధాలకు అతీతుడు. శ్రీ శంకరాచార్య స్వామి సన్న్యాసి. వేదవ్యాసుడు గృహస్థుడు. జనక చక్రవర్తి రాజు. మదాలస గృహిణి. వీళ్ళందరూ ఆత్మజ్ఞానులే. విద్వత్ సన్న్యాసులే.

వివిదిషా సన్న్యాసి ఆత్మజ్ఞానం లేనివాడు. ఆత్మజ్ఞానం కొరకు జ్ఞానసాధనను ఆచరించడానికి సర్వసంగ పరిత్యాగిగా మారి, లౌకిక కర్మలకు దూరమై, కాషాయ వేషధారియై, కేవలం శ్రవణ మననాదులకే పరిమితమై ఉంటాడు. ఉండాలి. విరాగి యైన వివిదిషా సన్న్యాసి చిత్తశుద్ధిని పొంది ఉంటాడు. ఇలాంటి వాడు వానప్రస్థాన్ని ముగించిన తరువాతే సన్న్యసించాలి అనే నియమం లేదు. ఎప్పుడైనా సన్న్యసించ వచ్చు. వైరాగ్యమే ప్రధానము.





***యదహ రేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ -*** ఏ రోజు వైరాగ్యము ప్రాప్తిస్తే, ఆ రోజే సన్న్యసించ వచ్చు అన్నది శాస్త్రం. వివిదిషా సన్న్యాసి కర్మసన్న్యాసి. విద్వత్ సన్న్యాసి జ్ఞానకర్మ సన్న్యాసి.

ఇక కర్మయోగి. కర్మయోగి ముముక్షువే. అతనికి కూడా మోక్షమే పరమావధి. అలాగని వివిదిషా సన్న్యాసి లాగా కర్మత్యాగం చేయడు. ఫలాసక్తి లేకుండా కర్మలను ఆచరిస్తూ ప్రశాంతంగా జీవిస్తూ, చిత్తశుద్ధి కొరకు యత్నిస్తూ ఉంటాడు. కర్మలలో, కర్మఫలాలలో రాగద్వేషాలు లేకుండా జీవిస్తూ ఉంటాడు.

అందరూ విద్వత్సన్న్యాసులు అనగా ఆత్మజ్ఞానులు కావలసిందే. కర్మయోగి వివిదిషా సన్న్యాసియై, జ్ఞానప్రాప్తి ద్వారా విద్వ త్సన్న్యాసి కావచ్చు. లేదా, వివిదిషా సన్న్యాసి కాకుండానే, కర్మయోగము లోనే జ్ఞానాన్ని పొంది విద్వ త్సన్న్యాసి కావచ్చు. కనుక, కర్మయోగము, వివిదిషా సన్న్యాసము రెండూ సాధనరూపాలే. ఆత్మజ్ఞానము అనే విద్వ త్సన్న్యాసము కేవలం సిద్ధి రూపము.

నాల్గవ అధ్యాయంలో పరమేశ్వరుడు వర్ణించింది సిద్ధిరూప సన్న్యాసమునే. అంటే, జ్ఞాన సహిత సన్న్యాసము. వివిదిషా సన్న్యాసము జ్ఞానసాధన నిమిత్తం ఉంది కనుక అక్కడ కర్మాచరణము ఉండదు. కాని కర్మయోగము చిత్తశుద్ధి నిమిత్తం ఆచరింప బడుతూ ఉంది కనుక అక్కడ కర్మత్యాగానికి అవకాశము లేదు.

కర్మయోగ వివిదిషా సన్న్యాసాలు సాధన రూపాలు. కర్మాతీత మైన విద్వ త్సన్న్యాసము ఆత్మజ్ఞాన స్థితి. మూడవ అధ్యాయం ప్రారంభంలో గీతాచార్యుడు బోధించిన ద్వివిధ నిష్ఠలు, అంటే కర్మయోగము మరియు జ్ఞానయోగము సాధన రూపాలు కనుక, యోగులకు కర్మయోగము, సన్న్యాసులకు జ్ఞానయోగము అని వేరువేరుగా చెప్పబడింది.

రెండవ అధ్యాయంలో ఆత్మజ్ఞానాన్ని ఒక వైపు అద్భుతంగా ప్రవచించి, మరో వైపు కర్మయోగ వైశిష్ట్యాన్ని వివరించడం చేత, అర్థం చేసుకోవడంలో కాస్త కలత చెందిన అర్జునుడు, కృష్ణా! జ్ఞానము శ్రేష్ఠ మని నీ అభిప్రాయమైతే, నన్ను కర్మాచరణమునకు ఎందుకు పురికొల్పు తున్నావు? కలగాపులగం చేసే మాటలతో ***(వ్యామిశ్రేణేవ వాక్యేన)*** నన్నెందుకు కలవర పెడుతున్నావు? అని మూడవ అధ్యాయం ప్రారంభంలో ప్రశ్నించి నపుడు, అర్జునా! పురాతనంగా రెండు విధాలైన అనుష్ఠాన పద్ధతులే ***(ద్వివిధా నిష్ఠా)*** ఉన్నాయి. యోగులకు కర్మయోగము, సన్న్యాసులకు జ్ఞానయోగము అని శ్రీకృష్ణుడు నిశ్చితంగా చెప్పడం జరిగింది. అంతేకాదు, మూడవ అధ్యాయంలో కర్మయోగాన్ని సుస్పష్టంగా వివరించి, నాల్గవ అధ్యాయంలో సిద్ధిరూప సన్న్యాసానికి సంబంధించిన ఆత్మజ్ఞానమును దివ్యంగా వివరించడం కూడా జరిగింది.

భగవంతుడు చెప్ప వలసిన దంతా చెప్పాడు. నాల్గవ అధ్యాయాన్ని సమాప్తి చేస్తూ, చివరగా, అర్జునా! కర్మయోగాన్ని ఆచరించు. లే! ***(యోగమాతిష్ఠ! ఉత్తిష్ఠ)*** అన్నాడు. ఇక్కడ అర్జునుడికి ఏదో అడగాలి అనిపించింది. ఆచార్యుణ్ణి పరిప్రశ్నించి తెలుసుకోవాలి అని కూడా నాల్గవ అధ్యాయం లోనే శ్రీకృష్ణ పరమాత్మ చెప్పడం చేత, అర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నించడముతో అయిదవ అధ్యాయం ఆరంభ మవుతూ ఉంది. కృష్ణా! కర్మ సన్న్యాసమును, మళ్ళీ కర్మయోగమును ప్రశంసిస్తున్నావు. ఈ రెండిటిలో నాకు ఏది శ్రేయస్కరమో, ఆ ఒక్క దానిని ఖచ్చితంగా చెప్పు అని ప్రశ్నించాడు అర్జునుడు. కర్మాచరణమా? లేక కర్మత్యాగమా? ఏది శ్రేయస్కరం అనేది అర్జునుని ప్రశ్న లోని ఆంతర్యం.

మూడవ అధ్యాయం ప్రారంభంలో అర్జునుడు అడిగిన ప్రశ్న, అయిదవ అధ్యాయం ప్రారంభంలో అడుగుతున్న ప్రశ్న ఒకే లాగ అనిపించినా, రెండిటిని పరిశీలిస్తే, విషయ ప్రాధాన్యాన్ని ప్రక్కన ఉంచి, వ్యక్తి ప్రాధాన్యంగా చూచి నపుడు, మూడవ అధ్యాయం ప్రారంభంలో కర్మ కన్నా జ్ఞానం శ్రేష్ఠ మనే అభిప్రాయాన్ని

హృదయంలో ఉంచుకొని, కర్మలలో నన్నెందుకు పురికొల్పు తున్నావు? అని అడిగినట్లు తెలుస్తూ ఉంది. కాని, ఐదవ అధ్యాయంలో మళ్ళీ ప్రశ్నించి నపుడు, ఏది శ్రేయస్కరమో చెబితే దానిని ఆచరిస్తాను అనేది అర్జునుని మనోగతం, అభిమతం అనేది తేటతెల్ల మవుతూ ఉంది.

ఈ సందర్భంలో అర్జునుడు కలత పడటం లేదు. తన ప్రశ్నతో శ్రీకృష్ణుణ్ణే కాస్త కలవర పెడుతున్నాడు. మూడవ అధ్యాయం ప్రారంభంలో అర్థం గాక అర్జునుడు కలత పడి ప్రశ్నించాడు. ప్రస్తుతం అలా కలత పడటం లేదు. ఏదో ఒక మార్గంలో పడి పోవాలనే అనుకుంటున్నాడు. కాకపోతే, కర్మయోగమా, కర్మసన్యాసమా - ఈ రెండిటిలో తనకు ఏది శ్రేయస్కరమో అర్థం గాక అచ్యుతుని కలవర పెడుతున్నాడు. అంతే.

అర్జునుడు అలా ప్రశ్నించడానికి కారణం లేక పోలేదు. ఆధారం లేకుండా అర్జునుడు అధిక ప్రసంగం చేసేవాడు కాడు. నాల్గవ అధ్యాయంలో జ్ఞానకర్మ సన్యాసాన్ని అత్యద్భుతంగా, అనితర సాధ్యంగా బోధించిన భగవానుడు, అధ్యాయాన్ని సమాప్తి చేస్తూ, లే! కర్మయోగాన్ని అనుష్ఠించు అని ముక్తాయింపు ఇచ్చాడు. ఇక్కడే అర్జునుడు ఏదో అయ్యాడు.

జ్ఞానం కలిగిన తరువాత, ఈ జ్ఞానమనే అగ్ని సర్వ కర్మలను భస్మం చేసేస్తుంది ***(జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే).*** కనుక ఆత్మజ్ఞానం కలిగిన తరువాత కర్మత్యాగం సహజం గానే జరిగి పోతుంది. జ్ఞానాన్ని పొందిన తరువాత ఎలాగూ కర్మలను త్యజించ వలసిందే కనుక, ముందుగానే కర్మల్ని త్యజించి సాక్షాత్ మోక్ష సాధనమైన జ్ఞానాన్ని పొందే ప్రయత్నమే మంచిది కదా!

కర్మలు అవిద్యా జనితాలు. అజ్ఞానము నుండి పుట్టిన కర్మలు జ్ఞాన రూపమైన మోక్షాన్ని ప్రసాదించ లేవు. పోనీ, కర్మను కర్మయోగంగా మార్చుకున్నా, దాని వలన చిత్తశుద్ధి మాత్రమే జరుగుతుంది. జ్ఞానం సాక్షాత్తు మోక్షసాధనం. కనుక, జ్ఞానాన్ని పొందే ప్రయత్నంలో సన్యాసమే శ్రేయస్కరంగా అర్జునునికి కనిపిస్తూ ఉంది. కాని, జ్ఞానాన్ని నాల్గవ అధ్యాయంలో ఎంతగానో ప్రశంసించి, చివరగా కర్మయోగాన్ని ఆచరించమని శ్రీకృష్ణుడు ఆదేశించడములో, ఏది శ్రేయస్కరమో చెప్పమని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రశ్నించాడు.

ఇక్కడ మరొక విషయాన్ని కూడా అర్థం చేసుకోవాలి. అప్పుడే అర్జునుని ప్రశ్నలో దాగి ఉన్న అంతర్భావం అర్థ మవుతుంది. కర్మయోగాన్ని అనుష్ఠించు! లే! అని నాల్గవ అధ్యాయం చివర చెప్పడమే కాదు, అంతకు పూర్వం ప్రవచించిన అధ్యాయాలలో కూడా కర్మ విషయాన్ని ఎంతగానో ప్రశంసించడం జరిగింది.

***న కర్మణాం అనారంభాత్***
***నైష్కర్మ్యం పురుషోఽ శ్నుతే!*** - కర్మలను ప్రారంభించకుండా మనిషి అకర్మ స్థితికి చేరలేడు *(3 - 4).*
***తస్మాద్యుధ్యస్వ భారత*** - అందుచేత, అర్జునా! యుద్ధం చెయ్యి *(2 - 18).*
***ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽ న్యత్***
***క్షత్రియస్య న విద్యతే*** - క్షత్రియునికి ధర్మయుత మైన యుద్ధం కన్నా శ్రేయస్కర మైనది మరొకటి లేదు *(2 - 31).*
***యోగే త్విమాం శృణు! బుద్ధ్యా***
***యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి!*** - కర్మయోగాన్ని చెబుతాను విను. ఈ కర్మయోగం చేత నువ్వు కర్మబంధం నుండి విడిపడతావు *(2 - 39).*
***కర్మణ్యే ఏవ అధికారః తే*** - కర్మ చేయుట యందే నీకు అధికారం ఉంది *(2 - 47).*
***తస్మా ద్యోగాయ యుజ్యస్వ*** - అందుచేత, కర్మయోగివై యత్నించు! *(2 - 50).*





***నియతం కురు కర్మత్వం***
***కర్మ జ్యాయో హ్య కర్మణః*** - నువ్వు నియత కర్మమును ఆచరించు. కర్మను మానడం కంటే చేయడమే శ్రేయస్కరము *(3 - 8).*
***అసక్తో హ్యాచరన్ కర్మ***
***పరమాప్నోతి పూరుషః*** - ఫలాపేక్ష లేకుండా కర్మ నాచరించే వాడు మోక్షమును పొందుతున్నాడు *(3 - 19).*
***వర్త ఏవ చ కర్మణి*** - నేనూ కర్మ చేస్తూనే ఉన్నాను *(3 - 22).*
***యోగ మాతి ష్ఠోత్తిష్ఠ భారత*** - అర్జునా! కర్మయోగాన్ని ఆచరించు! లే! *(4 - 42).*

సన్యాసము యొక్క వైభవాన్ని స్తుతిస్తూ భగవంతుడు చెప్పిన కొన్ని వాక్యాలను ఆలకించాము. అలాగే కర్మ శ్రేష్ఠత్వమును శ్లాఘిస్తూ పరమేశ్వరుడు పలికిన మరి కొన్ని వాక్యాలను ఇప్పుడు చూశాం. ఇంతకీ, ఈ రెండిటిలో ఏది శ్రేష్ఠము? ఏది ఆచరించాలి? ఇదీ అర్జునుని సందేహము.

పోనీ, రెండూ శ్రేయస్కరమే అంటున్నాడు కనుక, రెండిటిని ఆచరిస్తామా అంటే, కర్మయోగ, కర్మ సన్యాసాలను ఒకే వ్యక్తి ఒకే కాలంలో ఆచరించడం సాధ్య పడుతుందా? సాధ్యపడదు. ఎందుకని? జ్ఞానకర్మలను కలిసి ఆచరించడం అసంభవంగా తెలుస్తూ ఉంది ***(జ్ఞానకర్మణోః సహ అసంభవాత్!).*** జ్ఞానకర్మ సముచ్చయము అనగా జ్ఞానమును, కర్మమును ఏకం చేసి ఒకే వ్యక్తి ఆచరించడము అసంభవము (జ్ఞానకర్మ సముచ్చయము వృత్తికారుని మతము. ఆచార్యుల వారు దీనిని అంగీకరించరు సరి కదా, తీవ్రంగా ఖండించారు కూడా).

జ్ఞానకర్మలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ఇవి స్థితిగతుల వలె ఉన్నాయి. స్థితి అంటే నిలిచి ఉండటము, గతి అంటే నడవటం అని అర్థము. ఇవే స్థితిగతులు అంటే. మనిషి నిలిచి ఉన్నాడు అంటే నడవటం లేదని అర్థం. నడుస్తున్నాడు అంటే నిలబడి లేడు అని అర్థం. ఒకే కాలంలో నిలబడి ఉండటం, నడవటం పరస్పర విరుద్ధం కనుక సంభవించదు. అందుచేత కర్మయోగ, కర్మసన్యాసాలు స్థితిగతుల వలె పరస్పర విరుద్ధంగా ఉన్నాయి కాబట్టి, ఒకే వ్యక్తి ఏక కాలంలో రెండిటిని ఆచరించడం సాధ్యపడదు ***(కర్మానుష్ఠాన కర్మ సన్న్యాసయోః స్థితి గతివత్ పరస్పర విరోధాత్ ఏకేన సహ కర్తుమ్ అశక్యత్వాత్).*** కనుక ఈ రెండిటిలో ఏది శ్రేష్ఠమో, ఏది శ్రేష్ఠతర మైన పురుషార్థ సాధనమో తెలిస్తే, దానిని ఆచరించ వచ్చు అని అభిప్రాయపడి, శ్రీకృష్ణుని ప్రశ్నిస్తున్నాడు.

*ఈ అధ్యాయాన్ని సన్న్యాస యోగము లేదా కర్మసన్న్యాస యోగము అంటారు. మూడవ అధ్యాయంలో కర్మయోగ వైశిష్ట్యాన్ని విశ్లేషించి అందించిన భగవంతుడు, ఈ అధ్యాయంలో కర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొందినవాడు అందుకునే ప్రయోజనంగా కర్మసన్న్యాసమును వర్ణిస్తున్నాడు.*

**అర్జున ఉవాచ :**

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1

***సన్న్యాసం-కర్మణాం-కృష్ణ-పునః-యోగం-చ-శంససి***
***యత్-శ్రేయః-ఏతయోః-ఏకం-తత్-మే-బ్రూహి-సునిశ్చితం***

కృష్ణ = కృష్ణా!
కర్మణాం = కర్మల యొక్క
సన్న్యాసం = సన్యాసమును
పునః = మళ్ళీ

యోగం చ = కర్మ యోగమును
శంససి = ప్రశంసిస్తున్నావు
ఏతయోః = ఈ రెంటిలోను
యత్ = ఏది
శ్రేయః = శ్రేష్ఠమో
ఏకం తత్ = ఆ ఒక్క దానినే
సునిశ్చితం = చక్కగా నిశ్చయించి
మే = నాకు
బ్రూహి = చెప్పుము

**అర్జునుడు పలికెను :**

**కృష్ణా! కర్మ సన్యాసమును గూర్చి చెబుతావు. మళ్ళీ కర్మ యోగాన్ని గూర్చి చెబుతావు. ఈ రెండిటిలో ఏది శ్రేయస్కరమో ఆ ఒక్క దానినే నా కోసం నిశ్చితంగా చెప్పు.**

**వ్యాఖ్య**

**శ్రేయస్సు - శ్రేయస్కరము**

కర్మానుష్ఠాన కర్మసన్యాసాలలో ఏది శ్రేయస్కరమో చెబితే దానిని ఆచరిస్తాను అంటున్నాడు అర్జునుడు. అంటే, ఏది శ్రేయస్కరమో తాను నిర్ణయించుకో లేని స్థితిలో ఉన్నాడు. కారణం, (1) శ్రీకృష్ణుడు నాల్గవ అధ్యాయాన్ని ముగిస్తూ, నలభై ఒకటవ శ్లోకంలో ***యోగ సంన్యస్త కర్మాణం*** - ఆత్మజ్ఞానం చేత కర్మలను సన్యసించిన వాడు కర్మల చేత బంధింప బడడు అని జ్ఞానాన్ని ప్రశంసించాడు. వెంటనే (2) ***యోగమాతిష్ఠ*** - కర్మయోగాన్ని ఆచరించు అని ఆదేశించాడు. ఇది కేవలం నాల్గవ అధ్యాయం సమాప్తంలో ప్రతిపాదించింది కాదు. రెండవ అధ్యాయం నుండి నడుస్తూనే ఉంది. కాకపోతే, నాల్గవ అధ్యాయం చివర ఒకే చోట రెండిటిని ప్రస్తావించడం వల్ల అయిదవ అధ్యాయం అర్జునుని ప్రశ్నతో ఆరంభ మైంది.

ఏది శ్రేయస్కరము? అని అర్జునుడు ప్రశ్నించాడు. బాగుంది. ఎవరికి శ్రేయస్కరము? అని తిరిగి ప్రశ్నిస్తే, ఆసక్తికర మైన చాలా విషయాలు బయట పడతాయి. కర్మయోగం వరకు ఏ సంశయం లేదు. చక్కగా అర్థం అయింది. సన్యాసం విషయం లోనే మెలిక పడుతోంది.

కర్మయోగ కర్మసన్యాసాలలో ఏది శ్రేయస్కరము అనే ప్రశ్న ఆత్మజ్ఞానిని ఉద్దేశించి అడుగు తున్నాడా? లేక ఆత్మజ్ఞానము లేని వానిని ఉద్దేశించి అడుగు తున్నాడా? మరొక విషయం. అర్జునుడు పలుకుతున్న కర్మ సన్యాసము సిద్ధిరూప సన్యాసమా? లేక సాధనరూప సన్యాసమా? అంటే సిద్ధిరూప సన్యాసము, కర్మయోగములలో ఏది శ్రేయస్కరము అని ప్రశ్నిస్తున్నాడా? లేక, సాధనరూప సన్యాసము, కర్మయోగములలో ఏది శ్రేయస్కరము అని ప్రశ్నిస్తున్నాడా? ఇదీ మీమాంస. ఇక్కడే ఉంది మెలిక.

**విద్వత్ సన్యాసము**

నాల్గవ అధ్యాయంలో శ్రీకృష్ణుడు ప్రశంసించిన సన్యాసము సిద్ధిరూప సన్యాసము (విద్వత్ సన్యాసము). అర్జునుడికి అది సాధనరూప సన్యాసంగా అంటే, వివిదిషా సన్యాసంగా అర్థమై ఉండాలి. లేకపోతే, ఏది శ్రేయస్కరము అని ఎలా ప్రశ్నిస్తాడు? సన్యాసాన్ని, కర్మయోగాన్ని రెండిటిని ప్రశంసిస్తున్నావు అంటున్నాడు. పైగా, ఏది శ్రేయస్కరము అని ప్రశ్నిస్తున్నాడు.

శ్రీకృష్ణుడు చెప్పిన సన్యాసము సిద్ధి విషయం. కర్మయోగము సాధన విషయం. సాధ్య సాధనాలలో ఏది శ్రేయస్కరము అనే ప్రశ్నను ఎలా అర్థం చేసుకోవాలి? సిద్ధి విషయానికి సాధన విషయానికి పోలిక ఏమిటి?





విద్వత్సన్యాసంలో కర్మ ప్రసక్తి ఎలా వస్తుంది? ఏది శ్రేయస్కరము అని ప్రశ్నించడానికి సిద్ధిలో రెండు ఎక్కడ ఉన్నాయి? కర్మలను చెయ్యాలా, వద్దా? అనే మీమాంస కర్తృత్వ బుద్ధి గలవాడు ఉన్నప్పుడే ఏర్పడుతుంది. కర్తృత్వ బుద్ధి కలవాడు కర్త. కర్త ఉంటేనే ఏది ఆచరిస్తే శ్రేయస్కరము అనే ప్రశ్న పుడుతుంది. విద్వత్సన్యాసము అనే సిద్ధిరూప సన్యాసములో కర్త ఎక్కడున్నాడు? అక్కడ ఉన్నది అకర్త కదా! ఆత్మజ్ఞాని కదా! అతని జ్ఞానదృష్టిలో కర్మ కూడా అకర్మే కదా! ***(కర్మణి అకర్మయః పశ్యేత్ (4 - 18).*** ఇలా కర్మలో అకర్మను దర్శించే స్థితి మోక్షమే కదా! మోక్షాన్ని పొందిన విద్వత్సన్యాసిలో కర్మాచరణమునకు, సాధనకు అవకాశమే లేనపుడు, ఏది శ్రేయస్కరము అనే ప్రశ్న ఎలా ఆవిర్భవిస్తుంది? ఆత్మజ్ఞాని అకర్త కదా! అట్టి ఆత్మవిదునిలో, సమ్యగ్దర్శనానికి విరుద్ధమూ, మిథ్యాజ్ఞాన సంబంధము చేత కలిగేది అయిన కర్మయోగాన్ని స్వప్నంలో కూడా ఊహించ లేము అన్నారు గీతాభాష్యంలో ఆచార్యులు ***(ఆత్మ తత్త్వవిదః సమ్యగ్దర్శన విరుద్ధః మిథ్యాజ్ఞాన హేతుకః కర్మయోగః స్వప్నేఽ పి న సంభావయితుం శక్యతే!)***

కనుక, కర్మయోగ కర్మసన్యాసాలు అనేవి ఆత్మజ్ఞానం లేని వానిని కర్తగా స్వీకరించి నపుడే తరతమ భేదాలతో కనిపిస్తాయి. అది కూడా కర్మయోగము, కర్మసన్యాసములలో ఏది శ్రేయస్కరము అనే సందేహమే గాని కర్మయోగము, సిద్ధిరూప మైన జ్ఞానకర్మ సన్యాసములలో ఏది శ్రేయస్కరము? అని కాదు. రెండు సాధనలలో ఏది శ్రేయస్కరం అనే మీమాంసే గాని, సాధ్య సాధనాలలో ఏది శ్రేయస్కరం? అని కాదు. కనుక, అర్జునుని అంతర్యంలో ఈ ప్రశ్న ఎందుకు ఉత్పన్న మైందో ఇప్పుడు అర్థమై ఉంటుందని భావిస్తున్నాను. ఏది శ్రేయస్కరమో చెప్పుమని అడుగు తున్నాడు అంటే కర్మయోగము, విహిత కర్మాచరణమును త్యజించి జ్ఞానసాధన కొరకు అవలంబించే కర్మ సన్యాసము (వివిదిషా సన్యాసము) - ఈ రెండిటిలో ఏది శ్రేయస్కరము? అనేది అర్జునుని ప్రశ్న. ఈ ప్రశ్న ఎంత సమంజసం అనేది తరువాత చర్చిద్దాం. ఈ దశలో మాత్రం ఒక్క విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి.

కృష్ణా! కర్మల యొక్క సన్యాసమును ***(కర్మణాం సన్యాసః)*** ప్రశంసిస్తున్నావు ***(శంససి).*** మళ్ళీ ***(పునః)*** యోగమును కూడా ***(యోగంచ)*** ప్రశంసిస్తున్నావు ***(శంససి)*** అని అర్జునుడు భాషించడం సముచితంగా ఉందా? ఉంటేనే, శ్లోకంలో రెండవ పాదానికి అర్థం పొసగుతుంది. ఈ రెండిటిలో ఏది శ్రేయస్కరమో ఆ ఒక్క దానిని నిశ్చితంగా చెప్పు అనే వాక్యం అర్థయుక్త మవుతుంది. కర్మయోగమును శ్రీకృష్ణుడు ప్రశంసించింది వాస్తవమే. కాని, కర్మ సన్యాసమును కూడా ప్రశంసిస్తున్నావు అని అర్జునుడు పలికి నపుడు అది వివిదిషా సన్యాసము (సాధనరూప సన్యాసము) అని అర్జునుని అభిప్రాయం. వాస్తవానికి గీతాచార్యుడు ప్రశంసించింది విద్వత్ సన్యాసము (సిద్ధిరూప సన్యాసము). ఈ విధంగా సిద్ధిరూప సన్యాసానికి, సాధన రూప కర్మయోగానికి సామ్యము లేనపుడు, ఈ రెండిటిలో ఏది శ్రేష్ఠము అనే అర్జునుని ప్రశ్నను శ్రీకృష్ణుడు ఎలా అర్థం చేసుకోవాలి?

పోనీ, అర్జునుడు భావించి నట్లు కర్మయోగము, సాధనరూప సన్యాసమైన కర్మ సన్యాసము (వివిదిషా సన్యాసము) లలో ఏది శ్రేష్ఠము? అని అడిగాడు అనుకుందాం, అనుకున్నది అదే కనుక. ఈ రెండూ సాధన రూపాలే కావచ్చు. ఈ రెండిటిలో ఏది శ్రేయస్కరం? అని ప్రశ్నిస్తే ఎవరైనా ఏమి సమాధానం చెప్పగలరు?

కర్మయోగ, కర్మ సన్యాసముల ఫలం ఒక్కటే అయినా అవి పూర్వాపరాలు. పూర్వం అంటే ముందు కలిగేది. అపరం అంటే తరువాత కలిగేది. ముందుగా కర్మయోగంలో బుద్ధి శుద్ధి పడినవాడు, శ్రవణ మనన నిదిధ్యాసల ద్వారా జ్ఞానమును, తద్వారా సిద్ధిని పొందుటకు కర్మ సన్యాసం చేస్తాడు. ఈ విధంగా కర్మయోగ, కర్మ సన్యాసాలకు సాధన సాధ్య సంబంధ భావం ఉంది. రెండూ మోక్షార్థం సాగే సాధనలే అయినా, ఈ రెండిటి మధ్య అవ్యవహిత వ్యవహిత సాధన సంబంధం ఉంది. అవ్యవహిత సాధనము అంటే సాక్షాత్తు

సాధనము అని అర్థం. అదే కర్మ సన్యాసము. శ్రవణాదులే కర్తవ్యంగా కలిగిన నివృత్తి మార్గము. వ్యవహిత సాధనము అంటే పరంపరగా సాగే సాధనము అని అర్థం. అదే కర్మయోగము. కర్మయోగంలో అంతఃకరణ శుద్ధిని పొందిన వానికే కర్మసన్యాసము ఫలితా న్నిస్తుంది. ఒకవేళ, కర్మయోగంలో సిద్ధత్వం లేకుండా, వైరాగ్యం యొక్క ఒత్తిడి వల్ల కర్మ సన్యాసమును స్వీకరిస్తే, అలాంటి వివిదిషా సన్యాసి, సన్యాసం స్వీకరించిన తరువాత అయినా, అంతఃకరణ శుద్ధికి ప్రయత్నించ వలసి ఉంటుంది. అప్పుడే శ్రవణాదులు ఫలిస్తాయి.

**న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి!**

(కర్మయోగంలో శుద్ధి పడకుండా) కేవలం సన్యసించినంత మాత్రాన సిద్ధిని పొందడం సాధ్యపడదు అని గీతాచార్యుడు నాల్గవ అధ్యాయంలో చెప్పే ఉన్నాడు. కర్మల వల్ల జ్ఞానం రాదు అనేది సర్వవిదితం. కాని, జ్ఞానార్జనకు కర్మలు విరుద్ధం కావు అనే సత్యాన్ని కూడా అర్థం చేసుకోవాలి. అందుచేతనే,

**న కర్మణాం అనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽ శ్నుతే**

కర్మలనే ఆరంభించకుండా మానవుడు నైష్కర్మ్యస్థితిని, అనగా సిద్ధిరూప సన్యాసాన్ని పొందడం సాధ్యపడదు అని శ్రీకృష్ణుడు చెప్పే ఉన్నాడు కదా!

కర్మయోగి వివిదిషా సన్యాసమును స్వీకరించకుండానే జ్ఞానమును సముపార్జించి సిద్ధిని పొందవచ్చు. కాని కర్మ సన్యాసము చేసిన వివిదిషా సన్యాసి మాత్రం అంతకు పూర్వమే కర్మయోగమును ఆచరించి అంతఃకరణ శుద్ధిని పొంది ఉండాలి. ఒకవేళ, కర్మయోగమును ఆచరించకుండానే కర్మలను సన్యసిస్తే సన్యాస జీవనంలో నైనా ముందుగా చిత్తశుద్ధికి ఉపకరించే సాధనలను అనుష్ఠించాలి. ఈ దృక్కోణం నుండి చూస్తే, ఏది శ్రేయస్కరము అని ప్రశ్నించడం వెనుక అర్జునుని హృదయం ముంజేతి కంకణంలా కనిపిస్తుంది.

కృష్ణుడు ప్రశంసించింది సిద్ధిరూప సన్యాసాన్ని, కర్మయోగాన్ని అయితే, ఆ రెండిటిలో ఏది శ్రేయస్కరము? అనే ప్రశ్న అసలు ఉత్పన్నమే కాదు. అలా కాకుండా అర్జునుడు ఊహించినట్లు శ్రీకృష్ణుడు ప్రశంసించింది సాధనరూప సన్యాసాన్ని, కర్మయోగాన్ని అని భావించినా, ఆ రెండిటిలో కూడా ఏది శ్రేయస్కరము అనే ప్రశ్న అసంభవ మవుతుంది. కారణం, ఈ రెండూ పరస్పర విరుద్ధాలు. నేత్రముల ఉన్మీలన నిమీలనముల వంటివి. అంటే, కళ్ళు మూయుట, తెరచుట వంటివి. ఈ రెండూ ఒకదాని తరువాత ఒకటిగా ఆచరింప దగినవే గాని, రెండు కార్యాలు ఏక కాలంలో చేయుట పొసగదు. ఇందులో తరతమ భేదాలు లేనందున ఏది శ్రేయస్కరము? అనే ప్రశ్న ఉత్పన్నం కాదు.

ఇంతకీ అర్జునుని అభిమతం ఏమిటి? ఏమీ లేదు. ఎలాగైనా యుద్ధాన్ని విరమించి సన్యాసం స్వీకరించాలి అనేదే అర్జునుని అంతరంగం. దానికి అనుగుణంగా శ్రీకృష్ణుడు సన్యాసాన్ని ప్రస్తుతించాడు. ఆ వైపు నిర్ణయం తీసుకుందా మని ఆలోచించే లోగా కర్మయోగాన్ని కూడా ప్రశంసించాడు. ఇక్కడే ఏది శ్రేయస్కరం? అనే ప్రశ్న ఆవిర్భవించింది.

కర్మసన్యాసములో జ్ఞానసాధనే ప్రధానం కనుక అది సాక్షాత్తు సాధనము. కర్మయోగము పరంపరా సాధనము కనుక అదీ మోక్షసాధనమే. కాకపోతే, చిత్తశుద్ధి లేనిదే కర్మసన్యాసము ఫలించదు కనుక అర్జునునికి కర్మయోగమే శ్రేయస్కరం. ఈ మాటను మనం చెబితే ఎలా? శ్రీకృష్ణుడే చెప్పాలి. అదంతా అర్జునుని శ్రద్ధ. అందుకే భగవంతుని ప్రార్థిస్తూ ప్రశ్నించాడు. పరమేశ్వరుడు ఆశీర్వదిస్తూ సమాధానం చెబుతున్నాడు.

*ఏది శ్రేయస్కరమో అర్జునుడు నిర్ణయించుకోవడానికి ఉపకరించే విధంగా తన అభిప్రాయాన్ని చెబుతున్నాడు భగవానుడు.*





**శ్రీ భగవానువాచ :**

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయస కరా వుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే ॥ 2

*సన్న్యాసః-కర్మయోగః-చ-నిఃశ్రేయసకరౌ-ఉభౌ*
*తయోః-తు-కర్మసన్న్యాసాత్-కర్మయోగః-విశిష్యతే*

| | | | |
|---|---|---|---|
| సన్న్యాసః | = సన్యాసమును | తయోః తు | = ఆ రెండింటిలో |
| కర్మయోగఃచ | = కర్మ యోగమును | కర్మసన్న్యాసాత్ | = కర్మసన్యాసము కంటె |
| ఉభౌ | = రెండును | కర్మయోగః | = కర్మయోగమే |
| నిఃశ్రేయస కరా | = మోక్ష సాధనములే | విశిష్యతే | = శ్రేష్ఠ మైనది |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**కర్మ త్యాగము, కర్మయోగము రెండూ మోక్ష సాధనాలే. కాని, ఆ రెండిటిలో కర్మ త్యాగము కంటే కర్మయోగమే శ్రేష్ఠము.**

**వ్యాఖ్య**

తనకు ఏమి కావాలో బిడ్డ స్పష్టంగా వ్యక్తం చేయలేక పోయినా, బిడ్డ మనోగతాన్ని అర్థం చేసుకొన్న తల్లి బిడ్డ అవసరాన్ని తీర్చుతుంది. అదే మాతృహృదయం. సాధారణ తల్లుల విషయమే ఇలా ఉంటే, జ్ఞాన ప్రదాయిని గీతామాత విషయం ప్రత్యేకంగా చెప్పాలా? ఇలాంటి సందర్భాలు గీతలో అనేక చోట్ల కనిపిస్తాయి.

అమ్మ హృదయాన్ని మించింది ఆచార్య హృదయం. తనకు ఏది అవసరం అనే దానిని శిష్యుడు అర్థం చేసుకోలేక పోవచ్చు. అర్థం చేసుకున్నా ఆచార్యుని అర్థించడంలో స్పష్టత లేకపోవచ్చు. అలాంటి సందర్భాలలో శిష్యుని హృదయాన్ని అర్థం చేసుకొని, అవసరమైన విషయాన్ని ప్రేమతో అందించడంలో ఆచార్య హృదయం అమ్మ హృదయాన్ని మించి స్పందిస్తుంది. ఇక్కడే గురువు సద్గురువుగా, గురుదేవుడుగా శోభిస్తాడు.

గురువు శిష్యు లందరికీ ఒకే విషయాన్ని బోధిస్తాడు. ఒకే విధంగా బోధిస్తాడు. అర్థం చేసుకొనే శిష్యుల మనోస్థాయిని బట్టి విషయం ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అర్థమవుతూ ఉంటుంది. ఈ సత్యాన్ని శ్రీశంకరాచార్యస్వామి తమ కేనోపనిష ద్భాష్యంలో చక్కగా వివరిస్తారు.

***ఏకస్మాత్ గురోః శృణ్వతాం శిష్యాణాం మధ్యే కశ్చిత్ యథావత్ ప్రతిపద్యతే కశ్చిత్ న ప్రతిపద్యత ఇతి***

అనేక మంది శిష్యులు ఒకే గురువు వద్ద ఒకే కాలంలో విద్యను శ్రవణం చేసినా, కొందరు ఉన్నది ఉన్నట్లు అర్థం చేసుకుంటారు. కొందరు ఉన్నది ఉన్నట్లుగా ***(యథావత్)*** అర్థం చేసుకోలేరు. కొందరు లేనిది ఉన్నట్లు అర్థం చేసుకుంటారు. మరి కొందరు ఎంత చెప్పినా అర్థం చేసుకోలేరు ***(కశ్చిత్ న ప్రతిపద్యత ఇతి)*** అన్నారు ఆచార్యులు. అందరినీ అర్థం చేసుకుంటూ, అందరికీ అర్థమయ్యే లాగ విషయాన్ని అనుగ్రహించడంలో ఆచార్యునికి అసమాన ప్రతిభ ఉంటుంది.

అర్జునుడు ఏమి అడుగు తున్నాడో గీతాచార్యునికి తెలుసు. ఏదో అడగాలి అనుకొని అడగలేక పోయినా, లేదా మరో విధంగా ప్రశ్నించినా, ప్రశ్నించిన వాని మనోగతాన్ని ఎరిగి బోధించడం ఆచార్యు లందరికీ తెలుసు. ఇక గీతాచార్యుని విషయం ప్రత్యేకంగా చెప్ప వలసింది ఏముంది? అందుకే, అర్జునుడు అడిగిన ప్రశ్నకు అందంగా, అద్భుతంగా సమాధాన మిస్తున్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

అర్జునా! సన్యాస కర్మయోగాలు రెండూ మోక్షసాధనలే. జ్ఞానోత్పత్తి హేతువులే. ఆ రెండిటిలో కర్మ సన్యాసము కంటే కర్మయోగమే విశిష్ట మైనది అని చెబుతున్నాడు.

కర్మయోగ, కర్మత్యాగాలలో ఏది విశిష్టమైన మోక్షసాధనము అనేది అర్జునుని ప్రశ్న. రెండూ అనేది శ్రీకృష్ణుని సమాధానము. ఏది శ్రేయస్కరము అని అర్జునుడు ప్రశ్నిస్తూ ఉంటే, రెండూ శ్రేయస్కరమే అని శ్రీకృష్ణుని సమాధానము.

కర్మయోగ కర్మసన్యాసాలు రెండూ మోక్ష హేతువులే అయి నప్పుడు, ముక్తి సాధనలే అయి నప్పుడు, ఏది విశిష్ట మైనది అనే ప్రశ్న ఎలా తలెత్తుతుంది? ఈ శ్రేష్ఠత్వము సాధన తారతమ్యాన్ని బట్టి అర్థం చేసుకోవాలా? లేక, సాధకుని అర్హతను బట్టి అర్థం చేసుకోవాలా? రెండవదే సరియైనది.

ఒక వ్యక్తి ఒక ప్రదేశానికి వెళ్ళాలి. ఆ ప్రదేశానికి నడచి వెళ్ళడం శ్రేష్ఠమా? సైకిల్‌పై వెళ్ళడం శ్రేష్ఠమా? కారులో వెళ్ళడం శ్రేష్ఠమా? అంటే ఏమి చెప్పగలం? ఎవరి దగ్గర ఏది ఉంటే అదే శ్రేష్ఠము. చేరవలసిన ప్రదేశాన్ని చేరడమే ప్రధానము. కారు లేని వాణ్ణి కారులో వెళ్ళడం శ్రేష్ఠమని చెప్పడం సముచితమా? అర్హతను బట్టే అందలం.

**అపవర్గ మార్గంలో అర్జునుడు**

అందరూ మోక్షగాములే. అర్జునుడు కూడా మోక్షగామియే. మోక్షకామియే. కర్మయోగ కర్మ సన్యాసాలలో ఏది శ్రేయస్కరమో దానిని నిశ్చితంగా చెప్పమని అర్జునుడు ప్రశ్నించాడు. ఏది శ్రేయస్సో అది చెప్ప మంటున్నాడు. శ్రేయస్సు అంటే మేలైన దని ఒక అర్థం. మోక్షమని వేరొక అర్థము. కర్మయోగ మైనా, సన్యాస మైనా అర్జునుడు ఆచరించాలి అనుకునేది మోక్షాన్ని పొందడానికే. అందుచేత అర్జునుడు మోక్షార్థి. కనుకనే, శ్రేయస్సును వాంఛించాడు. ఈ సందర్భం లోనే కాదు, గీతారంభం నుండి స్పష్టం గానో, అస్పష్టం గానో అర్జునుడు మోక్షాన్నే కాంక్షిస్తున్నాడు.

కృష్ణా! నేను నీ శిష్యుణ్ణి. నిన్ను శరణు బొందిన వాణ్ణి. ఏది శ్రేయస్సో దానిని నాకు బోధించు. నన్ను శాసించు అని సాంప్రదాయకంగా శిష్యుని స్థాయిలో నిలబడి జగద్గురువును రెండవ అధ్యాయం లోనే మోక్షం కొరకు ప్రార్థించాడు పార్థుడు ***(యచ్ఛ్రేయస్స్యాత్ నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్*** *-2- 7).*

కేశవా! దేని చేత నేను శ్రేయస్సును పొందగలనో ఆ ఒక్క దానిని నిశ్చయించి చెప్పు! అంటూ తనకు మోక్షం తప్ప రెండవది అవసరం లేదని మూడవ అధ్యాయంలో స్పష్టం చేశాడు ***(తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్*** *- 3 - 2).*

కృష్ణా! కర్మయోగ, కర్మసన్యాసాలలో ఏది నాకు శ్రేయస్సో ఆ ఒక్క దానిని నిశ్చయించి చెప్పు అని మళ్ళీ ప్రస్తుత శ్లోకంలో ప్రశ్నిస్తున్నాడు ***(యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్).***

ఈ మూడు చోట్ల అర్జునుడు శ్రేయస్సు అనే పదాన్నే ఉపయోగించాడు. శ్రేయస్సు అంటే మోక్షము. అర్జునుని హృదయం ఆచార్యునికి అర్థమైంది కనుకనే, కర్మయోగ కర్మసన్యాసాలు రెండూ నిశ్శ్రేయస హేతువులే ***(ఉభౌ నిశ్శ్రేయస కరౌ)*** అన్నాడు అచ్యుతుడు.

మోక్షం అని అనకుండా శ్రేయస్సు అంటూ అర్థిస్తున్నాడు అర్జునుడు. మోక్షం అని ప్రస్తావించకుండా నిశ్శ్రేయస అంటూ అనుగ్రహిస్తున్నాడు శ్రీకృష్ణుడు. శ్రేయస్సు అన్నా నిశ్శ్రేయస అన్నా మోక్షమే. సౌభాగ్య





ప్రదాయిని అయిన లక్ష్మీదేవికి అష్టలక్ష్మిగా ఎనిమిది నామా లున్నట్లు, ముక్తి ప్రదాయిని అయిన మోక్షలక్ష్మికి కూడా అష్టలక్ష్మి లాగే ఎనిమిది పవిత్ర నామా లున్నాయి. అందులో శ్రేయస్సు ఒకటి. నిశ్శ్రేయస మరొకటి.

**ముక్తిః కైవల్య నిర్వాణ శ్రేయో నిశ్శ్రేయసామృతమ్ మోక్షోఽ పవర్గః**

ఇవే మోక్షలక్ష్మికి ఎనిమిది పవిత్ర నామాలు (1) ముక్తిః విడిపిస్తుంది కనుక ముక్తి. బంధాల నుండి విడిపిస్తుంది ***(పాశేభ్యః మోచయతి ఇతి).*** (2) కైవల్యమ్. కేవలావస్థ కైవల్యం. దేహేంద్రియాదుల నుండి విడిపడి అఖండంగా శోభించుట ***(అద్వితీయతయా అవస్థానం కైవల్యమ్).*** (3) నిర్వాణమ్. సర్వ కర్మలు దేని యందు విలీన మౌతాయో అదే నిర్వాణము ***(నిర్వాంతి సర్వాణి కర్మాణి అత్రేతి).*** (4) శ్రేయః. మిక్కిలి ప్రశంసార్హ మైనది శ్రేయము ***(అతిశయేన ప్రశస్యం శ్రేయః).*** (5) నిశ్శ్రేయసమ్. మిక్కిలి శ్రేయోదాయక మైనది ***(నితరాం శ్రేయః నిశ్శ్రేయసమ్).*** (6) అమృతమ్. దేని యందు మరణ ధర్మం లేదో అది అమృతము ***(నాస్తి మృతం మరణం అస్మిన్ ఇతి అమృతమ్).*** (7) మోక్షః సర్వ దుఃఖములను నశింప చేసేది మోక్షము. సర్వోపద్రవ రహిత స్థితి ***(దుఃఖాదీనాం మోక్షణం అవసానం మోక్షః).*** (8) అపవర్గః భావాల నుండి, బంధాల నుండి విడిపడటం అపవర్గము ***(భావేభ్యో పాశేభ్యో అపవర్జనం అపవర్గః).*** ఈ ఎనిమిది నామాలు మోక్షలక్ష్మికి అష్టవిధ పవిత్ర నామాలు. అర్జునుడు పలికిన శ్రేయస్సు నాల్గవది. శ్రీకృష్ణుడు ప్రవచించిన నిశ్శ్రేయసము ఐదవది.

**మోక్ష హేతువులు**

కర్మయోగ, కర్మసన్యాసాలు రెండూ మోక్షహేతువులే. మోక్షసాధనాలే. కర్మక్షేత్రం నుండి విడిపడటం చెప్పినంత సులభం కాదు కనుక, జ్ఞానపూరితంగా కర్మలను ఆచరిస్తూ ప్రశాంత జీవనమును గడపటం కర్మయోగము. కర్మను యోగంగా మార్చుకోవడమే కర్మయోగము. యోగము అంటే సంయోజనము. అంటే కలపడము. యోగము అంటే కలిపేది. కనుక కర్మయోగము అంటే కర్మను ఈశ్వరభావంతో కలిపేది. సర్వ కర్మలను, కర్మఫలాలను ఈశ్వరార్పణంలో లయం చేసేది అని అర్థం.

జ్ఞానయోగము అనేది జ్ఞానమే సాధనంగా కలది. శ్రవణమును అంగిగా, మనన నిదిధ్యాసలను అంగాలుగా స్వీకరించి, నిరంతరం జ్ఞానస్నానం చేయడమే జ్ఞానయోగము. ఇదే జ్ఞానతపస్సు. తపస్సు లన్నిటి కంటే శ్రేష్ఠమైన, పవిత్ర మైన తపస్సు. అదే సన్యాసము.

***న్యాసం ఏషాం తపసాం అతిరిక్తం ఆహుః*** - సన్యాసమే అతిశయించిన తపస్సు అన్నది వేదం. అలాంటప్పుడు జ్ఞానసాధనే అనుష్ఠించవచ్చు కదా! కర్మసన్యాసం కన్నా కర్మయోగమే శ్రేయస్కర మని భగవంతుడు ఎందుకు చెబుతున్నాడు?

జ్ఞానసాధన మహోత్కృష్ట మైనది. అందులో రెండవ ఆలోచన లేదు. కాకపోతే, అది సర్వులు ఆచరించే సులభ సాధన కాదు. నీకు నీవుగా నీలో ఆనందంగా ఉండ గలిగే స్థితే సన్యాసము. దానికి ఎంతో సామర్థ్యం ఉండాలి.

కళ్ళు మూసుకొని ఒక ప్రదేశంలో కూర్చోగలం. కళ్ళను మూయగలమే గాని మనస్సుకు మూత పెట్టగలమా? పాత రుచుల వెంట పడి పోకుండా ఆపగలమా? అలాగే శబ్దాలు వినకూడ దని నిర్జన ప్రదేశానికి పోగలము. కాని శబ్దాలను వినకుండా చెవులను ఆపలేము. జ్ఞానయోగంలో శోభించాలంటే ఎంతో పూర్వ శిక్షణ ఉండాలి. బుద్ధి శుద్ధమై ఉండాలి. అదంతా కర్మయోగం లోనే ప్రాప్తిస్తుంది. అందుకే కర్మ సన్యాసము కన్నా కర్మయోగము విశిష్ట మైనది అంటున్నాడు భగవంతుడు.

కర్మయోగము శ్రేష్ఠ మని అంటే కర్మసన్యాసమును నిరసించడ మని భావించ కూడదు. సన్యాసమును

స్వీకరించ వద్దని భగవంతుని అభిప్రాయం కాదు. సన్న్యాసము శ్రేష్ఠాతి శ్రేష్ఠమైనా సర్వులూ సులభంగా ఆచరించ గలిగేది కాదు. కష్టతర మైంది. దుస్సాధ్యంగా గోచరించే సన్న్యాసనిష్ఠను సుసాధ్యం చేస్తుంది కర్మయోగము. అందుచేత, కర్మయోగమును విశేషంగా స్తుతిస్తున్నాడు.

అంతేకాదు, కర్మసన్న్యాసానికి అనువైన శుద్ధబుద్ధిని పొందడానికి పూర్వాభ్యాసంగా కర్మయోగాన్ని అనుష్ఠించాలి. కాని, కర్మయోగానికి ఏ విధమైన పూర్వ శిక్షణ అవసరం లేదు. కర్మలు చేస్తూ, ఆ కర్మల మధ్యనే పరమేశ్వరుని అర్పించడం అభ్యాస మైతే చాలు, అట్టి ఆరాధనా భావంలో బుద్ధికి శుద్ధి సిద్ధిస్తుంది. ***(స్వకర్మణా తం అభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః - 18 - 46 . . . . కేవలం జ్ఞాన నిష్ఠా యోగ్యతా లక్షణం సిద్ధిం ఇత్యర్థః).***

కర్మయోగము ద్వారా అంతఃకరణ శుద్ధిని పొందినవాడు కర్మత్యాగమును చేసి, నివృత్తి మార్గాన్ని స్వీకరించి సన్న్యాసిగా సంచరిస్తే, అట్టివాడు సన్న్యాస ఫలాన్ని తప్పక పొందుతాడు. అలా గాక, కర్మయోగానుష్ఠానమే లేక, బుద్ధి శుద్ధిపడక, కర్మభారాన్ని దించుకోవచ్చు అని కేవలము వేషధారణతో సన్న్యాసి అయినవాడు సన్న్యాసము యొక్క ఫలాన్ని అందుకో లేడు. అలాంటి జ్ఞానరహిత సన్న్యాసం కన్నా, సన్న్యాసానికి బుద్ధిని శుద్ధిపరచే కర్మయోగము విశిష్ట మైనది కదా! అందుకే పరమేశ్వరుడు కర్మయోగాన్ని స్తుతించాడు ***(తయోః కర్మసన్న్యాసాత్ కేవలాత్ కర్మయోగః విశిష్యతే ఇతి కర్మయోగం స్తౌతి).***

*ఇలా చెప్పడం ఎందుచేతనో వివరిస్తూ, నిజమైన సన్న్యాసి ఎవరో ప్రవచిస్తున్నాడు.*

**జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।**
**నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధా త్ప్రముచ్యతే ॥** 3

***జ్ఞేయః-సః-నిత్యసన్న్యాసీ-యః-న-ద్వేష్టి-న-కాంక్షతి***
***నిర్ద్వన్ద్వః-హి-మహాబాహో-సుఖం-బంధాత్-ప్రముచ్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = అర్జునా! | | జ్ఞేయః | = | తెలియ దగిన వాడు |
| యః | = ఎవడు | | నిర్ద్వంద్వః | = | ద్వంద్వములను విడిచిన వాడు |
| న ద్వేష్టి | = ద్వేషించడో | | సుఖం | = | సుఖముగా |
| న కాంక్షతి | = కోరడో | | బంధాత్ | = | సంసారబంధము నుండి |
| సః | = వాడు | | ప్రముచ్యతే హి | = | విడువ బడతాడు |
| నిత్యసన్న్యాసీ | = సదా సన్న్యాసిగా | | | | |

**అర్జునా! ఎవరినీ ద్వేషింపని వాడు, దేనినీ కోరని వాడు నిత్య సన్న్యాసి. అతడు ద్వంద్వాల నుండి విడిపడ్డాడు. కనుక బంధాల నుండి సుఖంగా విముక్తు డవుతాడు.**

**వ్యాఖ్య**

మానవ మస్తిష్కంలో ఎన్నో ఊహలు ఉంటాయి. అవన్నీ ఊహలే. ఊహలన్నీ వాస్తవాలు కావు. అందుచేతనే, ఎంత గొప్ప ఊహలైనా, పువ్వు ల్లాగా కాలంలో వాడి పోతాయి. ఎంతో కాలం నిలవవు. నిలబడటానికి ఊహలకు కాళ్ళు లేవు.

వాస్తవాలకు కాళ్ళే కాదు. రెక్కలు కూడా ఉన్నాయి. అవి నిలబడటమే కాదు, అవసరమైతే అంబరంలో విహరిస్తాయి కూడా. ఊహలు బుద్ధిలో ఒక వైపు ఉండినా, వాస్తవాలే బుద్ధిలో చోటు చేసుకోవాలి. ఏ వాస్తవ మైనా జ్ఞానరూపం లోనే ఉంటుంది. జ్ఞాతవ్యం గానే ఉంటుంది. జ్ఞేయం గానే ఉంటుంది. దేని నైనా జ్ఞానం తోనే గ్రహించాలి. అప్పుడే ఊహల స్థానంలో వాస్తవాలు ఊరేగుతాయి.





కర్మల యందు అకర్మను దర్శించే వాడు, తాను అకర్త అనే సత్యానుభూతిలో ప్రకాశించే వాడు జ్ఞాని. ఆత్మజ్ఞాని. బంధానికి కారణమైన కర్మను, కర్మకు కారణమైన అజ్ఞానముతో సహా జ్ఞాన మనే అగ్ని చేత దగ్ధం చేసిన వాడు. సర్వమును త్యజించిన వాడు. సమస్తమును తన యందే దర్శించే వాడు. ఇతడే జ్ఞానకర్మ సన్న్యాసి. అంటే, తాను అకర్త అనే ఆత్మజ్ఞానం చేత సమస్తమైన కర్మలను త్యజించిన వాడు. సిద్ధపురుషుడు.

**ఉభయులూ ముముక్షువులే**

తాము కూడా సిద్ధపురుషులు కావాలని యత్నించే వారు సాధకులు. వారిలో ఒకడు కర్మయోగి. మరొకడు కర్మసన్న్యాసి. వీరు ఇరువురూ సాధకులే. సాధ్యం వైపు నడక సాగించే వారే. సాధ్యం మోక్షం కనుక, మోక్షమే పరమావధిగా భావించి జీవించే వీరిరువురు ముముక్షువులే. వీరిరువురు కర్తలుగా ఉన్నవారే. ముక్తపురుషుడు అకర్తగా శోభిస్తూ ఉంటే, ముముక్షువు లైన వీరు కర్తలుగా చరిస్తూ, అకర్త స్థాయిని అందుకోవడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. ఈ స్థితి గతుల్ని చక్కగా అర్థం చేసుకోవాలి. అకర్త అయిన ముక్త పురుషుని స్థితిని, సాధకు లైన సన్న్యాస, యోగుల గతులను స్పష్టంగా అర్థం చేసుకోవాలి.

కర్మయోగి కర్మాచరణంలో ఉంటాడు. ఎన్నో బాధ్యతలను వహిస్తూ ఉంటాడు. మరెన్నో బరువులను మోస్తూ ఉంటాడు. తాను చేయవలసిన పనులు ఎన్నో ఉంటాయి. కర్తవ్యాల మధ్యన అతని కాళ్ళు చరిస్తూ ఉంటాయి. చర్యల మధ్యనే చేతులు చలిస్తూ ఉంటాయి. అలాంటి వాడు గృహస్థు కావచ్చు. కాకపోవచ్చు. కాని, సన్న్యాసి మాత్రం కాడు. ఆచరించవలసిన కర్మలు ఉన్నవాడు, కర్మల చేత చుట్టబడిన వాడు పరిత్యాగి ఎలా అవుతాడు?

కనుక కర్మల లోనే ఉంటూ, అవగాహనతో కర్మల లోనే కదులుతూ, తాను ఆచరించే ప్రతి పనిని పూజగా మార్చుకుంటాడు. కర్మను యోగంగా తీర్చిదిద్దుకుంటాడు. కర్మయోగిగా శోభిస్తాడు.

కర్మాచరణంలో ఈశ్వరార్పణ బుద్ధితో పవిత్రంగా ఉంటాడు. కర్మఫలాసక్తి లేనివాడు కనుక, ఫలానుభవంలో ప్రశాంతతను పోగొట్టుకోడు. ప్రసాద బుద్ధి కలిగి ఉంటాడు. ఇలా బుద్ధిని కర్మలలో శుద్ధి చేసుకుంటూ, మోక్ష సాధనమైన జ్ఞాన సముపార్జనకు యోగ్యమైన అంతఃకరణ శుద్ధిని తయారు చేసుకుంటూ ఉంటాడు. కర్మలలో ఉన్నా, రాగద్వేషాలను త్యజించి ఉంటాడు. త్యాగమే సన్న్యాసము కనుక, అలా చూచి నపుడు కర్మయోగి కూడా సన్న్యాసియే. **జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ** - ఆ కర్మయోగి నిత్య సన్న్యాసిగా తెలుస్తున్నాడు **(జ్ఞేయః జ్ఞాతవ్యః సః కర్మయోగీ, నిత్యసంన్యాసీ** - శ్రీ శంకర భాష్యము).

కర్మలలో ఉండే సాధకుడు కర్మయోగి అయితే, ప్రధానమైన జ్ఞానసాధనే లక్ష్యంగా పెట్టుకొని కాలాన్నంతా శ్రవణ మననాదుల యందే వినియోగించు కోవాలని, వివేక వైరాగ్యాలను తోడు చేసుకొని, విహిత కర్మలను కూడా త్యజించి, ఆశ్రమ స్వీకారం చేసి, తదేక జ్ఞాననిష్ఠలో కాలం గడిపే వాడు సన్న్యాసి. ఇతడు కర్మలను త్యజించి కర్మసన్న్యాసి అయ్యాడు. జ్ఞానాన్ని పొందితే జ్ఞానకర్మ సన్న్యాసి అవుతాడు.

జ్ఞాననిష్ఠ లోనే కాలాన్ని సద్వినియోగం చేసుకునే యతిపురుషునికి కాలాన్ని హరించే కర్మలు ప్రతిబంధకాలుగా కనిపిస్తాయి కనుక వాటిని త్యజిస్తాడు. సదా సన్న్యాసం లోనే, అనగా సన్న్యాసజీవనం లోనే ఉంటాడు. సదా సన్న్యాస ప్రవృత్తే అతనిలో ప్రధానంగా ఉంటుంది కనుక అతడు సదా సన్న్యాసి. ఆ సదా సన్న్యాసే నిత్యసన్న్యాసి అని తెలుసుకోవాలి **(జ్ఞేయః సః నిత్యసంన్యాసీ).**

**నిత్యసన్న్యాసి**

నిత్యమైన మోక్షం కొరకు అనునిత్యమూ ప్రయత్నం చేసేవాడు నిత్యసన్న్యాసి. ఈ ప్రయత్నం కర్మయోగం

ద్వారా జరిగినా, లేదా సన్యాసము ద్వారా జరిగినా, అలా ప్రయత్నించే సాధకుడు ఎవడైనా నిత్య సన్యాసియే. నిత్యసన్యాసి సర్వసంగ పరిత్యాగి గానే ఉండాలి అనే నియమం లేదు. కర్మయోగి కూడా కావచ్చు. ఎవరు రాగద్వేషాల నుండి విడిపడతారో వారే నిత్యసన్యాసులు ***(యోన ద్వేష్టి న కాంక్షతి).***

దేనినీ ద్వేషించని వాడు, దేనినీ కాంక్షించని వాడు నిత్యసన్యాసి. దుఃఖాన్ని, దుఃఖ కారణాలను ద్వేషించని వాడు ***(యః న ద్వేష్టి కించిత్).*** అలాగే సుఖాన్ని, సుఖ కారణాలను కాంక్షించని వాడు ***(న కాంక్షతి సుఖదుఃఖే తత్సాధనేచ)*** నిత్యసన్యాసి. ఈ లక్షణం కలిగిన వాడు కర్మయోగి అయినా, సన్యాసి అయినా అతడు నిత్యసన్యాసియే.

రాగద్వేషాలే బంధహేతువులు. విషం పాములో కాదు, పాము కోరలలో ఉంది. కోరలు తీసిన పాము బాధించ లేదు. హాని చేయలేదు. కర్మలో దోషం లేదు. రాగద్వేషాలతో కూడి నపుడే కర్మలు దోషపూరితాలై బంధహేతువులు అవుతాయి. రాగద్వేషాలు లేనపుడు కర్మలను త్యజించినా, లేదా ఆచరించినా పెద్ద తేడా ఉండదు. చేయని కర్మలు మనిషిని ఎలా బంధించవో, చేసిన కర్మలు కూడా బంధించవు. రాగద్వేషాలు లేకుండా కర్మలను ఆచరించే కర్మయోగి గృహస్థుడైనా సన్యాసియే. కర్మలలో అతడు ప్రవర్తిస్తూ ఉండినా, అతడు నిత్యసన్యాసియే అని శ్రీ మధుసూదన సరస్వతి ఈ సందర్భంలో వ్యాఖ్యానించారు ***(స కర్మాణి ప్రవృత్తః అపి నిత్యం సన్యాసి ఇతి జ్ఞేయః).*** రాగద్వేష రహితుడైన కర్మయోగి గృహస్థుడైనా నిత్యసన్యాసిగా తెలియబడే టప్పుడు, అట్టి పుణ్యాత్ముడు వసించే గృహం ఆశ్రమమే. తపోవనమే ***(నివృత్తి రాగస్య గృహం తపోవనం).***

**బాహ్య కర్మ సన్యాసము**

రాగద్వేషాలు రెండూ ఆసక్తులే. రాగద్వేషాలు అనేవి మనిషి అంతర్యంలో ఉంటాయి. మనస్సును ప్రశాంతంగా ఉండనివ్వవు. బలవంతంగా బాహ్యానికి ఈడుస్తాయి. ప్రపంచం వైపు పరుగులు తీయిస్తాయి.

రాగద్వేషాలను మనస్సులో ఉంచుకొని, కర్మలను బాహ్యంలో త్యజించినంత మాత్రాన, వాడు సన్యాసి కాలేడు. కేవలం పనులు విడిచి పెట్టడమే సన్యాస మైతే, ప్రపంచ మంతా సన్యాసులతో నిండి పోయేది.

సన్యాసి సోమరి కాడు. కర్మాచరణము నందు సామర్థ్యము లేనివాడు కాడు. కర్మలను చూచి భీతి చెందేవాడు కాడు. జ్ఞాన సముపార్జనమే సన్యాసికి ప్రధానమైన విషయం కావడం చేత, సర్వ కర్మల నుండి, సమస్తము లైన బాధ్యతల నుండి విడిపడి కేవలం జ్ఞానాభ్యాసం లోనే కాలం గడుపుతాడు. ఇహపర సుఖాల యందు కోరిక లేనివాడై ఉంటాడు. సమస్తాన్ని త్యజించి సదా జ్ఞానార్జనే ప్రధానంగా చేసుకొని జీవిస్తాడు. అందుకే హిందూ సమాజము సన్యాసిని గౌరవించి పూజిస్తుంది. భిక్ష పెట్టి పోషిస్తుంది.

ఇదే పవిత్రమైన యతి జీవనము. జ్ఞాన నిష్ఠకు సంబంధించిన విషయము. అంతేగాని, సన్యాసి అంటే సంసారానికి భయపడి, అసమర్థుడై ప్రపంచం నుండి పలాయనం చిత్తగించే పిరికిపంద కాడు.

**ఆఖ్యాయిక**

వేదాంత ప్రవచనాలు చేయాలనే ఉబలాటంతో నాలుగు పుస్తకాలు చకచకా చదివేసి, ప్రవచనాలను ప్రారంభించాడు ఒక ప్రసంగి. మొదటి రోజు ప్రవచనానికి జనం బాగానే హాజరయ్యారు. రోజులు గడిచే కొద్ది సంఖ్య తగ్గిపోతూ ఉండటం, ఒకరోజు వచ్చిన వారు మరెప్పుడూ సభా ప్రాంగణంలో కనిపించకుండా పోవటం జరుగుతూ వచ్చింది. ఒక్క వ్యక్తి మాత్రం ప్రారంభ దినం నుండి సమాప్తి రోజు వరకు ప్రతిరోజు క్రమం తప్పకుండా హాజరయ్యాడు.

సమాపనోత్సవంలో ప్రబోధకుడు మాట్లాడుతూ, 'మిత్రులారా! ఈ సమావేశాల ముగింపు సందర్భంలో





ఒక వ్యక్తిని నేను అభినందించకుండా ఉండలేక పోతున్నాను. అడుగో, ఆ వ్యక్తి ఒక్క ఉపన్యాసాన్ని కూడా వదిలి పెట్టకుండా విన్నాడు. ఆయన శ్రద్ధకు నా జోహార్లు' అన్నాడు.

వెంటనే ఆ వ్యక్తి లేచి నిలబడి, 'అయ్యా! మీ ప్రశంసకు నా ధన్యవాదాలు. నిజం చెప్పాలంటే, నేను ప్రతిరోజు తమరి ప్రసంగాలకు వచ్చింది వాస్తవమే అయినా, ఏ రోజు తమరి ప్రసంగం నేను వినలేదు. నా భార్య నన్ను ఎక్కడైనా వెతుకుతుంది గాని, ఇక్కడ మాత్రం పొరపాటున కూడా వెతకదు. అందుకే రోజూ వచ్చి ఇక్కడ కూర్చొనే వాణ్ణి' అని చెప్పి కూర్చున్నాడు.

ఎవరు ఏమిటో, ఎక్కడ ఎందుకున్నారో, ఏమి చేస్తున్నారో ఎవ్వరికీ అర్థం గాని ప్రపంచ మిది. ఆధునిక ప్రపంచంలో ఎక్కువ శాతం సన్యాసులు కూడా ఇలాగే వర్ధిల్లు తున్నారు.

ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించలేని వారు, కుటుంబ ధర్మాన్ని పోషించలేని వారు, ఊకదంపుడు కబుర్లతో చర్చలతో కాలహరణం చేసేవారు సన్యాసాన్నే సుఖ జీవన విధానంగా మలచుకొని బ్రతుకును ఈడుస్తున్నారు. కనుక, కర్మలను త్యజించిన వారందరూ సన్యాసులు కాలేరు. పైకి వేషంతో కనిపించే వాడు కాదు, లోపల తోషంతో ఉండేవాడే సన్యాసి. సంతోషంతో ఉండేవాడే సన్యాసి. అతడి ఆనందం ప్రపంచం మీద ఆధారపడి లేదు. ప్రపంచంలో సుఖహేతువులుగా కనిపించేవి దేశకాలాదులను బట్టి ప్రత్యక్షం గాను, పరోక్షం గాను తెలుస్తూ ఉంటాయి. కాని, తనకు తానెప్పుడూ పరోక్షం కాడు కనుక, సదా ఆనందం తోనే ఉంటాడు. అతడే నిత్యసంతోషి. నిత్యసన్యాసి.

సన్యాసి కానివాడు కర్మలలో ఉంటాడు. రాగద్వేషాలు ఉండటం చేత అతడు కర్మలకు దూరం కాలేడు. కాకపోతే, కర్మల లోనే ఉంటూ రాగద్వేషాలను తటస్థ పరచి, పనిని పూజగా మార్చుకుంటాడు. కర్మను యోగంగా తీర్చి దిద్దుకుంటాడు. అతడే కర్మయోగి. రాగద్వేషాలను నిర్వీర్యం చేసే శక్తి కర్మయోగికి ఉంటుంది. ఈ విధంగా కర్మయోగంలో శుద్ధిపడిన వాడు, ఒకవేళ సన్యాసమును స్వీకరించాలని అభిప్రాయ పడితే, అతడు విహిత కర్మలను కూడా త్యజించి, కేవలం శరీరయాత్రకు అవసర మయ్యే కర్మలను మాత్రమే నిర్లిప్తంగా ఆచరిస్తూ, తన కాలాన్నంతా శ్రవణ మననాది జ్ఞానసాధనలో వినియోగించు కుంటాడు.

కర్మయోగి రాగద్వేషాలను తటస్థం చేశాడు కనుక, అతడు కూడా సన్యాసియే. వివిదిషా సన్యాసి కర్మయోగములో నిష్ణాతుడై సన్యాసమును స్వీకరించాడు కనుక, రాగద్వేషాలను దాటిపోయిన అతడు కూడా సన్యాసియే. సన్యాసము అంటే ఏదో కాదు, సరియైన త్యాగమే సన్యాసము ***(సమ్యక్ న్యాసః ఇతి సన్న్యాసః).*** రాగద్వేషాలను త్యాగం చేయగలిగిన వాడు ఎవ్వడైనా సన్యాసియే. అతడు కాషాయ వస్త్రమే ధరించాలని లేదు. ఖద్దరైనా ఫరవాలేదు. కొందరు భాగ్యవంతులు కౌపీనం తోనే సరిపెట్టు కున్నారు. సిరి గల వారుగా శోభించారు ***(కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః).*** సన్యాసమే పుచ్చుకోవాలి అని లేదు. సన్యాసి మనస్తత్వంతో జీవించ గలిగితే చాలు. అలా కాకుండా, రాగద్వేషాలను మనస్సు లోనే దాచుకొని, సన్యాసాశ్రమం స్వీకరించి, కర్మలను త్యాగం చేసేవాడు అటు కర్మయోగి కాలేడు, ఇటు సన్యాసి కాలేడు. 'ఉభయ భ్రష్టత్వం - ఉప్పర సన్యాసం' అనే సామెత ఇలాంటి వాళ్ళ తోనే పుట్టింది.

సన్యాసమును ఎవరు స్వీకరిస్తారు? రాగద్వేషాలు ఉపశమించిన వాడు, ప్రాపంచిక వ్యామోహాలు నశించిన వాడు, బాహ్య ఆకర్షణలు నిర్వీర్య మైనవాడు, జ్ఞానసాధనకు పనులు ఆటంకం కనుక, సమయాన్నంతా సత్య జీవనానికే వినియోగించుకోవాలనే ఉద్దేశంతో కర్మయోగంలో ఉత్తీర్ణుడైన వాడు సన్యాసాన్ని స్వీకరిస్తాడు. అతడు సర్వకర్మ వినిర్ముక్తుడు. జ్ఞానసాధనే ప్రధాన కర్తవ్యంగా కలిగిన వాడు. మరో కర్తవ్యం లేనివాడు. ఉండకూడని వాడు అని శాస్త్ర నిర్ధారణం.

ఇలా ఎందరు సన్యాసు లున్నారు? ఎందరు ఉండగలరు? ఎందరున్నా రనేది ప్రశ్న కాదు. ఏ ఒక్కడున్నా అతడే సన్యాసి అనేది సమాధానం. మిగిలిన వారు కర్మలను విడిచి పెట్టిన వారే గాని సన్యాసులు కారు. ఒక వైపు రాగద్వేషాలు రెచ్చగొడుతూ ఉంటే, మరో వైపు సన్యాస ధర్మాన్ని నిర్వర్తించే శక్తి లేక మనస్సు దిగాలు పడుతూ ఉంటే, కేవలం బాహ్య కర్మసన్యాసం చేసిన సన్యాసి ఏం చేస్తాడు? ఏదైనా చేస్తాడు, జ్ఞానసాధన తప్ప. ఆత్మధ్యానం తప్ప.

పరిస్థితుల ఒత్తిడికి తలవంచి కొందరు, బ్రతుకులో ఓడిపోయి కొందరు, సమస్యలతో సతమతమై కొందరు, తాత్కాలిక ఆవేశాలతో మరి కొందరు సన్యాసం పుచ్చుకుంటూ ఉంటారు. సన్యాసానికి ఇవేవీ అర్హతలు కావు. రాగద్వేషాలను నిర్వీర్యం చేయకుండా, ఇలాంటి కారణాల వల్ల గాని, లేదా సమాజం నుండి గౌరవ స్థానాన్ని ఆశించి గాని సన్యాసాన్ని స్వీకరించిన వారు, తాము ప్రమాదంలో పడటమే కాకుండా, సన్యాసాన్నే ప్రమాదంలో పడేస్తారు. ఆధునిక యుగంలో ఎక్కువ శాతం ఇలాంటి వారే సన్యాసులుగా చెలామణి అవుతున్నారు.

శాస్త్ర పరిజ్ఞానం ఉండదు. మోక్షాపేక్ష అడుగంటి ఉంటుంది. సన్యాసం స్వీకరించక ముందు ఏ రాగద్వేషా లైతే మనస్సులో ఉండిపోయాయో, నిండి ఉన్నాయో, సన్యాసాశ్రమం స్వీకరించిన తరువాత అవే విజృంభిస్తూ ఉంటాయి. అందుచేత, జ్ఞానసాధన నిరాటంకంగా సాగించాలని సన్యాసమును స్వీకరించిన వ్యక్తి, ఆశయాన్ని ఆకాశానికి వదిలేసి, రాగద్వేషాలకు పీట వేసి, తదనుగుణ మైన కార్యాలను నిర్వహిస్తూ ఉంటాడు.

ఒక సన్యాసి ఆసుపత్రిని ఆరంభిస్తాడు. దానిని ఆదర్శంగా తీర్చి దిద్దడమే తన జీవితాశయము అంటాడు. మరొక సన్యాసి విద్యాలయాన్ని స్థాపిస్తాడు. విద్య ద్వారా సమాజంలో వెలుగులు నింపడమే తన జీవిత లక్ష్యం అంటూ ఊగిపోతూ ఉంటాడు. ఒక మహాపురుషుడు రాజకీయాల్లో ప్రవేశించి ఎన్నికలలో నిలబడతాడు. కుళ్ళును కడిగి వేయడమే తన బ్రతుకుకు గమ్యం అంటూ సిగ్గు విడిచి వ్యర్థ ప్రలాపాలు చేస్తూ ఉంటాడు. గ్రహపాటు లోదై పదవి కూడా వస్తే నిర్లజ్జగా కుర్చీలో కూల బడతాడు. కాషాయాన్నే కలుషితం చేస్తాడు.

ఇలాంటి కుహనా సన్యాసులకి, నాటకాలలో, సినిమాలలో సన్యాసి వేషం ధరించే వారికి తేడా ఏముంది? నటుడు నటించినంత కాలమే సన్యాసి పాత్రను పోషిస్తాడు. ఈ కేవల బాహ్య కర్మసన్యాసి జీవించినంత కాలం నటిస్తూనే బ్రతుకుతాడు. కాకపోతే, నటుడు నటుడే గాని సన్యాసి కాడు అనే నిజం ప్రజలకు తెలుసు. ఈ కపట సన్యాసి విషయంలో అలా తెలుసుకొనే అవకాశం కూడా లేదు.

జ్ఞానాసక్తి లేక, పరిస్థితులకు బానిసై, సన్యాసి ఒక వైపు దారి తప్పి చరిస్తూ ఉంటే, మరో వైపు సమాజంలో వివేకం లేని వారు ఇలాంటి సన్యాసులను ప్రోత్సహిస్తూ, పూజిస్తూ ఉంటారు. ఈ పరిస్థితి సమాజ అభ్యుదయాన్ని చావుదెబ్బ కొడుతుంది. అంతటితో ఆగదు. సన్యాస వ్యవస్థనే క్రుంగ దీస్తుంది. ఈ విధమైన మిథ్యా జీవనాన్ని సాగించే కుహనా సన్యాసుల మార్గంలో మీరూ ఎందుకు చరించరు? అని పవిత్రులైన నిత్య సన్యాసులను కూడా ప్రశ్నించే ఒక వర్గం తయారవుతుంది. ఆధునిక సమాజంలో తయారైంది కూడా. ఇది సమాజానికి పట్టిన దుర్దశ. వ్యక్తుల పాలిటి దురదృష్టం.

**నిజ సన్యాసము**

దేనినీ ద్వేషించని వాడు, ఎవరినీ ద్వేషించని వాడు సన్యాసి ***(న ద్వేష్టి).*** దేనినీ కాంక్షించని వాడు, తన సుఖానికి మరొకరిపై ఆధార పడనివాడు సన్యాసి ***(న కాంక్షతి).*** తనను ఆకర్షించేది ప్రపంచంలో ఏదీ లేదు.





అతనిలో ఆసక్తిని రేకెత్తించే శక్తి ఎవ్వరికీ ఉండదు. ఏది ఉన్నా, ఎవరు ఉన్నా, ఏవేవి తనను అంటి పెట్టుకొని ఉన్నా, అవన్నీ అతని చుట్టూ ఉంటాయే గాని, అతని మనస్సులో ఉండవు. అలాగే నేడున్నవి మరువాడు లేకపోవచ్చు. లేనివి లేకుండా ఉంటాయే గాని, అతనిలో నిరాశను నింపే స్థాయిలో ఉండవు. అలాంటి మహాత్ముని కర్మలు ఎలా బంధిస్తాయి? ఆసక్తి లేనివాణ్ణి ఆకర్షించే శక్తి ఎవరికుంది? రాగద్వేషాలు లేనివాడు కనుక, అలాంటి నిత్యసన్యాసి కర్మలలో ప్రవర్తిస్తున్నా, వాటి చేత అంట బడడు. ఈ విషయంలో కర్మసన్యాసి ఎలా శోభిస్తున్నాడో, కర్మయోగి కూడా అలాగే శోభిస్తున్నాడు. ఉభయులూ తామరాకు మీద నీటిబొట్టు లాగా అంటకనే కర్మలలో కదులుతున్నారు ***(ఏవం విధః యః కర్మణి వర్తమానః అపి రాగద్వేషాది అయోగాత్ సః నిత్య సన్యాసీ ఇతి జ్ఞాతవ్యః ఇత్యర్థః).***

**ఉభయమును దాటిన అభయస్థితి**

బ్రతుకులో బంధాలను కలిగించేవి, భయాలను అందించేవి ద్వంద్వాలు. అందాలను, ఆనందాలను అదృశ్యం చేసేవి ఈ ద్వంద్వాలే. ద్వంద్వం ఏదో కాదు, ద్వైతమే ద్వంద్వం. సుఖదుఃఖాల రూపంలో అరుదెంచినా, మానావమానాలుగా దర్శన మిచ్చినా, జయాపజయాలుగా ఊరేగినా, శీతోష్ణాలుగా చలింప చేసినా - అవన్నీ ద్వంద్వాల చిందులే. మ్రింగలేని మందులే. ఈ ద్వైతబంధం నుండి విడిపడి పోయిన వాడు నిత్యసన్యాసి ***(నిర్ద్వంద్వః ద్వన్ద్వ వర్జితః).*** అలాంటి సుకృతాత్ముడు సమస్త బంధాల నుండి సుఖంగా విడిపడి పోతాడు. అతడి బంధవిముక్తి సహజంగా, అనాయాసంగా జరిగి పోతుంది ***(సుఖం బన్ధాత్ అనాయాసేన ప్రముచ్యతే).***

**ఆఖ్యాయిక**

సత్యం సత్యంగా తెలియనంత కాలం అసత్యాలే సత్యాలై మనిషిని ఆకర్షిస్తూ ఉంటాయి. బ్రతుకును అస్తవ్యస్తంగా మార్చుతూ ఉంటాయి. ఆ దశలో అసత్యపు ఆకర్షణల నుండి విడిపడా లనుకున్నా, మనిషి విడిపడ లేడు. అదే వ్యక్తికి సత్యం వంట పడితే, మిథ్యారూప ఆకర్షణ లన్నీ వ్యక్తి ప్రయత్నం లేకుండానే అతని నుండి జారి పోతాయి. సత్యావగాహనలో అన్నీ ఇలాగే జరిగిపోతూ ఉంటాయి.

ఒక యువకుడు ఒక యువతిని గాఢంగా ప్రేమిస్తాడు. ఆ యువతి కూడా అతణ్ణి అలాగే ప్రేమిస్తుంది. వారి ప్రేమ పెళ్ళి దాకా ప్రాకింది. అమ్మాయిది సంపన్న కుటుంబం. అబ్బాయి అనాథ.

యోగ్యుడు అని తెలిసిన తరువాత అనాథుడే అయినా, తన ఏకైక పుత్రికను ఇచ్చి వివాహం చేయడానికి యువతి తల్లిదండ్రులు అంగీకరించారు. ఇల్లరికానికి యువకుడు కూడా అంగీకరించాడు. ఆ నాటి నుండి పెళ్ళి పనులు చూసుకుంటూ అమ్మాయి ఇంటి లోనే అబ్బాయి ఉండిపోయాడు. పెళ్ళి పత్రికలు కూడా తయారయ్యాయి. పనులన్నీ చకచకా జరిగి పోతున్నాయి. ఇల్లంతా ఆనంద తాండవమే.

జీవితం చాలా విచిత్ర మైంది. మానవు లందరూ విధి చేతిలో కీలుబొమ్మలే. ఎప్పుడు ఏమి జరుగుతుందో, ఎలా జరుగుతుందో, ఎలాంటి నాటకీయ పరిణామాలు చోటు చేసుకుంటాయో ఎవ్వరూ ఊహించ లేరు. ఊహించని వన్నీ జరిగేది జీవితాల లోనే కదా! అలాంటి ఊహ కందని పరిస్థితి ఆ ఇంట్లో చోటు చేసుకుంది.

అమ్మాయి మెడ గొలుసు లాకెట్‌లో రెండు ఫోటోలు కనిపించాయి వరుడికి. వాటిని చూడగానే ఆ యువకుడు ఏదో అయిపోయాడు. అతని స్మృతిలో ఏదో కలవరం ప్రారంభ మైంది. క్షణాల్లో అదొక భయంకర మైన వాస్తవాన్ని ఆవిష్కరించింది. విచారణలో దారుణమైన సత్యం బయట పడింది.

ఆ లాకెట్ లోని రెండు ఫోటోలలో కనిపిస్తున్న స్త్రీ పురుషులు గతించిన తన తల్లిదండ్రులే అని వరుడికి తెలిసి పోయింది. మరి, వాళ్ళ చిత్రాలు ఈ అమ్మాయి లాకెట్ లోకి ఎలా వచ్చాయి? వాస్తవాలు తెర మీద కొచ్చాయి.

రెండు దశాబ్దాల క్రితం తిరునాళ్ళలో తప్పిపోయిన తన ఏకైక చెల్లెలే ఈ అమ్మాయి అని నిర్ధారణ అయింది. సంతానం లేని తమకు దైవ ప్రసాదంగా అమ్మాయి లభించిందని, పెంపుడు కూతురు విషయాన్ని ఆ తల్లిదండ్రులు కూడా బయట పెట్టారు.

యువకుని చేతి లోని వివాహ పత్రికలు అప్రయత్నంగా జారి క్రింద పడ్డాయి. కొన్ని క్షణాల క్రితం మనసంతా వివాహ వైభవాలతో ఊగి పోయింది. ఈ క్షణంలో ఆ ఆలోచనే భయంకరంగా ఉంది. సత్యం తెలిసిన క్షణంలో ఆకర్షణలు ఎటు పోతాయో వాటిని పోగొట్టుకున్న వారికి కూడా అర్థం కాదు. మిథ్యా జీవనంలో అన్నీ కలలే. మేలుకుంటే అన్నీ కల్లలే.

ఈ విధంగా త్యాగియైన వాడు నిత్యసన్యాసి. అతడు కర్మలలో ఉన్న కర్మయోగి కావచ్చు. లేక కర్మలను త్యజించిన సన్యాసి కావచ్చు. అతడు ఎక్కడున్నాడు అనేది విషయం కాదు. అతని మనస్సు ఎలా ఉంది అనేదే ప్రధానం. ఎవరైనా త్యాగం చేతనే సుఖిస్తారు ***(త్యాగే సర్వేషాం సుఖం భవేత్).*** ఆత్మత్యాగమే సన్యాసము ***(సమ్యక్ న్యాసః ఇతి సన్న్యాసః).***

*సన్న్యాస కర్మయోగు లిరువురికీ మోక్షమే గమ్యం అని అర్థం చేసుకున్నాం. మరి, వారు అనుష్ఠించే పద్ధతులు వేరుగా ఉన్నప్పుడు, ఫలితాలు కూడా భిన్నంగా ఉండాలి కదా! అనేది శంక. ఆ శంకను పరిహరిస్తూ, కర్మయోగ కర్మసన్న్యాసముల ఫలితం ఒక్కటే అని నిర్ధారణ చేస్తున్నాడు.*

**సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।** 4
**ఏక మప్యాస్థితః సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్ ॥**

***సాంఖ్యయోగౌ-పృథక్-బాలాః-ప్రవదంతి-న-పండితాః***
***ఏకం-అపి-ఆస్థితః-సమ్యక్-ఉభయోః-విందతే-ఫలం***

| | | | |
|---|---|---|---|
| సాంఖ్యయోగౌ | = జ్ఞానకర్మలు | ఏకమపి | = (రెంటిలో) ఒకదాని నైనా |
| పృథక్ | = వేరని | సమ్యక్ | = చక్కగా |
| బాలాః | = పిల్లలు | ఆస్థితః | = ఆచరించువాడు |
| ప్రవదంతి | = చెబుతారు | ఉభయోః | = రెండింటి యొక్క |
| పండితాః | = పండితులు | ఫలం | = ఫలమును |
| న | = చెప్పరు | విందతే | = పొందుతాడు |

**సాంఖ్యము వేరు, యోగము వేరు అని వివేకము లేని వారు చెబుతారు. పండితులు చెప్పరు. ఆ రెండిటిలో ఒక్క దానిని చక్కగా ఆచరించిన వాడు రెండిటి యొక్క ఫలాన్ని పొందుతాడు.**

**వ్యాఖ్య**

సన్న్యాస కర్మయోగాలు జీవన విధానాలు అని తెలుసుకున్నాం. మోక్షకాములైన ముముక్షువులు ఈ మార్గాల ద్వారా పయనించి మోక్షాన్ని పొందుతారు. కర్మాచరణములో బుద్ధిని సంస్కరించుకొని మోక్ష మార్గంలో పయనించడం కర్మయోగమైతే, సర్వ కర్మలను సన్యసించి, కేవలం జ్ఞానమార్గంలో కొనసాగడం సర్వకర్మ





సన్న్యాసము అని అర్థం చేసుకున్నాం. ఈ రెండు మార్గాలు కూడా నిశ్శ్రేయస హేతువులే అని పరమేశ్వరుడు ప్రబోధిస్తున్నాడు.

అంటే, కర్మయోగి సన్న్యాసి కాడు. సన్న్యాసి కర్మయోగి కాడు. సన్న్యాస కర్మయోగాలు రెండూ పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్నాయి. కనుక, ఒకే పురుషుడు ఒకే కాలంలో రెండిటిని ఆచరించడం జరగదు. జ్ఞాన కర్మలను సముచ్చయించి ఆచరించడం సంభవం కాదు. ఇది అన్నంలో పాలు పోసుకుని క్షీరాన్న భోజనం ఆరగించడం వంటిది కాదు. ఆహారం - నిరాహారం లాగ పరస్పర విరుద్ధము. కర్మయోగము ఆహారాన్ని ఆరగించడం లాగా అనుష్ఠింప దగినది కాగా, సన్న్యాసము నిరాహార దీక్ష లాగా కర్మదూర మైనది. కనుక తినిన వాడుగా, తినని వాడుగా ఒక్కడే ఎలా ఉండలేడో, అలాగే కర్మయోగ సన్న్యాసాలను ఒకే పురుషుడు ఏక కాలంలో ఆచరించ లేడు. కనుక అవి వేరు వేరు వ్యక్తుల చేత అనుష్ఠింప బడేవి, భిన్న పురుషులు ఆచరించేవి కావడం చేత పరస్పర విరుద్ధములు. అలాంటి వాటి చేత పొందబడే ఫలాలు కూడా భిన్నంగా ఉండాలి కదా! అలా ఉండటం యుక్తం ***(సన్న్యాస కర్మయోగయోః భిన్న పురుషానుష్ఠేయయోః విరుద్ధయోః ఫలే అపి విరోధః యుక్తః).*** అలాంటప్పుడు రెండూ నిశ్శ్రేయస హేతువులే, మోక్షాన్ని ఇచ్చేవే అనే మాట ఎలా యుక్తం? అనేది శంక.

అంతే కాదు. కర్మయోగానికి, సన్న్యాసానికి మధ్య అధికారి విషయం లోను, క్రియా విషయం లోను, ఆశ్రమ విషయం లోను భేదము గోచరిస్తూ ఉంది. అలాగే ఫల విషయంలో కూడా రెండూ భిన్నంగా కనిపిస్తున్నాయి.

కర్మాచరణములో ఉండే వాడు కర్మయోగానికి అధికారి కాగా, కర్మలను త్యాగం చేసిన వాడు సన్న్యాసానికి అధికారి. ఈ విధంగా అధికారి విషయంలో భేదం తెలుస్తూ ఉంది.

ఇక క్రియలను బట్టి చూచినా, కర్మయోగి చేసే క్రియలు కర్మఫలాలకు సంబంధించిన ప్రయత్నాలై ఉండగా, సన్న్యాసి యొక్క క్రియలు ఫల సంబంధాలు కాక పోవడమే గాక, కేవలం జ్ఞాన సంబంధమైన శ్రవణాదులై ఉన్నాయి.

చివరగా ఫల విషయాని కొస్తే, కర్మలను ఆచరించే వాడు ఆయా కర్మల ఫలంగా పితృలోకాన్ని పొందుతున్నాడు ***(కర్మణా పితృలోకః).*** స్వర్గభోగాలను అనుభవిస్తున్నాడు. కాని, సర్వ కర్మలను త్యజించిన సన్న్యాసులు కేవలం శ్రవణ మననాదులను సాగించి, మోక్షాన్ని పొందుతున్నారు ***(నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసేన అధిగచ్ఛతి).*** కాబట్టి ఫల విషయంలో కూడా ఇరువురికి భేదం తెలుస్తూ ఉంది.

ఇలా సాధన విషయము లోను, ఫల విషయము లోను భేదము గోచరించే టప్పుడు, కర్మయోగ సన్న్యాసాలలో ఏ ఒక్క దానిని ఆచరించినా రెండిటి యొక్క ఫలితాన్ని పొందడం ఎలా సాధ్య పడుతుంది? అనేది శంక. కనుక, సన్న్యాసము వేరు, యోగము వేరు అనేది నిర్ణయము. ఈ నిర్ణయాన్ని అవివేకుల అభిప్రాయంగా గీతాచార్యుడు కొట్టి పారేశాడు.

**మార్గాలు - గమ్యము**

జ్ఞానయోగ కర్మయోగాలు ***(సాంఖ్య యోగౌ)*** వేరు వేరని, వేరువేరు ఫలాలను ప్రసాదించేవి అని ***(పృథక్ విరుద్ధ భిన్నఫలౌ)*** చిన్నపిల్లలు, అంటే వివేకం లేని వాళ్ళు చెబుతారు ***(బాలాః ప్రవదన్తి).*** కాని, పండితులు లేదా జ్ఞానం కలిగిన వాళ్ళు అలా అనరు ***(న పండితాః).***

సన్న్యాస కర్మయోగ మార్గాలలో పయనించే వారు ఉభయులూ ముముక్షువులే అని ఇప్పటికే

తెలుసుకున్నాం. ముముక్షువులకు కావలసింది మోక్షమే కాని మరొకటి కాదు. సాధన మార్గాలు వేరుగా ఉన్నా, సాధ్యము ఇద్దరికీ ఒక్కటే. అదే మోక్షము.

సన్న్యాసము, యోగము అనే ఈ రెండు నిష్ఠలు మోక్షహేతువులే. కాని ఈ రెండూ మోక్షానికి సాక్షాత్తు సాధనాలు కావు. జ్ఞానము వల్లనే మోక్షం ప్రాప్తిస్తుంది **(జ్ఞానాత్ మోక్షా ఇతి)**. జ్ఞానం కలగ డానికి ఈ రెండూ హేతువులు కావడం చేత, వాటిని నిశ్శ్రేయసకరాలు అని చెప్పడం జరిగింది **(జ్ఞానోత్పత్తి హేతుత్వేన ఉభౌ యద్యపి నిశ్శ్రేయస కరౌ తథాపి)**. వాస్తవానికి జ్ఞానమే సాక్షాత్ మోక్ష సాధనము.

మోక్ష సాధన మైన జ్ఞానము ప్రాప్తించడానికి సహకరించేవే కర్మయోగ, కర్మత్యాగా లనే ద్వివిధ నిష్ఠలు. కర్మయోగము సాధనమైతే, జ్ఞానము సాధ్యము. అలాగే సన్న్యాసము సాధనమైతే జ్ఞానము సాధ్యము. రెండిటికి జ్ఞానమే సాధ్యము. అట్టి జ్ఞానము సాధన మైనపుడు మోక్షము సాధ్యము అవుతుంది. సాధ్యరూపంగా ఇంతవరకు తెలిపిన మోక్షము సిద్ధస్వరూపమే నని మోక్షం ప్రాప్తించిన తరువాత తెలుస్తుంది. అదే అకర్త స్వరూపము. జ్ఞానకర్మ సన్న్యాస రూపము.

సన్న్యాసానికి, కర్మయోగానికి జ్ఞానప్రాప్తియే ఏకైక ఫల మైనపుడు ఆ రెండూ వేరుగా ఎలా చెప్పబడతాయి? అలాగే, జ్ఞానాన్ని పొందడానికి ఏ అంతఃకరణ శుద్ధి అవసరమై ఉందో అది ఉభయుల లోనూ ఉంది. అంతః కరణ శుద్ధి అంటే రాగద్వేష రాహిత్యం కనుక, అది కూడా ఇరువురిలో సాధింపబడి ఉంది. కనుక, సాధన రూపాలైన సాంఖ్య, యోగాలకు రాగద్వేష రాహిత్యమే సామ్యము కదా! అందుచేతనే, సాంఖ్యులకు జ్ఞానయోగము చేత, యోగులకు కర్మయోగము చేత జ్ఞానమే లభ్య మవుతుంది అని ద్వివిధ నిష్ఠలను విస్పష్టం చేశాడు భగవంతుడు. ఈ వివేకం గల వారు పండితులు. వివేకం లేని వారు పిల్లలు. జ్ఞానం లేని వారు.

కనుక, కర్మయోగాన్ని ఆచరించినా, లేదా సన్న్యాసాన్ని అనుష్ఠించినా, ప్రాప్తించేది మోక్ష సాధనమైన జ్ఞానమే కనుక, జ్ఞానోత్పత్తి హేతువులైన కర్మయోగ సన్న్యాసాలలో దేనిని అనుసరించినా ఫల మొక్కటే. ఈ రెండిటిలో ఏ ఒక్కటి ఆచరించినా, అలా అనుష్ఠించిన వాడు రెండిటి యొక్క ఫలితాన్ని పొందుతున్నాడు అంటున్నాడు. **(ఏకమ్ అపి ఉభయోః అనుష్ఠితవాన్ ఉభయోః విన్దతే ఫలమ్)**. ఒక్క దానిని ఆచరిస్తే, రెండు ఫలితాలు ఎలా సంభవం? అనే సంశయం అవసరం లేదు. రెండిటి ఫలం జ్ఞానప్రాప్తి ఒక్కటి కావడమే అందుకు కారణము.

పితృలోక ప్రాప్తి, స్వర్గ భోగానుభవము అనేవి కామ్యకర్మలు ఆచరించే వారికే వర్తిస్తాయి గాని, నిష్కామ కర్మయోగులకు కాదు. కర్మయోగులు ఫలసంగం లేకుండా కేవలం చిత్తశుద్ధి కొరకే కర్మలను ఆచరిస్తారు కనుక, సన్న్యాస ఫలమే యోగానికి కూడా ఫలమై ఉంది.

పైగా, కర్మ బంధించినట్లు కర్మయోగం బంధించదు. సకామ కర్మలు ఫలం వైపు నడిపించి జన్మలకు కారణ మౌతూ ఉంటే, నిష్కామమైన కర్మయోగము ప్రశాంత చిత్తమును ప్రసాదించి జ్ఞానప్రాప్తికి సాధకుని సిద్ధం చేస్తూ ఉంది.

మరొక విషయాన్ని కూడా ఈ సందర్భములో మనం అర్థం చేసుకోవాలి. త్యాగ మనేది సన్న్యాసము లోనే కాదు, కర్మయోగంలో కూడా ఉంది. కర్మయోగి రాగద్వేషాలను త్యజించడం లేదా? కర్మఫలాలను త్యాగం చెయ్యడం లేదా? **నాహం కర్తా - హరిః కర్తా** - నేను కర్తను కాను, హరియే కర్త అనే భావం కలిగి కర్తృత్వాన్ని విడిచి పెట్టడం లేదా? అహంకారాన్ని, సంకుచిత భావాలను త్యజించడం లేదా? ఇవన్నీ ఏమిటి? త్యాగాలు కావా? సన్న్యాస లక్షణాలు కర్మయోగంలో లేవా? ఏది చేస్తున్నాడు అనేది ప్రధానం కాదు.





ఎలా ఉన్నాడు అనేదే ముఖ్యం. 'నాది' అనే దానిని సన్న్యాసి ఎలా త్యాగం చేశాడో, కర్మయోగి కూడా అలాగే త్యాగం చేశాడు.

**ఆఖ్యాయిక**

సంత కెళ్ళిన గృహ యజమాని తిరిగి వచ్చే సరికి తన గృహానికి సమీపంలో ఉన్న తన ధాన్యాగారము అగ్ని ప్రమాదానికి గురై, మంటలు లేస్తూ ఉండటం చూచి, కేక లేస్తూ బిగ్గరగా రోదించడం ప్రారంభించాడు.

భర్త ఆర్తనాదాన్ని విన్న అర్ధాంగి బయటికి వచ్చి, 'అయ్యో, ఏమైందండీ! ఎందుకలా రోదిస్తున్నారు?' అని ప్రశ్నించింది.

దూరంగా మండుతున్న ధాన్యాగారాన్ని చూపుతూ, 'మన ధాన్యాగారము మండిపోతోంది. భీమా కూడా చేయించ లేదు. మన భాగ్యమంతా బుగ్గి పాలైంది' అంటూ యజమాని ఏడుస్తున్నాడు.

'దానికి ఏడవడ మెందుకు? ఊరుకోండీ! భీమా లేకపోతే ఏమైంది? మీరు ఏడుపు మాని ధీమాగా ఉండండి. మనం ధాన్యంతో పాటు ఆగారాన్ని కూడా మొన్ననే అమ్మేశాము కదండీ! నిన్ననే రిజిష్ట్రేషన్ కూడా జరిగి పోయింది. ఇంకెందుకు ఏడుస్తారు?' అన్నది భార్య. యజమాని ఏడుపు తక్షణమే ఆగిపోయింది.

ఈ ప్రపంచంలో ఏదీ దుఃఖ కారణం కాదు. 'నాది' అనుకున్నప్పుడే ఏదైనా దుఃఖహేతువు అవుతుంది. బంధానికి కారణ మవుతుంది.

కర్మయోగిలో 'నాది' అనే భావన ఉందా? లేదు. అలాంటప్పుడు అతని కర్మలు మాత్రం బంధ హేతువు లెలా అవుతాయి? కాబట్టి కర్మయోగి ముందు చిత్తశుద్ధిని పొంది సన్న్యాసి అవుతాడు. ఆ తరువాత జ్ఞానాన్ని పొంది మోక్షాన్ని సాధిస్తాడు. సన్న్యాసానికి, యోగానికి మోక్షమే ఫల మైనపుడు ఆ రెండిటి మధ్య భేదము ఉందని అవివేకులు చెబుతారే గాని, జ్ఞానులు చెప్పరు.

**యదేవ యోగాః పశ్యన్తి తత్ సాంఖ్యై రపి దృశ్యతే,**
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స తత్త్వవిత్ ॥**

దేనిని యోగులు చూస్తున్నారో, దానినే సాంఖ్యులు కూడా దర్శిస్తున్నారు. ఎవడు సాంఖ్య యోగాలను ఏకంగా దర్శిస్తాడో వాడే తత్త్వవిదుడు అని మహాభారతము.

సన్న్యాస, కర్మలుగా ఇంతవరకు చెబుతూ వచ్చిన భగవంతుడు ఇక్కడ వాటినే సాంఖ్య, యోగాలుగా చెబుతున్నాడు. అంతే. ఈ పద ప్రయోగము మూడవ అధ్యాయం ఆరంభం లోనే జరిగింది.

ఈ కర్మయోగ సన్న్యాసాలలో ఏ ఒక్క దానిని అనుష్ఠించినా రెండిటి యొక్క ఫలితాన్ని పొందడం జరుగుతుంది అనే చోట **సమ్యక్ ఆస్థితః** అనడం జరిగింది. అంటే చక్కగా లేదా బాగుగా ఆచరించడ మని అర్థము. అంటే, దేనిని ఆచరించినా, పాక్షికంగా కాకుండా సంపూర్ణంగా ఆచరించాలి అనేది అంతర్భావం.

ఈ విధంగా ఏ కారణం చేత సాంఖ్య యోగాలకు జ్ఞాన మనే ఏక ఫలప్రాప్తి చెప్పబడిందో, దానిని ప్రామాణికంగా అర్థం చేసుకున్న వాడే సత్యదర్శనం చేసే వాడు.

*ఒక్క దానిని ఆచరిస్తే రెండిటి ఫలాలను పొందడం జరుగుతుంది అని ఇక్కడ నిర్ధారణ చేసిన విషయాన్ని తరువాత శ్లోకంలో విస్పష్టం చేస్తున్నాడు.*

**య త్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగై రపి గమ్యతే ।** 5
**ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥**

***యత్-సాంఖ్యైః-ప్రాప్యతే-స్థానం-తత్-యోగైః-అపి-గమ్యతే***
***ఏకం-సాంఖ్యం-చ-యోగం-చ-యః-పశ్యతి-సః-పశ్యతి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| సాంఖ్యైః | = | జ్ఞానయోగుల చేత | యోగం చ | = | కర్మయోగమును |
| యత్ స్థానం | = | ఏ స్థానం | ఏకం | = | ఒక్కటిగ |
| ప్రాప్యతే | = | పొందబడు తుందో | యః | = | ఎవడు |
| తత్ | = | అది | పశ్యతి | = | చూస్తున్నాడో |
| యోగైః అపి | = | యోగుల చేత గూడ | సః | = | వాడే |
| గమ్యతే | = | పొంద బడుతుంది | పశ్యతి | = | చూస్తున్నాడు |
| సాంఖ్యం చ | = | జ్ఞానయోగమును | | | |

**జ్ఞానులు ఏ స్థానాన్ని పొందుతున్నారో, కర్మయోగులు కూడా అదే స్థానాన్ని పొందుతున్నారు. జ్ఞాన యోగమును, కర్మ యోగమును ఒకటిగా ఎవడు దర్శిస్తాడో, వాడే నిజముగా దర్శించే వాడు.**

**వ్యాఖ్య**

మోక్ష సాధనమైన జ్ఞానాన్ని పొందడానికి బుద్ధి శుద్ధి పడి ఉండాలి. రాగద్వేషాలు తటస్థ పడి ఉండాలి. అంతఃకరణ శుద్ధి లేకుండా ఆత్మజ్ఞానం కలగదు. ఆత్మజ్ఞాన ప్రాప్తికి అంతఃకరణ అశుద్ధి అవరోధము. ప్రతిబంధకము. యోగులు, సాంఖ్యులు ఇరువురు కూడా ఈ విషయంలో కృతకృత్యులే. ఇద్దరూ చిత్తశుద్ధిని సాధించిన వారే. ఇద్దరికీ కలిగిన చిత్తశుద్ధి ఒక్కటే గాని రెండు కావు. వారు పొందే జ్ఞానం కూడా ఒక్కటే గాని రెండు కావు. జ్ఞానప్రాప్తి జరిగిన తరువాత, తద్వారా ఏ మోక్షము సిద్ధిస్తుందో అది కూడా ఒక్కటే కనుక, మార్గంలో ఉభయులుగా తెలిసిన సన్యాస యోగులు గమ్యంలో ఏకమై శోభిస్తున్నారు. అంటే, ఒకే గమ్యాన్ని చేరిన వారు అవుతున్నారు. ఏ మోక్షాన్ని సాంఖ్యులు పొందడం జరిగిందో, దానినే యోగులు కూడా పొందడం జరుగుతూ ఉంది ***(యత్ సాంఖ్యైః జ్ఞాననిష్ఠైః సంన్యాసిభిః ప్రాప్యతే, తత్ స్థానం యోగైః అపి గమ్యతే).*** సాధన రూపాలుగా తెలుస్తున్న సన్యాస కర్మయోగాలు మోక్ష ప్రయోజనకారి అయిన ఒకే జ్ఞానాన్ని అందించడం చేత ఫలప్రాప్తిలో కూడా ఈ రెండిటికి సామ్యం కనిపిస్తూ ఉంది.

ఇక్కడ 'స్థానం' అనే పదానికి మోక్షం అని అర్థము ***(స్థానం మోక్షాఖ్యం).*** 'స్థానం' అంటే చోటు అని కూడా అర్థం. ఆలయాలలో గర్భగుడిలో భగవంతుని మూర్తి ఉండే ప్రదేశాన్ని మూలస్థానం అంటారు. 'మూలం' అంటే కారణము అని ఒక అర్థము. ఆధారము అని మరొక అర్థము. మొదలు అనే అర్థం కూడా ఎక్కువ ప్రాచుర్యంలో ఉంది.

సర్వమునకు కారణమైన, ఆధారమైన, ఆదియైన పరమేశ్వరుడు ఉండే చోటు కనుక దానిని మూలస్థాన మని, మననం చేసే వారిని రక్షించే ఆయన పవిత్ర మంత్రాన్ని మూలమంత్ర మని అంటూ ఉంటారు. ఆలయాలలో మూల స్థానేశ్వరాలయం కూడా దక్షిణాంధ్ర దేశంలో ఉంది. కనుక మూలస్థానం అంటే మోక్షధామం అని అర్థము. అదే ఈ శ్లోకంలో భగవంతుడు చెబుతున్న 'స్థానం' లేదా మోక్షం. జ్ఞానమే మోక్షము. ఈ జ్ఞానాన్ని యోగులు, సన్యాసులు ఇరువురూ పొందుతారు. కనుక, ఫలం ఇద్దరికీ ఒక్కటే. కాకపోతే, జ్ఞానానికి సన్యాసము సాక్షాత్ సాధన కాగా, కర్మయోగము పరంపరా సాధనముగా ఉంది. అంతే. అందుచేతనే సాంఖ్యుల విషయంలో ***ప్రాప్యతే*** అని, యోగుల విషయంలో ***గమ్యతే*** అనడం గమనించ దగిన విషయం. ఉన్న స్థితి నుండి పొందడము 'ప్రాప్య' మైతే, పయనించి గమ్యం చేరడం 'గమ్యతే' అనే పదముతో సూచించినట్లు తెలుస్తూ ఉంది.





రెండిటికి ఫలం ఒక్కటే కావడం చేత యోగమును, సన్యాసమును ఎవడు ఒక్కటిగా చూస్తాడో అతడే చక్కగా దర్శించేవాడు అంటున్నాడు భగవంతుడు ***(ఫలైకత్వాత్ యః ఏకం సాంఖ్యం యోగం చ పశ్యతి సః సమ్యక్ పశ్యతి ఇత్యర్థః).***

ఇక్కడ చూడటం అంటే, అర్థం చేసుకోవడం, తెలుసుకోవడం అని భావము. కళ్ళు లేని వాడు చూడలేడు. కనుక అర్థం చేసుకోలేడు. కళ్ళున్న వాడు చూడగలడు. అంతమాత్రాన అర్థం చేసుకున్నవాడు అని చెప్పలేము. చూడటం వేరు, అర్థం చేసుకోవడం వేరు.

ఒక వస్తువును చూచిన వ్యక్తి అదేమిటో అర్థం కావడం లేదు అన్నా డనుకోండి. దాని అర్థం, ఆ వస్తువును అతడు చూడ లేదని కాదు, చూచినా అర్థం కావడం లేదు అని. వస్తువు సరిగ కనిపించడం లేదు అంటే దానిని నేత్ర దోషంగా అర్థం చేసుకోవచ్చు. కనిపిస్తున్నా అర్థం కావడం లేదు అంటే, అది నేత్ర దోషం కాదు. వివేక లోపం. వివేకం లేకపోవడం చేత అర్థం కాలేదని తాత్పర్యము.

వివేకం లేని వారు చెప్పే విషయాలు కూడా వివేక శూన్యం గానే ఉంటాయి. సాంఖ్య యోగాలు వేరు వేరు అని పిల్లలు చెబుతారే గాని, పండితులు చెప్పరు అని గడచిన శ్లోకంలో భగవంతుడు చెప్పడం వెనుక ఇదే సూత్రార్థము.

నిజమే కదా! పిల్లలు వివేకం లేని వారు. విజ్ఞానానికి సంబంధించిన విషయాన్ని పిల్లలు ఎలా చెబుతారు? పెద్దలే చెబుతారు. పెద్దలు అంటే కేవలం శాస్త్రం తెలిసిన వారు అని కాదు. శాస్త్ర హృదయం తెలిసిన వారు అని భావము.

సాంఖ్య యోగాలు ఒక్కటే అని పిల్లలు, అనగా వివేకం లేని వారు చెప్పలేరు. అవివేకులు కాని శాస్త్రజ్ఞులు అవి వేరు వేరని చెబుతారు. కాని, శాస్త్ర హృదయాన్ని సాంప్రదాయకంగా అర్థం చేసుకున్న వారే ఈ రెండిటిని ఏకంగా దర్శిస్తారు. ఏకంగా అభివర్ణిస్తారు. వారే చక్కగా విషయాన్ని దర్శించిన వారు అని భగవంతుని అభిప్రేతం ***(సః సమ్యక్ పశ్యతి).***

రెండు మార్గాలు ఒకే గమ్యం వైపు నడుస్తూ ఉన్నాయి కనుక, ఏ ఒక్క దానిని చక్కగా **(సమ్యక్)** ఆచరించినా, రెండిటి వల్ల కలిగే ఫలం ప్రాప్తిస్తుంది అని పరమేశ్వరుడు చెప్పడంలో ఇదే భావార్థము.

ప్రవహించే రెండు జీవనదులకు సాగరమే ప్రాప్తి స్థానము. ఏ ఒక్క నదిలో చక్కగా ప్రయాణం సాగించినా చేరేది సముద్రమునే. రెండు నదులూ చేరేది ఒక్క సముద్రాన్నే. కనుక ఏదో ఒక నదిలో ప్రయాణం సాగించడమే ప్రధానము. రెండిటి ద్వారా చేరే గమ్యము సాగరమే కనుక, ఒక్క నదిని ఆశ్రయించినా రెండిటి ఫలాన్ని పొందినట్లు అవుతుంది. జీవనదు లన్నీ ప్రవహించి సాగరాన్ని చేరినట్లు, జీవు లందరూ సాంఖ్య యోగాలనే నదులలో ప్రయాణం చేసి జ్ఞాన సాగరాన్ని చేరిపోవాలి.

***ఆ॥ యోగి చూచు భంగి నుర్వీశ సాంఖ్యుఁడుఁ జూచు సాంఖ్యుఁ దరయు చొప్పుయోగి।***
***వరుఁడు నరయుఁ గాన వారిద్దరును నొక్క తెరువు వార లండ్రు పరమ మునులు॥***

అని సాంఖ్య యోగుల అవగాహన యందు, అవలోకము నందు భేదము లేదని మహాభారతంలో ప్రవచించిన వ్యాస హృదయాన్ని ఆవిష్కరిస్తూ తిక్కనార్యుడు అనువదించిన తీపి పద్యము.

ద్వివిధ నిష్ఠలకు ఫలైకత్వం ఉండే టప్పుడు కర్మ సన్న్యాసము కన్నా కర్మయోగమే విశిష్టము అని ఎందుకు చెబుతున్నట్లు? సాక్షాత్ సాధనమైన కర్మ సన్న్యాసాన్నే అనుష్ఠిస్తే ఏమవుతుంది? చెబుతున్నాడు.

**సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః ।**
**యోగయుక్తో ముని ర్బ్రహ్మ నచిరే ణాధిగచ్ఛతి ॥** 6

*సన్న్యాసః-తు-మహాబాహో-దుఃఖం-ఆప్తుం-అయోగతః*
*యోగయుక్తః-మునిః-బ్రహ్మ-నచిరేణ-అధిగచ్ఛతి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = | అర్జునా! | యోగయుక్తః | = | యోగయుక్తుడు |
| సన్న్యాసః తు | = | సన్న్యాసమును కూడా | మునిః | = | మననశీలుడు |
| అయోగతః | = | యోగము లేకుండా | బ్రహ్మ | = | బ్రహ్మమును |
| ఆప్తుం | = | పొందుట | నచిరేణ | = | త్వరగా |
| దుఃఖం | = | దుఃఖతరం | అధిగచ్ఛతి | = | పొందుతాడు |

**అర్జునా! కర్మయోగము లేకుండా సన్న్యాసమును పొందడం కష్టం. యోగయుక్తు డైన మననశీలుడు, బ్రహ్మమును శీఘ్రంగా పొందుతాడు.**

**వ్యాఖ్య**

జ్ఞాననిష్ఠా ప్రాప్తికి, చిత్తశుద్ధిని ప్రసాదించే కర్మనిష్ఠను తెలుసుకున్నాం. కర్మనిష్ఠ ద్వారా ప్రాప్తించిన జ్ఞాననిష్ఠ స్వతంత్రంగా మోక్షహేతువు అవుతుంది. కర్మయోగమును ఆచరించకుండా స్వీకరించే సన్న్యాసము సజావుగా పరళంగా సాగదు.

పునాది లేని సౌధం లాగా, సరిగమలు తెలియని సంగీతం లాగా, వ్యాకరణ వైదుష్యం లేని పాండిత్యం లాగా, చిత్తశుద్ధికి నోచుకోని సన్న్యాసము బాధకే గాని బోధకు నోచుకోదు. కర్మయోగము ద్వారా చిత్తశుద్ధిని పొందిన వాడు కర్మలను త్యజించి జ్ఞానప్రాప్తి కొరకు సన్న్యాసములో శోభిస్తాడు. చిత్తశుద్ధి లేకుండా కర్మలను విడిచి పెడితే జ్ఞానఫలం లభించదు. కనుక యోగం లేకుండా సన్న్యాసము సిద్ధించడం చాలా కష్టంతో కూడుకున్న పని అంటున్నాడు భగవంతుడు ***(సన్న్యాసః తు, అయోగతః యోగేన వినా, దుఃఖం ఆప్తుం).***

కార్యం సిద్ధించడ మనేది కారణముపై ఆధారపడి ఉంటుంది. జ్ఞాననిష్ఠకు హేతువైన చిత్తశుద్ధి లేకుండా జ్ఞానప్రాప్తి కలగదు. జ్ఞాననిష్ఠ అనే కార్యానికి చిత్తశుద్ధి కారణంగా తెలుస్తూ ఉంది. ***కారణా భావే కార్యాభావః*** కారణము లేనిదే కార్యం సిద్ధించదు అనే న్యాయానుసారము చిత్తశుద్ధి లేకుండా జ్ఞాననిష్ఠ కుదరదు. చిత్తశుద్ధి యోగం వల్లనే ప్రాప్తిస్తుంది. కనుక యోగం లేనివాడు జ్ఞాననిష్ఠలో తపిస్తూ తడబడుతూ ఉంటే, యోగయుక్తు డైన మననశీలుడు శీఘ్రంగా బ్రహ్మమును పొందుతాడు.

**ఎదురీత - ఎద బాధ**

మోక్షహేతువైన జ్ఞానాన్ని పొందడానికి సర్వకర్మలను త్యజించి, సన్న్యాసమును స్వీకరించిన సన్న్యాసి ఏమి చెయ్యాలి? జ్ఞానసాధనే చెయ్యాలి. జ్ఞానసాధన దేనితో చెయ్యాలి? మనస్సు తోనే చెయ్యాలి. బుద్ధి తోనే చెయ్యాలి. అంటే, సదా జ్ఞానసాధనలో తృప్తిగా చరించే శక్తి అతని బుద్ధికి ఉండాలి. మరి, అట్టి బుద్ధి రాగద్వేషాలకు నిలయమైతే జ్ఞానసాధన ఎలా సాగుతుంది? జ్ఞాననిష్ఠలో నిలకడగా ఉండాలని అట్టి సన్న్యాసి ప్రయత్నించినా, యోగాన్ని ఆచరించని కారణంగా బుద్ధిలో రాగద్వేషాలనే మలదోషము ఉండటం చేత సాధన ముందుకు సాగదు.

సన్న్యాసము స్వీకరించక ముందు ఏ రాగద్వేషాలైతే మనస్సులో తిష్ఠ వేసి బాధించాయో, అవే రాగద్వేషాలు సన్న్యాసం స్వీకరించిన తరువాత కూడా బుద్ధిలో ఉన్నాయి. ఇలాంటి వారు సన్న్యాసాన్ని స్వీకరించకుండా,





యోగానుష్ఠానంలో రాగద్వేషాలను తటస్థం చేసి, చిత్తశుద్ధిని సాధించాలి. చిత్తశుద్ధి కలిగిన వారు సన్న్యాసంలో అనాయాసంగా ముందుకు సాగుతారు.

ఈ సందర్భంలో మరొక ఆసక్తికర మైన విషయం ఏమిటంటే, కొందరు రాగద్వేషాలు ఫలించక సన్న్యాసం పుచ్చుకుంటారు. ఇదొక విడ్డూరము. కుటుంబ కలహాలతో, వ్యాపార నష్టాలతో, అప్పుల బెడదతో విసిగిపోయి సన్న్యాసాశ్రమాన్ని స్వీకరిస్తారు. చిత్తప్రసాదం లేని అపక్వ అంతఃకరణముతో సన్న్యాసాన్ని స్వీకరించి ఏం చేద్దామని, ఏమి సాధిద్దా మని? కాషాయ దండ కమండలాది చిహ్నలను ధరించి బాహ్యానికి యతివరేణ్యులుగా శోభిస్తారే గాని, ఆంతర్యంలో మతిహీనులై, శాంతిశూన్యులై అలమటిస్తూ ఉంటారు. జ్ఞానయుత సన్న్యాసికి, జ్ఞానరహిత సన్న్యాసికి సామ్యము వేషధారణ లోనే గాని, జ్ఞానము నందు కాదు. ప్రముఖ కవి భాసుడు ఈ విషయాన్ని అందంగా రచించాడు.

**మూర్ఖస్య ప్రాజ్ఞస్య చ కార్య యోగే**
**సమత్వ మభ్యేతి తను ర్న బుద్ధిః**

మూర్ఖుడు, ప్రాజ్ఞుడు దేహస్థాయిలో నడిచే కర్మలలో ఒకే విధంగా తెలుస్తారు. అంతేగాని బుద్ధిలో కాదు. జ్ఞానంలో కాదు అన్నాడు.

కర్మయోగానుష్ఠానము వలన ప్రాప్తించే చిత్తశుద్ధి లేకుండా సన్న్యాసమును స్వీకరించడము దుఃఖహేతువే అవుతుంది. రాగద్వేషాలను మనస్సులో పెట్టుకొని వనాలకు వెళ్ళినా, బుద్ధిలో రణాలు ఉంటాయే గాని. స్మరణాదులు ఉండవు. యోగం లేని కారణంగా సన్న్యాసంలో కూడా రాగాలే గోల చేస్తూ ఉంటాయి.

***వనేఽ పి దోషాః ప్రభవన్తి రాగిణాం***
***గృహేషు సర్వేంద్రియ నిగ్రహ స్తపః***

రాగద్వేషాలను హృదయంలో పెట్టుకొని తపస్సు చేయడానికి అరణ్యాలకు వెళ్ళినా, అట్టివారిలో ప్రాపంచిక రాగం ఉంటుందే గాని విరాగం విరబూయదు. రాగద్వేషాలను తటస్థ పరచి, ఇంద్రియాలను నిగ్రహించి, ప్రసాద చిత్తముతో గృహజీవనం గడిపేవారు గృహస్థు లైనా వారు తాపసులే. వారిది తపో జీవనమే అన్నది భాగవతము.

బాహ్యాభ్యంతరాలలో సన్న్యాసిగా నెలకొన్న వాడే నిత్యసన్న్యాసి. బాహ్యంలో సన్న్యాసం - ఆంతర్యంలో సంసారం వల్ల సంతాప జీవనమే గాని తపోజీవనము ప్రాప్తించదు.

మరి, యోగమును అవలంబించకుండా పొరపాటు చేత గాని, గ్రహపాటు చేత గాని కర్మసన్న్యాసము చేసిన వ్యక్తి జ్ఞానమును పొందే అవకాశము ఉండదా? అదే వాస్తవమైతే, కొందరు మహాపురుషులు యోగానుష్ఠానము లేకుండానే సన్న్యాసమును స్వీకరించి తరించినట్లు చాలా ఋజువు లున్నాయి కదా! అనే ఈ రెండు సంశయాలు కూడా ఉపేక్షించ దగినవి కావు.

యోగము లేకుండా సన్న్యసించిన వారు సన్న్యాస ఫలాన్ని అందుకోలేరు, అది వారికి అసాధ్యము అని భగవంతుడు చెప్పడం లేదు. సులభసాధ్యం కాదు అంటున్నాడు. పైగా కష్టతరము అని కూడా చెబుతున్నాడు ***(దుఃఖమాప్తు మయోగతః).*** కర్మయోగము వలన లభించే చిత్తశుద్ధి లేనివారు సన్న్యాసానంతరము జ్ఞానప్రాప్తికి ముందుగా చిత్తశుద్ధి కొరకు సాధనలు ఆచరించ వలసి ఉంటుంది. అలా సాధనలో శుద్ధిపడి, ఆ తరువాత జ్ఞానసాధనలో కొనసాగుతారు. అలాంటి వారికి కూడా జ్ఞానం ప్రాప్తిస్తుంది. సన్న్యాసం ఫలిస్తుంది. కాకపోతే, అది చాలా కష్టతరమైన విషయం కనుక, భారంతో కూడుకున్న కార్యం కనుక, మార్గమధ్యంలో చేజారిపోయే

ప్రమాదం లేకపోలేదు. అదే యోగయుక్తు డైతే ఏ అవాంతరాలు లేకుండా, అవరోధాలు తెలియకుండా జ్ఞానసాధనలో పురోగమించ గలడు.

ఇక రెండవ శంక. కర్మయోగమును ఆచరించకుండానే, సన్యాసమును స్వీకరించి, జ్ఞాన ఫలప్రాప్తిని పొంది తరించిన మహాత్ముల విషయం ఏమిటి? అనేది సందేహము. దీనికి సమాధానము కష్టమేమీ కాదు. ఈ విషయాన్ని కూడా శాస్త్రం చర్చించింది.

కారణం లేకుండా కార్యం సంభవించదు అని ఇప్పటికే సహేతుకంగా అర్థం చేసుకున్నాం కనుక, చిత్త ప్రసాదము అనే కారణం లేకుండా బ్రహ్మజ్ఞానము అనే కార్యోత్పత్తికి అవకాశమే లేదు. కాకపోతే, ఒక మహాత్ముడైన వ్యక్తి ఈ జన్మలో ఏ విధమైన కర్మానుష్ఠానము లేకుండానే సన్యసించి తరించి నట్లు మనకు కనిపించినా, కారణము లేనిదే కార్యము ఉత్పన్నం కాదు అనే న్యాయాన్ని అనుసరించి, ఈ జన్మలో కర్మానుష్ఠానము లేని మాట వాస్తవమే అయినా, జ్ఞానప్రాప్తికి కావలసిన చిత్తశుద్ధి లేదనేది మాత్రం వాస్తవం కాదు. చిత్తశుద్ధి లేకుండా జ్ఞానప్రాప్తి అసంభవము. మరి, ఆ చిత్తశుద్ధి ఈ మహాత్మునికి ఎక్కడ నుండి ప్రాప్తించింది? గత జన్మ నుండి సంక్రమించింది. గత జన్మలలో కర్మానుష్ఠానం చేసి, చిత్తశుద్ధిని పొంది ఉండటం చేతనే, ఈ జన్మలో కర్మానుష్ఠానం యొక్క అవసరం లేకనే సన్యాసానికి, తద్వారా మోక్షహేతువైన జ్ఞానప్రాప్తికి మహాత్మునికి ప్రవేశం లభించింది.

***యాన్యతోఽ న్యాని జన్మాని తేషు నూనం కృతం భవేత్***
***సత్కృత్యం పురుషేణేహ నాఽ న్యథా బ్రహ్మణి స్థితిః ॥***

కర్మయోగానుష్ఠానము లేకుండా బ్రహ్మనిష్ఠ కలిగింది అంటే, దానికి గత జన్మలలో పురుషుని చేత కర్మనిష్ఠ ఆచరింపబడే ఉంటుంది, ఉండాలి. అలా కాకపోతే, బ్రహ్మనిష్ఠ ప్రాప్తించే అవకాశమే లేదు అన్నది శాస్త్రం.

**యుక్తుడైతే ముక్తు డైనట్లే**

యోగయుక్తుడు కానివాడు సన్యాసములో ఏటికి ఎదురీదుతూ ఉంటే, యోగయుక్తు డైన ముని శీఘ్రముగా బ్రహ్మమును పొందుతున్నాడు అంటున్నాడు గీతాచార్యుడు.

ఇక్కడ యుక్తుడు అంటే యోగయుక్తుడు అని అర్థము. యోగయుక్తుడు అంటే, ఈశ్వరార్పణ బుద్ధితో ఫలాపేక్ష లేకుండా కర్మలను ఆచరిస్తూ, చిత్తశుద్ధిని పొందిన వాడు ***(యోగయుక్తః కర్మయోగేన ఈశ్వర సమర్పిత రూపేణ ఫల నిరపేక్షేణ యుక్తః).*** యోగయుక్తుని బాహ్యకరణాలు కర్మలలో కదులుతూ ఉండినా, అతని అంతఃకరణములో అచ్యుతుడే ఉంటాడు. ఇట్టి యోగి సన్యాసమును స్వీకరిస్తే, సన్యాస ఫలమును శీఘ్రముగా పొందుతాడు. అతని అంతఃకరణము శుద్ధి పడి ఉన్నందున, జ్ఞాన ప్రతిబంధకము లేనివాడై, కేవలం మననశీలుడై ఉంటాడు. అందుచేత అతడు ముని. పరమేశ్వర స్వరూపమును చక్కగా మననం చేసేవాడు అయినందున అతడు ముని ***(మునిః మననాత్ ఈశ్వర స్వరూపస్య మునిః).*** ఈ విధంగా యోగం ఉన్నవాడే బ్రహ్మమును శీఘ్రంగా పొందుతాడు. యోగం లేనివాడు సన్యాస ఫలాన్ని కష్టంతో పొందుతాడు. కనుక, ఆశ్రమాలలో ఉండి, యోగం లేని కారణంగా అనిత్య సన్యాసంలో అలమటించడం కన్నా, గృహంలో ఉండి యోగయుక్తుడై, మననశీలుడై జీవించడమే నిత్య సన్యాసము. ఇదే తపస్సు. ఇదే బ్రహ్మము. ఇదే జ్ఞానరూప సన్యాసము.

యోగయుక్తుడైన ముని బ్రహ్మమును శీఘ్రంగా పొందుతాడు అని శ్లోకము యొక్క ఉత్తరార్థము. ఈ సందర్భములో బ్రహ్మము అంటే సన్యాసము అని అర్థము. ***న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మాహి పరః*** అనే శ్రుతి





వాక్యానుసారం బ్రహ్మజ్ఞానము నిష్ఠారూప లక్షణంగా ఉన్నందున సన్యాసము బ్రహ్మమని చెప్పబడింది. కనుక, యోగయుక్తుడైన వాడు చిత్తశుద్ధి కారణంగా పరమార్థ సన్యాసమును శీఘ్రంగా పొందుతున్నాడు అని అర్థము ***(బ్రహ్మ, పరమాత్మ జ్ఞాన లక్షణత్వాత్ ప్రకృతః సంన్యాసః బ్రహ్మ ఉచ్యతే - శ్రీ శంకర భాష్యము).*** బ్రహ్మము సర్వశ్రేష్ఠ మైనది అని వేదమాత చెప్పింది కదా! ***(బ్రహ్మ హి పరః).*** అలాగే సన్యాసమును కూడా సర్వశ్రేష్ఠ మని చెప్పడం జరిగింది ***(న్యాస ఏవా త్యరేచయత్).*** బ్రహ్మము జ్ఞానస్వరూపము. సర్వశ్రేష్ఠము. అలాగే సన్యాసము జ్ఞానం లక్షణముగా గలది. సర్వశ్రేష్ఠము. బ్రహ్మమునకు, సన్యాసమునకు జ్ఞాన విషయము నందు, సర్వ శ్రేష్ఠమత్వము నందు సామ్యము ఉన్నందున సన్యాసము బ్రహ్మ శబ్దము చేత చెప్పబడింది. కనుక బ్రహ్మ శబ్దానికి సత్యం జ్ఞానం అనంత మనే లక్షణముతో పాటు, సన్యాసము, సాంఖ్యము అనే అర్థాలు కూడా ఉన్నాయి.

సమస్త వేదాంత వాక్యాల చేత చక్కగా **(సమ్యక్)** తెలియచేయ బడుతుంది **(ఖ్యాయతే)** కనుక బ్రహ్మము ***సంఖ్యమ్*** అనబడుతుంది. అట్టి బ్రహ్మప్రాప్తికి హేతువు కావడం చేత జ్ఞానకర్మ సన్యాసము, లేదా జ్ఞాన నిష్ఠ సాంఖ్యము అని పిలువబడింది. కనుక, సాంఖ్య మన్నా, సన్యాస మన్నా బ్రహ్మమే. ప్రస్తుతం బ్రహ్మమును పొందడం అంటే, సన్యాసమును పొందడము అని అర్థము.

యోగయుక్తుడు కాని వాడు సన్యాసమును స్వీకరించి, సన్యాస ఫలమును కష్టంగా పొందుతూ ఉంటే, యోగయుక్తుడైన ముని చిత్తశుద్ధి కారణంగా సన్యాస ఫలప్రాప్తిని శీఘ్రంగా పొందుతున్నాడు. ఈ కారణం చేత జ్ఞాన రహిత కర్మ సన్యాసము కన్నా, చిత్తశుద్ధిని ప్రసాదించే కర్మయోగమే శ్రేష్ఠమని తేలింది. కర్మలలో శుద్ధిపడిన వాడు సన్యాసమును శీఘ్రంగా పొందుతాడు. ఆ పొందే సన్యాసము జ్ఞానరూప సన్యాసమైనా కావచ్చు, లేదా బ్రహ్మరూపస్థితి యైనా కావచ్చు. దేనికైనా కర్మయోగము అనివార్యం. అవశ్యం.

*యోగయుక్తుడు శీఘ్రంగా బ్రహ్మమును పొందుతాడు అని తెలునుకున్నాం. అది ఎలాగో వివరిస్తున్నాడు.*

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।**
**సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥** 7

***యోగయుక్తః-విశుద్ధాత్మా-విజితాత్మా-జితేంద్రియః***
***సర్వభూతాత్మ భూతాత్మా-కుర్వన్-అపి-న-లిప్యతే***

| | | | |
|---|---|---|---|
| యోగయుక్తః | =యోగయుక్తుడు | సర్వభూతాత్మ భూతాత్మా | =సర్వ ఆత్మలు తన ఆత్మగా తెలుసుకొనినవాడు |
| విశుద్ధాత్మా | =పరిశుద్ధమైన అంతఃకరణ గల వాడు | కుర్వన్ అపి | =కర్మలు చేసినా |
| విజితాత్మా | =తనను తాను వశపరచుకొన్న వాడు | న లిప్యతే | =అంట బడదు |
| జితేంద్రియః | =జితేంద్రియుడు | | |

**యోగయుక్తుడు, పరిశుద్ధమైన హృదయము కలవాడు, తనను తాను నిగ్రహించుకున్న వాడు, ఇంద్రియములను జయించిన వాడు, సర్వ ప్రాణుల యందలి ఆత్మ, తన ఆత్మ ఒక్కటే అని తెలిసిన వాడు, కర్మలు చేస్తూ వున్నా కర్మల చేత అంట బడదు.**

**వ్యాఖ్య**

కర్మయోగము ద్వారా శుద్ధి పొందిన యోగయుక్తుడు, విద్వత్ సన్యాస ప్రాప్తిని శీఘ్రముగా పొందుతున్నాడు

అని ఆరవ శ్లోకంలో తెలుసుకున్నాం. యోగయుక్తుడు కర్మబంధాల నుండి ఎలా విడి పడతాడో, క్రమంగా కాలాతీత స్థితిని ఎలా పొందుతాడో, సోపానక్రమంగా ఐదు జ్ఞాన లక్షణాలతో సహేతుకంగా ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు భగవంతుడు.

**విశుద్ధాత్ముడు**

ఇక్కడ ఆత్మ అంటే మనస్సు అని అర్థము. విశుద్ధాత్మ అంటే అశుద్ధము నుండి విడిపడిన, మలిన రహిత మైన మనస్సు అని అర్థము. రాగద్వేషాది అశుద్ధమే మలదోషము. రాగద్వేషాల నుండి సంపూర్ణంగా విడిపడిన మనస్సు సత్త్వశుద్ధిని పొందుతుంది. యోగయుక్తుడు కర్మానుష్ఠానం చేత సంపూర్ణంగా రాగద్వేషాల నుండి విడిపడి ఉంటాడు కనుక, అతడు విశుద్ధ సత్త్వముతో నిండి ఉంటాడు. సత్త్వసంశుద్ధితో అలరారే ఆ పుణ్యాత్ముడే విశుద్ధాత్ముడు ***(విశుద్ధాత్మా విశుద్ధ సత్త్వః).***

విశుద్ధాత్ము డైన వాడు సాక్షాత్ జ్ఞాన సాధనమైన విద్వత్సన్యాస ప్రాప్తికి అర్హుడు. కనుకనే, ఆరవ శ్లోకంలో యోగయుక్తు డైన ముని శీఘ్రంగా బ్రహ్మమును పొందు తున్నాడు అని చెప్పడం జరిగింది. యోగయుక్తుడు ముని అవుతాడు అంటే విశుద్ధమైన బుద్ధి గలవాడు అవుతాడు అని అర్థము. ***స హి లోకే మునిర్నామ యః కామక్రోధ వర్జితః*** - కామక్రోధాల నుండి, అనగా రాగద్వేషాల నుండి విడిపడిన వాడు ముని అని చెబుతారు. అతడే విశుద్ధ సత్త్వము కలవాడు. బుద్ధి విశుద్ధము కానిదే మననశీలుడు కాలేడు. విశుద్ధ చిత్తునికే జ్ఞానం ప్రాప్తిస్తుంది. ఈ విశుద్ధ సత్త్వము యోగము వల్ల సిద్ధిస్తుంది. దీనినే మనోనిగ్రహము లేదా అంతరేంద్రియ నిగ్రహము అంటారు. నిగ్రహవంతుడు నియమవంతుడు అయిన యోగయుక్తుడు విజితాత్ముడు అవుతాడు.

**విజితాత్ముడు**

ఇక్కడ ఆత్మ అంటే దేహం అని అర్థము. విజితాత్మ అంటే విజిత దేహుడు లేదా దేహమును జయించిన వాడు అని అర్థము ***(విజితాత్మా విజితదేహః).*** చలించే దేహములో చలనశీలాలుగా తెలుస్తున్న బాహ్యేంద్రియాలు కూడా ఆత్మ శబ్దంతో చెప్పబడుతున్న దేహం క్రిందికే వస్తాయి. కనుక విజితాత్ముడు బాహ్యేంద్రియ నిగ్రహము కూడా కలవాడు అని అర్థము. దేహము, మనస్సు, కర్మేంద్రియాలు నిగ్రహింపబడిన విశుద్ధ విజితాత్మునకు జ్ఞానేంద్రియాలు వశ పడకుండా ఉంటాయా? అందుకే యోగయుక్తుడు జితేంద్రియుడు.

**జితేంద్రియుడు**

జ్ఞానేంద్రియములపై సంపూర్ణంగా పట్టు కలిగిన వాడు జితేంద్రియుడు. శ్లోకము యొక్క పూర్వార్థములో మనం యోగయుక్తుని విశుద్ధాత్ముడుగా, విజితాత్ముడుగా, జితేంద్రియుడుగా చూశాం. ఇదంతా కర్మయోగం వల్ల సిద్ధించిన శుద్ధియే. అట్టి పవిత్రాత్మునికి ఆత్మజ్ఞానం అవశ్యం ప్రాప్తిస్తుంది అని ప్రత్యేకించి చెప్ప వలసింది ఏముంది? ఈ విధంగా యోగయుక్తుడు పరంపరా ప్రాప్తంగా సిద్ధించే సన్యాసమును అందుకుంటాడు. విశుద్ధ సత్త్వంతో దేహేంద్రియ మనోబుద్ధులను నిగ్రహించి, పవిత్రతను సాధించడమే కర్మయోగము ప్రసాదించే చిత్తశుద్ధి. సన్యాసానికి విశుద్ధాత్ముడే అర్హుడు. అందుచేతనే సన్యాసిని ***త్రిదండి*** అని మనువు ముచ్చటగా పిలుచుకున్నాడు.

***వాగ్దణ్డో౽థ మనోదణ్డః కాయదణ్డ స్తథైవ చ***
***యస్యైతే నియతా దణ్డా స్స త్రిదండీతి కథ్యతే ॥***





దండము అంటే నియమము లేదా నిగ్రహము అని అర్థము. వాగ్దండము, మనోదండము, కాయదండము ఈ మూడింటిని ఎవడు నిగ్రహిస్తాడో అతడు ***త్రిదండి*** అవుతాడు. వాగ్దండమును బాహ్యేంద్రియ నిగ్రహానికి ఉపలక్షణంగా గ్రహించాలి.

యోగయుక్తుని బహిరంగ లక్షణాన్ని సాధన రూపంగా శ్లోక పూర్వార్థంలో అర్థం చేసుకున్నాం. విశుద్ధాత్మ డైన యోగయుక్తుని అంతరంగ లక్షణాన్ని సన్యాసి రూపంగా శ్లోక ఉత్తరార్థంలో తెలుసుకోబోతున్నాం.

**సర్వభూతాత్మ భూతాత్ముడు**

సర్వ భూతములలో ఆత్మగా ప్రకాశించునది తన ఆత్మయే అని తెలుసుకున్న వాడు సర్వభూతాత్మ భూతాత్ముడు ***(సర్వభూత ఆత్మభూతశ్చ ఆత్మా స్వరూపం యస్య సః).*** బ్రహ్మదేవుని మొదలుకొని గడ్డిపోచ (స్తంబం) వరకు గల జడాజడాత్మక మైన సర్వభూతాలకు, సమస్తమునకు ఆత్మయైన ప్రత్యక్చైతన్య రూపుడు సర్వభూతాత్మ భూతాత్ముడు అన్నది శ్రీ శంకర భాష్యము ***(సర్వేషాం బ్రహ్మాదీనాం స్తంబ పర్యన్తానాం భూతానామ్ ఆత్మభూతః ఆత్మా ప్రత్యక్చేతనః యస్య సః సర్వభూతాత్మ భూతాత్మా).***

కర్మసన్యాసం కన్నా కర్మయోగమే శ్రేష్ఠమని భగవంతుడు రెండవ శ్లోకంలో ఎందుకు ప్రవచించాడో విజ్ఞులు ఇప్పటికే గుర్తించి ఉంటారని భావిస్తాను. ముఖ్య సన్యాసానికి ఏ విధంగానూ అర్హుడు కానివాడు, కర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొంది, ఆ తరువాత దేహేంద్రియ మనస్సులను నియమించి, ఇప్పుడు సర్వాత్మ భావంతో దీప్తిమంత మయ్యాడు. ఇక్కడే జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. శ్లోకం పూర్వార్థం ముగిసే వరకు కర్మయోగి గోచరిస్తున్నాడు. శ్లోక ఉత్తరార్థంలో ఒక్కసారిగా ఉన్నపళంగా కర్మయోగి అదృశ్యమై జ్ఞానిజాడలు కనిపిస్తున్నాయి. కర్మయోగంలో శోభించిన వాడే ఈ క్షణంలో కర్మసన్యాసిగా విరాజిల్లు తున్నాడు.

సర్వభూతాత్మ భూతాత్ముడు అనగానే జ్ఞాని తెర మీదికి వచ్చేశాడు. సర్వభూతముల యందు విరాజిల్లే ఆత్మ తన చైతన్యమే అనే జ్ఞానం సామాన్యమైన జ్ఞానం కాదు. ఇది ఆత్మజ్ఞానం. అఖండ జ్ఞానం. అద్వైతానుభూతికి సంబంధించిన విషయం. జ్ఞాన సాధ్యమైన విషయమే గాని కర్మయోగ ఫలం కాదు. కర్మయోగం వల్ల చిత్తశుద్ధి లభించింది. ఆ తరువాత శీఘ్రంగా జ్ఞానం ప్రాప్తించింది.

ఇప్పుడు తాను సర్వభూతాత్మ భూతాత్ముడు. సర్వము తానై ప్రకాశించు వాడు. సమస్తములో వ్యాపించిన వాడు. సర్వగతుడైన తనలో కర్మాచరణమునకు అవకాశ ముందా? లేదు. అంటే, తాను కర్తగా లేడు. మరి ఎలా ఉన్నాడు? అకర్తగా ఉన్నాడు. కర్త లేనపుడు ఇక కర్మ ఎక్కడుంది? ఒకవేళ అకర్తలో కర్మలు గోచరించినా, అవి అకర్మ లవుతాయే గాని కర్మలు కావు. కర్మాభాసాలు మాత్రమే. ఈ సత్యాన్నే నాల్గవ అధ్యాయం పద్దెనిమి దవ శ్లోకంలో ***(కర్మణి అకర్మ పశ్యేత్)*** జ్ఞానికి కర్మలలో కలిగే అకర్మ దర్శనాన్ని గీతాచార్యుడు అద్భుతంగా వర్ణించాడు.

**ఉంటుందే గాని అంటదు**

సర్వభూతాత్మ భూతాత్ముడైన ఆత్మజ్ఞాని సమ్యగ్దర్శి. సమదర్శన యోగి. అతనిలో జ్ఞాన సంజనిత సమత్వమే గాని కర్మజనిత విషమత్వము గోచరించదు. అలాంటి మహాత్ముడు లోక సంగ్రహార్థం కర్మల్ని ఆచరించినా, వాటి చేత అంటబడడు. కనుకనే, కర్మ చేస్తున్నా అతడు లిప్తుడు కాడు ***(కుర్వన్నపి న లిప్యతే).*** ఇది కర్మ సన్యాసము కాదు. కర్మలలో సన్యాసము. జ్ఞానయుత కర్మసన్యాసము. కర్మలలో అకర్మ దర్శనం.

కర్మను త్యజించడం కర్మసన్యాస మైతే, అకర్త యైన ఆత్మజ్ఞాని కర్మసన్యాసి ఎలా అవుతాడు? కర్మ కర్మను త్యజించడం కర్మసన్యాస మైతే, అకర్త యైన ఆత్మజ్ఞాని కర్మసన్యాసి ఎలా అవుతాడు? కర్తే కర్మను త్యజించగలడు. కర్మను చేయని వాడే కదా అకర్త? చేయని కర్మను అకర్త ఎలా త్యజిస్తాడు? కర్తే కర్మను త్యజించగలడు. కర్మను చేయని వాడు వదలడానికి ప్రత్యేకంగా కర్మ త్యజించడం అకర్తకు సాధ్యం కాదు. కర్మలలో అకర్మను దర్శించే వాడు వదలడానికి ప్రత్యేకంగా కర్మ ఎక్కడుంది? అదే జ్ఞాన వైభవము.

పూర్వపు రోజుల్లో పెద్దలు నదీ స్నానానికి వెళ్తూ, పిల్లల్ని కూడా వెంట బెట్టుకొని వెళ్ళి వారితో పాటు స్నానం చేయించేవారు. స్నానం చేసి తీరానికి వచ్చిన తరువాత పెద్దలు తాము కట్టుకొని స్నానం చేసిన తుండు గుడ్డను పిండుతూ ఉండేవారు. వారితో పాటే స్నానం చేసిన పిల్లలు తాము ఏమి పిండాలో అర్థం గాక అలా ఆశ్చర్యంగా చూస్తూ ఉండేవారు. నిజమే కదూ! తడుపుకున్న వాడే పిండుకుంటాడు. బిత్తల బాలుడు తడిపిం దేముంది? పిండే దేముంటుంది? అకర్త కూడా అంతే. అతనిలో కర్మ ఉంటుందే గాని కర్మ అతనిని అంటదు. ఓం.. ఓం.. ఓం.

*చేస్తూ కూడా, చేయని వాడుగా శోభించే అకర్త యొక్క ఆంతరంగిక వైభవాన్ని వరుసగా రెండు శ్లోకాలలో వర్ణిస్తున్నాడు.*

నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్య ఞ్ఛృణ్వ న్స్పృశ ఞ్జిఘ్ర న్నశ్న న్గచ్ఛ న్స్వప ఞ్ఛ్వసన్ ॥ 8
ప్రలప న్విసృజ న్గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి ।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ 9

**న-ఏవ-కించిత్-కరోమి-ఇతి-యుక్తః-మన్యేత-తత్త్వవిత్**
**పశ్యన్-శృణ్వన్-స్పృశన్-జిఘ్రన్-అశ్నన్-గచ్ఛన్-స్వపన్-శ్వసన్**
**ప్రలపన్-విసృజన్-గృహ్ణన్-ఉన్మిషన్-నిమిషన్-అపి**
**ఇంద్రియాణి-ఇంద్రియార్థేషు-వర్తంతే-ఇతి-ధారయన్**

తత్త్వవిత్ = తత్త్వము తెలిసిన వాడు
యుక్తః = యోగయుక్తుడు
పశ్యన్ = చూస్తూ
శృణ్వన్ = వింటూ
స్పృశన్ = తాకుతూ
జిఘ్రన్ = వాసన చూస్తూ
అశ్నన్ = తింటూ
గచ్ఛన్ = నడుస్తూ
స్వపన్ = నిద్రించుచు
శ్వసన్ = శ్వాసిస్తూ
ప్రలపన్ = మాట్లాడుతూ
విసృజన్ = విడుస్తూ
గృహ్ణన్ = గ్రహిస్తూ
ఉన్మిష న్నిమిష న్నపి = కళ్ళు తెరుస్తూ మూస్తూ కూడా
ఇంద్రియాణి = ఇంద్రియాలు
ఇంద్రియార్థేషు = ఇంద్రియ విషయాల యందు
వర్తంతే ఇతి = ప్రవర్తిస్తున్నా యని
ధారయన్ = నిశ్చయించుకొని
కించిత్ = కొంచెము కూడా
న కరోమి ఏవ ఇతి = నేను ఏమీ చేయడం లేదని
మన్యేత = భావిస్తాడు

**పరమార్థ తత్త్వమును తెలిసిన యోగయుక్తుడు చూస్తూ, వింటూ, తాకుతూ, వాసన చూస్తూ, తింటూ, నడుస్తూ, నిద్రిస్తూ, శ్వాసిస్తూ, మాట్లాడుతూ, విడుస్తూ, గ్రహిస్తూ, కళ్ళు తెరుస్తూ, మూస్తూ కూడా ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో ప్రవర్తిస్తున్నాయి గాని నే నేమీ చేయడం లేదు అని భావిస్తాడు.**





**వ్యాఖ్య**

సర్వభూతాత్మ భూతాత్ముడు కర్మలు చేస్తున్నా వాటి చేత అంట బడడు అని తెలుసుకున్నాం. ఎందుచేత? అవి అతనికి సంబంధించినవి కావు కనుక. మరి, ఎవరిలో అయితే కర్మలు కనిపిస్తున్నవో అవి అతనివి కానపుడు, అవి ఎవరికి సంబంధించినవో అర్థం కావాలి. ఇంతకీ ఆ కర్మలు ఏమిటో కూడా తెలియాలి.

ఈ రెండు శ్లోకాలలో కర్మలను అంగీకరించడం జరిగింది. కాని, ఈ కర్మలు ఎవరిలో అయితే గోచరిస్తున్నాయో అతనిని మాత్రం కర్తగా అంగీకరించడం జరగడం లేదు. మరి కర్త ఎవరు? అది తెలుసుకునే ముందు ఆత్మవిదునిలో కనిపించే కర్మలను గూర్చి తెలుసుకుందాం.

ప్రస్తుత శ్లోకంలో ప్రధానంగా మనకు పద్దెనిమిది కార్యాలు కనిపిస్తున్నాయి. ఇవి ప్రతి వ్యక్తిలో కనిపిస్తాయి. అలాగే ఆత్మజ్ఞానిలో కూడా అగుపిస్తాయి. వీటిలో కొన్ని అసంకల్పిత వ్యాపారాలుగా తెలుస్తున్నాయి. ఎలా అయినప్పటికి, అవన్నీ వ్యక్తి లోనే గోచరిస్తున్నాయి.

ప్రథమంగా దర్శన శ్రవణ స్పర్శన ఘ్రాణ అశనంబులు అనే అయిదు కార్యాలు ఇంద్రియ వ్యాపారాలు. (1) కళ్ళు చూస్తున్నాయి. (2) చెవులు వింటున్నాయి. (3) చర్మము స్పృశిస్తోంది. (4) ముక్కు వాసన చూస్తుంది. (5) నాలుక రుచి చూస్తుంది. కనుక శ్రోత్రాది జ్ఞానేంద్రియాలు శబ్దాది విషయాలలో వాటి వాటి కార్యాలను నిర్వర్తిస్తున్నాయి. ఈ అయిదు జ్ఞానేంద్రియ వ్యాపారాలు.

అలాగే గమన ప్రలాప విసర్గ గ్రహణాలు అనే అయిదు కార్యాలు కర్మేంద్రియ వ్యాపారాలు. (1)పాదములు నడుస్తున్నాయి. (2) వాక్కు మాట్లాడుతూ ఉంది. (3, 4) పాయూపస్థలు విసర్జిస్తున్నాయి. (5) హస్తములు గ్రహిస్తున్నాయి. కనుక వాగాది కర్మేంద్రియాలు ప్రలాపాది విషయాలలో వాటి వాటి కార్యాలను నిర్వహిస్తున్నాయి. ఈ అయిదు కర్మేంద్రియ వ్యాపారాలు.

ఆ తరువాత శ్వాసించడం అనే కార్యము **శ్వసన్** గా తెలుస్తూ ఉంది. శ్వాసించడం అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసములను నిర్వర్తించడము. వాస్తవానికి **శ్వసన్,** అనగా శ్వాసించడం అనే ప్రాణక్రియ ప్రాణాది ఐదు కార్యాలకు ఉపలక్షణంగా చెప్ప బడింది. ఈ విధంగా పంచప్రాణాలు వాటి వాటి వ్యాపారాలలో నిమగ్నమై ఉన్నాయి. అవే ప్రాణ, అపాన, వ్యాన, సమాన, ఉదాన వాయువులు అనబడే ఐదు ప్రాణాది వ్యాపారాలు. ఇంతవరకు పదిహేను కార్యాలను చూశాం.

ఇక కళ్ళు తెరవడం **(ఉన్మిషన్),** కళ్ళు మూయడం **(నిమిషన్)** అనే రెండు కార్యాలు. జ్ఞానేంద్రియ వ్యాపారాలలో **పశ్యన్** అంటే చూడటము అనే కార్యాన్ని చూశాము కదా! కళ్ళు తెరవకుండా మనిషి ఎలా చూస్తాడు? మరి ఈ రెండూ చూడటము **(పశ్యన్)** క్రిందికి రావా? రావు. ఎందుకని?

కళ్ళు తెరవడం వేరు. తెరచిన తరువాత చూడటం వేరు. కళ్ళు తెరచి నంత మాత్రాన చూస్తున్నాడు అని చెప్పలేము. చూడవలసిన పని లేకపోయినా కళ్ళు అసంకల్పితంగా తెరువ బడుతూ, మూయ బడుతూ ఉంటాయి. కళ్ళు తెరవడం, కళ్ళు మూయడం అసంకల్పిత చర్యలు. చూడటం అనేది సంకల్పిత కార్యము. కనుకనే కళ్ళు మూతపడి ఉన్నా, చూడాలి అని మనిషి సంకల్పిస్తే, ప్రయత్నంతో కళ్ళు తెరచి చూస్తాడు. అదీ గాక, చూడటం అనేది కళ్ళు తెరచి నపుడు జరుగుతుందే గాని, కళ్ళు మూసి నపుడు జరగదు కదా! కనుక కళ్ళు తెరవడం, మూయడం అనే అసంకల్పిత కార్యాలు చూడటము **(పశ్యన్)** అనే జ్ఞానేంద్రియ కార్యము క్రిందికి రావు. ఇప్పటికి ప్రతి వ్యక్తిలో మనకు పదిహేడు కార్యాలు కనిపించాయి. ఇక పద్దెనిమిదవ కార్యము

ఉంది. దీనిని ఒక ప్రత్యేక దృక్కోణం నుండి చూడాలి. ఇది కార్యము గాని కార్యము. అదే నిద్ర పోవడం **(స్వపన్).**

నిద్ర పోవడం అంటే విరామము. విరామము అంటే కార్యాల నుండి విరమించడము. అంటే, కర్మాచరణము లేకుండా పడి ఉండటము. అదెలా కార్య మవుతుంది? అనే సందేహము రావచ్చు.

నిద్ర కూడా కార్యమే. లేకపోతే 'నేను నిద్ర పోతాను - నేను నిద్ర నుండి మేలుకున్నాను' అని మనిషి ఎందుకు అంటాడు? నిద్ర కార్యం కనుకనే అలా అంటాడు. పైగా కర్మ జరిగితే ఫలితం ఉండాలి. నిద్ర అనేది కర్మ కనుకనే నిద్రించిన వ్యక్తి అలసటను పోగొట్టుకొని విశ్రాంతిని అనుభవించడము అనే ఫలాన్ని పొందుతున్నాడు. ఇంతవరకు ప్రతి వ్యక్తిలో ప్రధానంగా గోచరించే పద్దెనిమిది కార్యాలను చూశాం. తత్త్వవిదునిలో కూడా ఈ పద్దెనిమిది కార్యాలు కనిపిస్తాయి. ప్రస్తుతం ఈ శ్లోకంలో కనిపిస్తున్న పద్దెనిమిది కార్యాలను సులభంగా గ్రహించేందుకు పాఠక్రమాన్ని అనుసరించకుండా, అర్థక్రమాన్ని ఎన్నుకొని వ్యాఖ్యానించాను.

ఇకపోతే, చూచేవాడు చూస్తున్నాను అని అంటాడు. వినేవాడు వింటున్నాను అంటాడు. తినేవాడు తింటున్నాను అని చెబుతాడు. కాని, వీటన్నిటికి భిన్నంగా, ఈ కార్యాలన్నీ చేస్తూ కూడా తానేమీ చేయడం లేదు అని ఒకడు విలక్షణంగా పలుకు తున్నాడు. అతడే యుక్తుడు. అంటే సమాహిత చిత్తం కలవాడు ***(యుక్తః సమాహితః సన్).*** ఆ యుక్తుడే తత్త్వవిదుడు. తత్త్వవిదుడు అంటే, ఆత్మ యొక్క యదార్థ స్వరూపాన్ని (తత్త్వం) తెలుసుకున్నవాడు ***(తత్త్వవిత్ ఆత్మనః యథాత్మ్యం తత్త్వం వేత్తీతి తత్త్వవిత్).*** యుక్తుడు, తత్త్వవిదుడు అయిన ఆత్మజ్ఞానినే సర్వభూతాత్మ భూతాత్ముడుగా గడచిన శ్లోకంలో చూశాము.

మనిషి ఏ కార్యాన్ని చేసినా 'నేను చేస్తున్నాను' అని తెలిసే చేస్తాడు. ఒక వైపు చేస్తూ, మరో వైపు నేను ఏమీ చేయడం లేదు, ఏ కొంచెమూ చేయడం లేదు ***(కించిత్ నైవ కరోమి)*** అని ఎలా చెబుతాడు? అనేది శంక.

ఎందుకు చెప్పడు? తత్త్వవేత్త కనుకనే చెబుతాడు. ఆత్మ యొక్క యదార్థ స్వరూపాన్ని తెలిసిన వాడు తత్త్వవిదుడు అని చెప్పుకున్నాం కదా! మరి, ఆత్మలో కర్మాచరణం ఉందా? ఆత్మ అకర్త కదా! తానే ఆత్మ అని తెలిసిన వాడు అకర్తే కదా! అకర్తలో కర్మ ఉంటుందా? లేనపుడు తాను కర్త ఎలా అవుతాడు? కర్మలో అకర్మను దర్శించే జ్ఞాని కర్త ఎలా అవుతాడు? కర్త కాడు అంటే కర్మ చేయని వాడే కదా? అందుకే అంటున్నాడు 'నేను ఏ కొంచెము చేయడం లేదు' అని. ఇదంతా అకర్త యైన ఆత్మవిదుని ఆంతరంగిక వైభవం.

మరి ఈ కార్యాలన్నీ చేస్తున్న దెవరు? ఇవన్నీ ఎవరికి సంబంధించినవి? ఎవరు చేస్తే వారికి సంబంధించినవి. చూడటం అనే కార్యము ఎవరు చేశారు? కళ్ళు. అయితే చూడటం నేత్రాలకు సంబంధించిన కార్యము. ఆలకించడం వీనులకు సంబంధించిన కార్యము. చూడటము చెవులకు సంబంధించిన కార్యము కాదు. వినడము నయన కార్యము కాదు. అలాగే సర్వ కార్యాలు ఆయా ఇంద్రియాలకు, ప్రాణాలకు, అంతః కరణమునకు సంబంధించినవే గాని, ఆత్మకు సంబంధించినవి కావు.

కనుకనే, నేను ఏ కొంచెము చేయడం లేదు. ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో ప్రవర్తిస్తున్నాయి అని ఆత్మవిదుడు అంటున్నాడు. అనడమే కాదు, నిశ్చయిస్తూ ఉన్నాడు ***(ధారయన్).*** అవధారణము అంటే నిర్ణయము. ఇక్కడ **ధారయన్** అనే క్రియా పదానికి 'నిశ్చయిస్తూ' అని అర్థం కనుక, వాక్య పూరణానికి 'భావిస్తున్నాడు' ***(మన్యేత)*** అనే క్రియా పదముతో సంబంధాన్ని ఏర్పరచు కోవాలి. ***(మన్యేత ఇతి పూర్వేణ సంబంధః).*** ***మన్యేత*** అంటే చింతించాలి; భావించాలి అని అర్థం. కాని వాస్తవానికి ఇది ఆదేశ వాక్యం కాదు. ఇది అవధారణమే గాని ఆచరణము కాదు. కనుక, భావించాలి అని కాకుండా, తత్త్వవిదుడు అలా భావిస్తాడు అని అర్థం చేసుకోవాలి.





కనుక కర్మలలో అకర్మను దర్శించే తత్త్వవిదుడు, కర్మ యందు కర్మ అభావమును చూస్తున్నాడు ***(కర్మణః అభావ దర్శనాత్).*** ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో వ్యవహరిస్తూ ఉంటే, వాటిని సాక్షిగా దర్శిస్తూ స్వరూపంలో వెలిగి పోతున్నాడు.

తాను ఉండటం చేతనే ఇంద్రియాలు ప్రవర్తిస్తున్నాయి. తన ప్రకాశాన్ని అనుసరించే సర్వ కార్యాలను ఇంద్రియాలు నిర్వర్తిస్తున్నాయి. వాటి ప్రవర్తనకు ఆధారమైన ప్రకాశము తానే. కాని, ఆ కర్మలు ఏవీ తనను అంటవు. తాను ప్రకాశకుడే గాని ప్రవర్తకుడు కాడు.

సూర్యుని ప్రకాశంలో ఎందరో ఎన్నో కార్యాలను నిర్వర్తించుకుంటూ ఉంటారు. ఆ కార్యాలు, వాటి ఫలితాలు నిర్వాహకులకు సంబంధించి ఉంటాయే గాని, ప్రకాశాన్ని ప్రసాదించిన ఆదిత్యునికి అంటవు.

దీప కాంతిలో ఎవరు ఏ పనులు చేసినా, వాటి ఫలాలు చేసిన వారికి చెందుతాయే గాని, దీపానికి కాదు. సూర్యుడైనా, దీపమైనా ప్రకాశకాలే గాని, ప్రవర్తకాలు కావు. మేము ఏమీ చేయడం లేదు. మా వెలుగులో ఎవరెవరో ఏవేవో చేసుకుంటున్నారు అని భావించడం జరుగుతుంది ***(మన్యేత).*** తత్త్వవిదుడు కూడా అలాగే భావిస్తాడు.

*తత్త్వవేత్త యొక్క ప్రవృత్తి, ప్రలాపము ఇలా ఉంటాయి. తత్త్వవేత్త కాని వాడు తత్త్వవేత్త కావడానికి కర్మయోగంలో ఎలా ప్రవర్తించాలో చెబుతున్నాడు.*

**బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న స పాపేన పద్మపత్ర మి వామ్భసా ॥** 10

***బ్రహ్మణి-ఆధాయ-కర్మాణి-సంగం-త్యక్త్వా-కరోతి-యః***
***లిప్యతే-న-సః-పాపేన-పద్మపత్రం-ఇవ-అంభసా***

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | కరోతి | = చేయుచున్నాడో |
| కర్మాణి | = కర్మలను | సః | = వాడు |
| బ్రహ్మణి | = పరబ్రహ్మము నందు | అంభసా | = ఉదకము చేతను |
| ఆధాయ | = ఉంచి | పద్మపత్రం ఇవ | = తామరాకు వలెను |
| సంగం | = ఆసక్తిని | పాపేన | = పాపము చేత |
| త్యక్త్వా | = విడిచి | న లిప్యతే | = అంటడు |

**కర్మలను భగవానునికి సమర్పించి, ఫలాసక్తిని విడిచి కర్మలు చేయువాడు, తామరాకు నీటి చేత ఎలా అంటబడదో, పాపము చేత అతడు అంట బడడు.**

**వ్యాఖ్య**

పరమార్థమును దర్శించే ఆత్మవిదుడు కర్మలు చేసినా వాటి చేత అంట బడడు ***(న లిప్యతే)*** అని ఏడవ శ్లోకంలో తెలుసుకున్నాం. కేవలం తత్త్వవిదుడే కాదు, ఈశ్వర భక్తుడుగా జీవించే కర్మయోగి కూడా కర్మల చేత అంట బడడు ***(న లిప్యతే)*** అని ఈ శ్లోకంలో చూడబోతున్నాం.

## కర్మము - కైంకర్యము

కర్త ఆచరించిన కర్మ యొక్క ఫలం
కర్మ చేసేవాడు కర్త. ఫలమును ఆశించి కర్త కర్మ చేస్తాడు కనుక, కర్త ఆచరించిన కర్మ యొక్క ఫలం కర్తకే చెందుతుంది. కర్మసంగం, ఫలసంగం ఉండటం చేత కర్మలు కర్తను బంధిస్తాయి. కర్మల చేత కర్త బద్ధుడవుతాడు.

ఆత్మవిదుడు కర్మల యందు
ఆత్మవిదుని విషయంలో కర్మలు ఉన్నా బంధము లేదని గ్రహించాము. ఆత్మవిదుడు కర్మల యందు అకర్మ దర్శనం చేస్తూ ఉన్నందున, ఫలాభిసంధి కూడా లేనందున, అతని ద్వారా జరిగే కర్మలు ఆయా ఇంద్రియాలకు సంబంధించినవే కనుక అకర్త యైన ఆత్మవిదుడు అభోక్తగా కూడా శోభిస్తూ ఉన్నందున, అతడు కర్మల చేత అంట బడడు.

ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో ప్రవర్తిస్తూ ఉన్నందున, కర్మ లన్నీ ఇంద్రియాలకు సంబంధించినవే గాని తనకు కాదు అని తత్త్వవిదుడు నిర్లిప్తుడై ఉన్నట్లే, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు చేస్తూ, ఫలితాలపై దృష్టి లేకుండా ఉండటం చేత యోగయుక్తుడు ఆచరించే కర్మలు కూడా ఈశ్వర కర్మలు అవుతున్నాయి గాని తనవి కావు. తనవి గాని కర్మలు తనను ఎలా బంధిస్తాయి? ఈ విధంగా కర్మయోగి కూడా ఆత్మవిదుని వలె కర్మల నుండి విడిపడు తున్నాడు. కర్మ ఎప్పుడైతే ఈశ్వరునిది అయిందో, ఫలం కూడా ఆయనకు సంబంధించిందే అయింది. ఈ విధంగా కర్తృత్వ భోక్తృత్వాల నుండి విముక్తు డైనందున కర్మయోగి కర్మలు చేసినా, కర్మ సంబంధము లేనివాడు గానే ఉన్నాడు.

యోగయుక్తుడు ఉంచుతాడు.
తాను చేసే కర్మలను ***(కర్మాణి)*** పరమేశ్వరుని యందే ***(బ్రహ్మణి)*** యోగయుక్తుడు ఉంచుతాడు. అనగా, సమర్పిస్తాడు ***(ఆధాయ నిక్షిప్య).*** కర్మలను భగవంతునికి సమర్పించడము అంటే, పరమేశ్వరుని కొరకే కర్మలను చేస్తున్నాను అనే భావమును దృఢంగా కలిగి ఉండటము అని అర్థం. సేవకుడు యజమాని కొరకే కర్మలను చేయునట్లు, ఈశ్వరుని కొరకు దాసుని వలె కర్మలను పూజగా మలచుకొని ఆచరించే వాడు కర్మయోగి ***(ఈశ్వరార్థం కరోతి ఇతి భృత్యః ఇవ, సర్వాణి కర్మాణి).***

కర్మయోగంలో ఇదొక అద్భుతమైన సాధన ప్రక్రియ. ఆచరించే ప్రతి పనిని పూజగా మార్చుకొనే ఆరాధనా వైభవం. ప్రతి కార్య క్షేత్రాన్ని ఆలయంగా మలచుకొనే అసమాన ప్రాభవం.

ఆలయంలో ప్రవేశించిన భక్తునిలో భగవంతుని కన్నా అన్యమైన ఆలోచనలు కదలవు. ప్రదక్షిణములో పాదాలు తిరిగినా, నమస్కారములో చేతులు కలిసినా, దర్శనములో నయనాలు చెమర్చినా, నామోచ్చారణలో నాలుక కదిలినా, అష్టాంగములు సాష్టాంగ ప్రణామంలో దండంలా సాగిల బడినా, ప్రతి కార్యం వెనుక ఈశ్వర భావనే. ప్రతి కర్మ ఈశ్వరుని కొరకే.

ఆలయంలో భక్తుడు తాను ఆచరించే కర్మల నన్నిటినీ ఈశ్వర భావనతో, ఈశ్వరుని కొరకే చేసినట్లు, కర్మయోగి కార్యక్షేత్రంలో ప్రతి కార్యాన్ని ఈశ్వరుని కొరకే చేస్తాడు ***(తదర్థం).*** ఈశ్వరుని దాసుడై చేస్తాడు ***(ఈశ్వర భృత్యవత్).*** దాసుడైన వాడు స్వామి కార్యాలను సేవా భావంతో చేస్తాడు. స్వామి చెప్పినట్లు చేసేవాడు దాసుడు. స్వామి ఉండమన్న చోట ఉండే వాడు దాసుడు. పనుల తోనే గాని ఫలితాలతో సంబంధము లేని వాడు దాసుడు. భక్తుడైన యోగయుక్తుడు తన స్వామి అయిన పరమేశ్వరుని విషయంలో అలాగే ప్రవర్తిస్తాడు. కర్మను కైంకర్యంగా మార్చుకుంటాడు. తన కంటూ ఇష్టాయిష్టాలు లేకుండా, స్వామి ఆజ్ఞయే ఆచరణీయంగా జీవిస్తాడు. కర్మను కైంకర్యంగా సమర్పించి, ఫలితాన్ని ప్రసాదంగా స్వీకరించి ప్రసన్నుడై ఉంటాడు. ప్రసాద చిత్తంతో పవిత్రంగా జీవిస్తాడు.





పనులు స్వామివి అని తెలియగానే, పనుల మధ్య తారతమ్యాలను దాసుడు చూడడు. పని చేయడమే ప్రధానంగా భావిస్తాడు గాని, ఎక్కడ చేస్తున్నాము, ఏ పని చేస్తున్నాము అని ఆలోచించడు.

భక్తుడు కూడా అంతే. 'నేను దాసుణ్ణి. ఈశ్వర భృత్యుణ్ణి. ఈశ్వరాజ్ఞలను భృత్యుని వలె ఆచరిస్తాను. ఆయన చట్టాలకు, ధర్మాలకు తలవంచి, ఆయన ఆజ్ఞాపించిన కార్యాలను సేవా దృక్పథంతో, కైంకర్య భావంతో నిర్వహిస్తాను.

నన్ను ఇక్కడికి పంపించిన వాడు నా స్వామి పరమేశ్వరుడే. ఈ కార్యంలో నన్ను నియమించింది అతడే. కార్యాచరణకు అనుకూలంగా నాకు కర చరణాదులు అతడే ప్రసాదించాడు. అతడు ఉండమన్న చోటే ఉన్నాను. ఆయన చెప్పినవే **(ధర్మాలు)** చేస్తున్నాను. చూచే కళ్ళను ఇచ్చాడు. చూడమని కళ్ళ ముందు ఏవి పరిస్తే వాటినే చూస్తున్నాను. ఆ కనిపించే వాటిలో చూపు నిచ్చిన వానినే చూస్తున్నాను. వినిపించిందే వింటున్నాను. అలా వినిపిస్తున్న శబ్దాలలో వినిపించే వాడి వినికిడిని వీనుల విందుగా వింటున్నాను. మనస్సులో ఆలోచనలను కదిలించే వాడు తానే. అందుకే నా భావాలు ఆరాధనా సుమాలై అతని చరణాల చెంత అలరారు తున్నాయి.

**చరణము:** **మధుర మధుర భావనలే నీ సేవలో పువ్వులు**
**నా గుండెలో గుసగుసలు వినిపించును గుడిగంటలు**
**పల్లవి:** **నా కవితే కోవెల నా పూజకు తరలిరా!**
**వచ్చే దారిని తెలిపితే నా యెదను అడుగుకు పరచెద** **॥ నా కవితే ॥**

పరిసరాలను ప్రసాదించింది తానే. పరిస్థితుల్ని ప్రవేశ పెట్టింది తానే. ఈనాటి నా స్థితికి ఆయనే కారణము. ఈ నా పరిస్థితి ఆయన ప్రసాదం. అంతా ఆయన నియామకమే. ఇదంతా అతనిదే. అంతా ఆయనదే కనుక, అంతా ఆయనకే సమర్పిస్తున్నాను. నా దంటూ లేకుండా, నా కంటూ మిగలకుండా, విశ్వనాథుడు వెలసిన విశ్వాలయంలో పూజారినై సర్వం సమర్పిస్తున్నాను. అన్నీ ఆయన నుండే వచ్చాయి. వస్తున్నాయి. ఆయన నుండి వచ్చినవి, వస్తున్నవి తిరిగి ఆయనకే సమర్పింప బడుతున్నాయి. మధ్యలో నా హృదయం హారతి పళ్ళెమై తరిస్తూ ఉంది'. ఇది, భక్తుని భావ హృదయం. కర్మలలో కైంకర్యం. బ్రహ్మములో కర్మలను నిక్షిప్తం చేయడం ***(బ్రహ్మణ్యాధాయ కర్మాణి).***

## కానిది ఎలా అవుతుంది?

నాది అనుకున్నది నాది కావచ్చు. లేదా, కాకపోవచ్చు. కాని, నాది కాదు అనుకున్నది మాత్రం నాది కానిదే అవుతుంది కాని, నాది కాలేదు. నాది కానిది నాది ఎలా అవుతుంది? ఏదైనా అంతే.

కర్మ నాది అనుకుంటే నాది అవుతుంది. కాదనుకుంటే కాకుండా పోతుంది. తాను ఆచరించిన కర్మే అయినా, అట్టి కర్మలో తత్త్వవిదుడు అకర్మను దర్శించగానే కర్మ అదృశ్యమై పోయింది. అకర్మగా దర్శన మిచ్చింది. అందుచేత తత్త్వవిదుడు కర్మలను ఆచరించినా వాటి చేత లిప్తుడు కాలేదు ***(కుర్వన్నపి న లిప్యతే - 5 - 7).***

అలాగే కర్మయోగి కూడా కర్మసంగం, ఫలసంగం లేకుండా కర్మాచరణంలో ఉన్నాడు. ఫలాసక్తి తోనే ఎవరైనా కర్మలను ఆచరిస్తారు. ఫలసంగం లేకుండా ఎవ్వరూ కర్మలను ఆచరించరు. తత్త్వవిదుడు లోక సంగ్రహము కొరకు కర్మల నాచరిస్తూ ఫలాసక్తి లేకుండా ఉన్నాడు కనుక, కర్మలను చేసినా లిప్తుడు కాలేదు. ***(లోక సంగ్రహాయ కర్మ కుర్వన్ అపి న లిప్యతే న కర్మభిః బధ్యతే)*** కర్మబద్ధుడు కాలేదు. అలాగే కర్మయోగి తన

విధ్యుక్త ధర్మాలను కర్మ ఫలాసక్తి లేకుండా, కేవలం చిత్తశుద్ధి కొరకే ఆచరిస్తూ ఉన్నందున, ఫలసంగం లేని అతనిని కర్మలు ఎలా బంధిస్తాయి? ఈ విధంగా కర్మల చేత యోగయుక్తుడు మలినం కాడు. ఫలితాల చేత కలుషితం కాడు ***(పాపేన న లిప్యతే).***

కర్మల విషయంలో గాని, కర్మఫలాల విషయంలో గాని ఏ విధమైన సంగత్వము లేకుండా యోగయుక్తుడు చరిస్తున్నాడు అని గ్రహిస్తున్న ఈ సందర్భంలో ఆచార్యుల వారి భాష్యము ఈ విషయానికి అధిక శోభను కలిగించింది.

కర్మయోగి కేవలం కర్మఫలాల యందే గాక, మోక్షఫలము నందు కూడా నిస్సంగుడే అని చెప్పడం అద్భుతమైన విషయం. మోక్షఫలము నందు కూడా సంగత్వమును త్యజించి యోగయుక్తుడు కర్మాచరణంలో ఉంటాడు అని శ్రీ శంకరులు చెప్పడం కర్మయోగ వైభవాన్ని అనితర సాధ్యంగా వర్ణించడమే అయింది ***(మోక్షేఽపి ఫలే సంగం త్యక్త్వా కరోతి యః కర్మాణి, లిప్యతే న సః సంబధ్యతే).***

ఇది కాస్త ఆరోగ్యాన్ని ప్రసాదించే ఔషధం లాంటి విషయం. జాగ్రత్తగా సేవించాలి. మోక్షార్థు లయ్యే కదా సన్యాసులు, యోగులు వారి వారి నిష్ఠలలో కొనసాగు తున్నారు! మోక్షాన్ని అభిలషించే కదా వివిదిషా సన్యాసి జ్ఞానార్జన చేస్తున్నాడు! అలాంటప్పుడు మోక్షఫలము నందు కూడా సంగము లేకుండా కర్మయోగి కర్మాచరణంలో ఉంటాడు అనే విషయాన్ని ఎలా జీర్ణించుకోవాలి? అదే కర్మయోగ వైభవము.

***ఈశ్వర భృత్యవత్ అహం కరోమి సర్వాణి కర్మాణి -*** ఈశ్వరుని సేవకుని లాగా సర్వ కర్మలను ఆచరిస్తున్నాను అని భావించే యోగయుక్తుడు, ప్రభువు వద్ద ఏమి ఆశిస్తాడు? ప్రభువు ఏది అనుగ్రహిస్తే దానినే ప్రసాదంగా అందుకుంటాడు. ప్రభువు ఆజ్ఞాపించిన కర్మను చేయుట యందే తనకు స్వేచ్ఛ గాని, ఫల నిర్ణయము ప్రభువుదే అని త్రికరణ శుద్ధిగా భావించే దాసుడు, ఫలసంగాన్ని ఎందుకు తయారు చేసుకుంటాడు? అల్పఫలమైనా, అధిక ఫలమైనా నిర్ణయించేది తన ప్రభువే కదా! అందుచేత మోక్షమును అనుగ్రహించే కార్యము కూడా జనార్దనునిదే అని గ్రహించిన యోగయుక్తుడు, మోక్షఫలము నందు కూడా సంగత్వము లేకుండా ఉంటాడు. అందుచేత కర్మము చేత గాని, కర్మఫలము చేత గాని అతడు లిప్తుడు కాడు. బద్ధుడు కాడు. అది ఎలాగో సోదాహరణంగా వివరిస్తున్నాడు.

**కమల వైభవంతో కర్మయోగి**

నీటి లోనే ఉన్నా తామరాకు ఎలా నీటి చేత అంట బడదో, అలాగే కర్మలను ఆచరిస్తున్నా యోగయుక్తుడు కర్మల చేత అంట బడడు. పద్మపత్రము నీళ్ళ నుండే పుడుతుంది. నీళ్ళ లోనే ఉంటుంది. నీళ్ళు తనపై ఉండినా, తాను నీళ్ళ చేత లిప్తం కాకుండా ఉంటుంది. అదే పద్మపత్రము యొక్క అసంగ వైభవము. ఈ కారణం చేతనే పరమేశ్వరుని దివ్యాంగములను కమల శోభతో పోలుస్తాము. ముఖ కమలం, నయన కమలం, హృదయ కమలం, నాభీ కమలం, కరకమలం, చరణ కమలం అంటూ సర్వేశ్వరుని సర్వాంగములను కమలంతో పోలుస్తాము. మన సంస్కృతిలో, మన వేదాంత సాహిత్యంలో కమలము జ్ఞానానికి ప్రతీకము. అసంగత్వానికి ప్రతిరూపము. అలౌకిక శోభతో పరిమళించే ఒకానొక లౌకిక వస్తువే పద్మము.

పద్మపత్రము జలము లోనే ఉండినా జలము చేత లిప్తం కానట్లు, యోగయుక్తుడు కర్మాచరణం లోనే ఉండినా, పాపం చేత లిప్తుడు కాడు ***(న లిప్యతే సః పాపేన, పద్మ పత్రమ్ ఇవ, అంభసా ఉదకేన).***

ఇక్కడ పాపం చేత అంట బడడు అనగానే, పుణ్యం అంటుకుంటుంది కాబోలు అని భావించ కూడదు. పాపం అనేది ఉపలక్షణం. అది పుణ్యానికి కూడా వర్తిస్తుంది. పుణ్యపాపాలు రెండూ యోగయుక్తుని అంటలేవు





అని భావము. పాపం ఎలా జన్మకు కారణ మవుతుందో, పుణ్యం కూడా జన్మహేతువుగా ఉన్నందున రెండూ జ్ఞాన ప్రతిబంధకాలే.

*యోగయుక్తుడు ఆచరించే కర్మకు కేవలం చిత్తశుద్ధియే ప్రధాన ఫలంగా ఉన్నందున, యోగులు జ్ఞానప్రాప్తి నిమిత్తం మరో ఫలాన్ని ఆశించకుండా అంతఃకరణ శుద్ధ్యర్థమే కర్మలను ఆచరిస్తారు అని చెబుతున్నాడు.*

**కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి ।**
**యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్య క్త్వాఽఽత్మశుద్ధయే ॥** 11

**కాయేన-మనసా-బుద్ధ్యా-కేవలైః-ఇంద్రియైః-అపి**
**యోగినః-కర్మ-కుర్వంతి-సంగం-త్యక్త్వా-ఆత్మశుద్ధయే**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాయేన | = | దేహము చేత | ఆత్మశుద్ధయే | = | చిత్తశుద్ధి కొరకు |
| మనసా | = | మనస్సు చేత | యోగినః | = | యోగులు |
| బుద్ధ్యా | = | బుద్ధి చేత | సంగం త్యక్త్వా | = | సంగత్వము వీడి |
| కేవలైః | = | ఆసక్తి లేని | కర్మ | = | కర్మను |
| ఇంద్రియైః అపి | = | ఇంద్రియముల చేత | కుర్వంతి | = | చేస్తున్నారు |

**యోగులు ఫలాకాంక్షను త్యజించి, కేవలము శరీరము, మనస్సు, బుద్ధి, ఇంద్రియములతో చిత్తశుద్ధి కొరకు కర్మలను ఆచరిస్తారు.**

**వ్యాఖ్య**

**కర్మ విచారము**

కర్మ ప్రపంచంలో మనం కదులుతూ ఉన్నాం. కర్మలను ఆచరిస్తూ బ్రతుకుతూ ఉన్నాం. కర్మలలో కొందరు సుఖాలను చేదుకొనే ప్రయత్నం చేస్తూ ఉంటే, మరి కొందరు దుఃఖాలను తోడుకుంటూ గుండెలు బాదుకుంటూ ఉన్నారు. సుఖాలను మోసుకొచ్చే శక్తి కర్మలకు లేదు. దుఃఖాలను క్రుమ్మరించే శక్తి కూడా కర్మలకు లేదు.

ప్రపంచంలో కర్మలే ఉన్నాయి. అన్ని కర్మలు మనవి కాకపోవచ్చు. మనకు సంబంధించిన కర్మ ఏదైనా సరే, అది మనం చేయ వలసిందిగా ఉంటుంది. అంతే. ఈ కర్మ ఉత్కృష్టం, ఆ కర్మ నికృష్టం అనేది లేదు. అవన్నీ మన భావనలు. ఆలోచనలు. ఊహలు. కర్మలలో తారతమ్యాలు లేవు. మన ఆలోచనలు కర్మలలో తారతమ్యాలను చూస్తాయి. ఇది అర్థమైతే, కర్మలను సంస్కరించాల్సిన అవసరం లేదు అని కూడా బోధ పడుతుంది. అంతేకాదు, ఒకవేళ సంస్కరించాలి అనుకుంటే, అది మన బుద్ధినే గాని కర్మలను కాదు అనేది కూడా స్పష్ట మవుతుంది. కార్యాలను శుద్ధి చేసే ప్రయత్నం కన్నా, కార్యాలను ఆచరించే కరణాలను శుద్ధి చేసే ప్రయత్నం సముచితము. సమున్నతము. శుద్ధి పడిన కరణాలచే ఆచరింప బడే కార్యాలన్నీ శుద్ధిపడే ఉంటాయి.

వివేకం లేని వారు కర్మలను ఆచరిస్తారు. వివేకవంతులు కూడా కర్మాచరణంలో ఉంటారు. జ్ఞానులు కూడా కర్మలను ఆవిష్కరిస్తూ కనిపిస్తారు.

వివేకం లేని వారు ఏదో ఆశించి కర్మలను చేస్తారు. ఏది వచ్చినా, అశాంతి తోనే అలమటిస్తూ ఉంటారు.

వివేకవంతులు ఆశలను ప్రక్కన పెట్టి, చేయవలసిన వాటిని చేయదగిన విధంగా చేస్తూ ఉంటారు. ఏదో రావాలి అని వారి మనస్సులో ఉండదు కనుక, ఏది వచ్చినా, ఆ వచ్చింది మనస్సును పీడించదు. వచ్చేవి వస్తున్నా, పోయేవి పోతున్నా, వాటి వెంటపడి పోకుండా మనస్సు కుదుట పడి ఉంటుంది. అలాంటి వారు అశాంతి అనేది తెలియకుండా ప్రసన్నంగా జీవిస్తూ ఉంటారు.

ఇక మిగిలిన వారు అరుదుగా అగుపించే జ్ఞానులు. వీరు కర్మలకు సంబంధించిన వారు కారు. అయినా లోక సంగ్రహం కొరకు కర్మలను ఆచరిస్తూ ఉంటారు. వారి కర్మలు విచిత్రంగా ఉంటాయి. వారు కర్మలు చేస్తున్నట్లు మనకు అనిపిస్తుంది. వారి కర్మలు వారికి కనిపించవు. వారి కర్మల ఫలితాలను లోకం అనుభవిస్తుంది. వారికి మాత్రం కర్మానుభవం ఉండదు. లోకానుభవమూ ఉండదు. వారి దొక అలౌకిక ప్రపంచం. ఆకాశంలో పక్షి పయనించిన తరువాత గుర్తులు ఎలా మిగలవో, నీటిలో నావ ప్రయాణం చేసిన తరువాత జాడలు ఎలా కనిపించవో, అలాగే జ్ఞానుల కర్మలలో పూర్వాపరాలు ఏమిటో వారికే అర్థం కాదు. వారు చూచే వారే కాని చేసే వారు కారు. కర్మలు చేసినా, వారు కర్మలను చేసేవారు కారు. కర్మలలో అకర్మను చూచేవారు.

**కర్మ వివేకము**

కర్మల విషయంలో అవగాహన లేకుండా, కర్మఫ లాసక్తితో కర్మలను ఆచరించే వారు అవివేకులు. కర్మల విషయంలో వివేకం కలవారు కర్మయోగులు. వారే ఇంతవరకు మనం చూచిన యోగయుక్తులు. విశుద్ధాత్ములు. విజితాత్ములు. జితేంద్రియులు. వివేకవంతులైన కర్మయోగుల యొక్క కర్మ విశేషాన్ని, కర్మ వైభవాన్ని, కర్మ విధానాన్ని, కర్మ అవసరాన్ని ఈ శ్లోకంలో అందిస్తున్నారు.

కర్మయోగులు కర్మలను ఆచరిస్తారు ***(యోగినః కర్మ కుర్వన్తి).*** యోగులు కర్మలు ఆచరించే వారే గాని కర్మదూరులు కారు ***(యోగినః కర్మిణః).*** కర్మలను ఆచరించే యోగులు కేవలము దేహం చేతనే, మనస్సు చేతనే, బుద్ధి చేతనే, ఇంద్రియముల చేతనే కర్మలు చేస్తూ ఉంటారు ***(కాయేన మనసా బుద్ధ్యా కేవలైః ఇంద్రియైః కర్మకుర్వన్తి).***

ఇంత వరకు మనం చూచిన దానిని బట్టి వివేకవంతు లైన యోగుల కర్మాచరణమునకు, అవివేకు లైన సామాన్యుల కర్మాచరణమునకు తేడా ఏమీ కనిపించడం లేదు. ఉభయులూ కర్మాచరణం లోనే ఉన్నారు. ఏ కరణముల ద్వారా అయితే యోగులు కర్మాచరణం చేస్తున్నారో, ఆ దేహేంద్రియ మనోబుద్ధు లనే కరణాల ద్వారానే అయోగులు కూడా కర్మాచరణం చేస్తున్నారు. ఇంతవరకు ఇరువురిలో ఏ తేడా కనిపించడము లేదు. కాకపోతే, యోగుల విషయంలో **కేవలైః** అనే విశేషణము ఒకటి కనిపిస్తూ ఉంది. అదేమిటో తరువాత చూద్దాం.

యోగులు, అయోగులు ఇరువురూ కర్మలలో ఉన్నా, యోగులు ఫలం కోసం చేయడం లేదు. అయోగులు ఫలం కోసమే చేస్తున్నారు. ఫలంపై ఆశతో అవివేకులు కర్మలను ఆచరిస్తూ ఉంటే, కర్మఫలాపేక్ష లేకుండా, యోగులు కర్మలను ఆచరిస్తూ ఉన్నారు. ఇది నాది - అది నాకు కావాలి అనే మమత్వ బుద్ధి యోగులలో లేదు. ఇది కావాలి అనే రాగమూ లేదు. అది వద్దు అనే ద్వేషమూ లేదు ***(సంగం త్యక్త్వా ఫల విషయమ్).*** ఫలాభి సంధి లేకుండా కేవలం దేహం చేత, కేవలం మనస్సు చేత, కేవలం బుద్ధి చేత, కేవలం ఇంద్రియాల చేత, మమకారం లేకుండా, ఫలాసక్తి లేకుండా కర్మలను ఆచరిస్తూ ఉంటారు. 'కేవలం' అనే శబ్దం మమత్వ వర్జితం అనే విషయాన్ని సూచించడానికి ప్రయోగించ బడింది.

కర్మసంగం లేకుండా, ఫలసంగం లేకుండా యోగులు కర్మలను ఎందుకు ఆచరిస్తారు? అనే ప్రశ్న





కూడా ఇక్కడ తలెత్తుతుంది. కేవలం అంతఃకరణ శుద్ధి కోసమే ఆచరిస్తారు అంటున్నాడు భగవంతుడు ***(ఆత్మశుద్ధయే సత్త్వశుద్ధయే ఇత్యర్థః).*** అంతఃకరణ శుద్ధి కొరకు మాత్రమే , సత్త్వశుద్ధి కొరకు మాత్రమే యోగులు కర్మలను ఆచరిస్తారు.

కర్మయోగికి నిత్యానిత్య వస్తు వివేకం ఉంది. అందుచేతనే అనిత్య ఫలాలపై అతనికి ఆశ లేదు. ఆసక్తి లేదు. అతడికి మోక్షమే కావాలి. తాను ముముక్షువు అనే విషయాన్ని చక్కగా గ్రహించిన వాడు కర్మయోగి. మోక్షాన్ని పొందాలి అంటే, మోక్షానికి సాక్షాత్ సాధనమైన జ్ఞానాన్ని సముపార్జించాలి. జ్ఞాన సముపార్జనకు చిత్తశుద్ధి అవసరం. చిత్తశుద్ధియే కర్మయోగిని జ్ఞానానికి సిద్ధం చేస్తుంది. ఇదే యోగయుక్తునికి లభించే కర్మయోగ ఫలం.

**కర్మయోగి జీవన వైభవము**

చేయవలసింది ఏమిటో, చేయదగింది ఏమిటో దానిని కేవలం మనస్సు చేత సంకల్పించి, అలా సంకల్పించిన దానిని కేవలం బుద్ధితో నిశ్చయించి, మమత్వము లేకుండా, రాగద్వేష రహితంగా కేవలం ఇంద్రియాల చేత, దేహము చేత యోగయుక్తుడు కర్మ చేస్తాడు. ఫలసంగం లేకుండా కేవలం దేహేంద్రియ మనోబుద్ధుల ద్వారా కర్మలను ఆచరిస్తాడు.

కర్మల విషయంలో తన కంటూ ప్రత్యేక ప్రాధాన్యతలు లేవు. కర్మాసక్తి లేదు. అలాగే ఫలాసక్తి కూడా లేదు. విహిత కర్మలనే వివేకంతో కర్మయోగి ఆచరిస్తాడు. తన కర్మలలో మమత్వం లేదు **(మమత్వ వర్జితైః).** మాధవత్వమే ఉంది. ఈశ్వరత్వమే ఉంది.

'ఈశ్వరుని కొరకే నేను కర్మ నాచరిస్తూ ఉన్నాను. నేను ఆచరించే కర్మ ఈశ్వర ప్రీతి కొరకే గాని నా ఫలం కోసం కాదు ***(ఈశ్వరాయ ఏవ కర్మ కరోమి న మమ ఫలాయ)***'. ఇదే ఈశ్వరార్పణ బుద్ధి. బుద్ధిలో ఈశ్వరత్వం ఉన్నప్పుడు ఇక మమత్వం ఎలా ఉంటుంది? కర్మలలో ఇష్టాయిష్టాలు ఉంటే కదా మమత్వము ఉండేది? ఫలాసక్తి లేనపుడు ఏది ఇష్టం? ఏది అయిష్టం? యోగయుక్తునిలో కర్మల పట్ల ఇష్టాయిష్టాలు లేవు. వాటి స్థానంలో ధర్మాధర్మాలు చేరి పోయాయి. ధర్మాచరణంలో ఏముంటుంది? ఎవరుంటారు? ధర్మాచరణంలో ధర్మమే ఉంటుంది. అదే ఈశ్వరబుద్ధి. ధర్మదృష్టి. ధర్మదృష్టే దైవదృష్టి. దైవం ధర్మరూపంలో ఉండటమే దానికి కారణము. ధర్మావగాహనతో, దైవదృష్టితో కర్మయోగి ఆచరించే కర్మలు అర్థకామాలకు సంబంధించినవి కావు. ధర్మాచరణం చేసినా పుణ్యఫలంపై యోగికి ఆసక్తి లేదు. అతని కర్మలన్నీ మోక్ష హేతువైన జ్ఞానాన్ని పొందటానికి అనువైన చిత్తశుద్ధి ప్రాప్తి కోసమే.

కర్మల విషయంలో అవివేకికి, వివేకంతో చరించే యోగికి భేద మెక్కడుందో మనకు సుస్పష్ట మైంది. కేవలం సత్త్వశుద్ధిని మాత్రమే ఫలంగా ఆశించి యోగి ఆచరించే ఆదర్శవంత మైన కర్మయోగాన్ని వివరించిన భగవంతుని హృదయం ఇప్పటికే ఆవిష్కృత మైంది. కర్మయోగమును ఆచరించ మని ఈ సందర్భంలో అర్జునునికి భగవంతుడు చెప్పకనే చెప్పేశాడు. పార్థా! ఏ కారణం చేత **(యస్మాత్)** యోగులు కర్మలను ఆచరిస్తున్నారో, ఆ కారణం చేతనే **(తస్మాత్)** నీకు కూడా కర్మాచరణము నందు అధికారం **(తత్ర ఏవ తవ అధికారః ఇతి).** కనుక అర్జునుడు కర్మయోగాన్నే అనుష్ఠించాలి **(కురు కర్మ ఏవ)** అనేది అచ్యుతుని సంకల్పం అని ఆచార్యుల అభిప్రాయం.

*యోగి ఫలసంగం లేకుండా కర్మలను ఆచరించి శాంతిని పొందుతూ ఉంటే, అయోగి ఫలాసక్తితో కర్మల నాచరించి బద్ధు డవుతున్నాడు. ఈ విషయాన్ని కూడా విశదం చేస్తున్నాడు.*

**యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥** 12

*యుక్తః-కర్మఫలం-త్యక్త్వా-శాంతిం-ఆప్నోతి-నైష్ఠికీం*
*అయుక్తః-కామకారేణ-ఫలే-సక్తః-నిబధ్యతే*

| | | | |
|---|---|---|---|
| యుక్తః | = ఆత్మయోగారూఢుడు | అయుక్తః | = యోగయుక్తుడు కాని వాడు |
| కర్మఫలం | = కర్మఫలమును | కామకారేణ | = కామప్రేరేపణ చేత |
| త్యక్త్వా | = విడిచి | ఫలే | = కర్మఫలము నందు |
| నైష్ఠికీం | = భగవత్ప్రాప్తి రూపమైన | సక్తః | = ఆసక్తుడై |
| శాంతిం | = శాంతిని | నిబధ్యతే | = బద్ధు డవుతున్నాడు |
| ఆప్నోతి | = పొందుతున్నాడు | | |

**యోగయుక్తుడు కర్మ ఫలాలను విడిచి, భగవత్ప్రాప్తి రూపమైన శాంతిని పొందుతాడు. యోగి కాని వాడు ఫలాపేక్ష ప్రేరణ చేత కర్మ ఫలంలో చిక్కుకొని బద్ధు డవుతాడు.**

**వ్యాఖ్య**

యుక్తుడు అంటే యోగయుక్తుడు, కర్మయోగి *(యుక్తః)*. అయుక్తుడు అంటే యోగము లేనివాడు. కర్మయోగి కానివాడు *(అయుక్తః)*. వీరు ఉభయులూ కర్మక్షేత్రం లోనే ఉంటారు. కర్మలను ఆచరిస్తూనే ఉంటారు. కర్మయోగి కర్మలు చేస్తున్నా ప్రశాంతంగా, ప్రసన్నంగా ఉంటాడు. కర్మల చేత బద్ధుడు కాకుండా ఉంటాడు. కర్మయోగి కాని వాడు కర్మలను ఆచరిస్తూ, వాటి మధ్య తన సుఖాన్ని జార విడుచు కుంటాడు. శాంతిని పోగొట్టు కుంటాడు. కర్మల చేత బద్ధు డవుతాడు. వీరిద్దరి మధ్య భేద మెక్కడుంది? కర్మలలో ఉందా? లేక భావనలో ఉందా? ఈ విషయాన్ని ప్రస్తుత శ్లోకం చక్కగా విశ్లేషించింది. శ్లోకము యొక్క ప్రథమ పాదంలో యోగయుక్తుడు కర్మలను ఆచరించే విధానమును, తద్వారా అతడు పొందే శాంతిని వివరించి, ద్వితీయ పాదంలో యోగి కాని వాడు కర్మలను ఆచరించే విధానమును, తద్వారా అతనికి కలిగే బంధమును తెలియ చేస్తున్నాడు.

**యోగయుక్తుడు**

తాను ఆచరించే కర్మలు ఈశ్వరుని కొరకే గాని తన ఫలం కొరకు కాదు అనే భావన కలవాడు కర్మయోగి. అతడే యోగయుక్తుడు. ఈ విధంగా కర్మఫలాలను త్యజించిన వాడు కనుక, కర్మ ఫలాసక్తి లేని కర్మయోగి శాంతిని పొందుతాడు. ఈ శాంతిని ***నైష్ఠికీం*** శాంతి అన్నాడు. నిష్ఠ వలన కలిగిన శాంతి కనుక దీనిని ***నైష్ఠికీం శాంతిం*** అన్నాడు ***(నైష్ఠికీం నిష్ఠాయాం భవాం)***. ఇక్కడ నిష్ఠ అంటే కర్మయోగ నిష్ఠ అని అర్థము. కర్మయోగ నిష్ఠలో కలిగిన అంతఃకరణ శుద్ధి చేత ప్రాప్తించే ప్రశాంత చిత్తమే ఇక్కడ ***నైష్ఠికీం*** శాంతిగా తెలుస్తూ ఉంది. కర్మయోగి ***(యుక్తః)*** కర్మఫలాల యందు ఆసక్తి లేనివాడై కర్మఫలాల్ని త్యజించి ఉండటం చేత ***(కర్మఫలం త్యక్త్వా)*** చిత్తశుద్ధి వలన కలిగిన శాంతిని ***(నైష్ఠికీం శాంతిం)*** పొందుతున్నాడు ***(ఆప్నోతి)***.

కర్మ ఫలాసక్తి లేకపోవడం చేత చిత్తము ప్రశాంతంగా ఉంది. కర్మ ఫలాసక్తి లేదు అంటే, కర్మాచరణంలో ఇష్టాయిష్టాలు లేవు అని అర్థము. అది కావాలి అనే రాగము గాని, ఇది వద్దు అనే ద్వేషము గాని లేవు. రాగద్వేషములు లేకుండా కర్మాచరణములో ఉండటం చేత చిత్తశుద్ధి ఏర్పడుతూ ఉంది. చిత్తములో కల్లోలం లేదు. అలజడి లేదు. బుద్ధి నిస్తరంగ సరోవరంలా ఉంది. అలలు లేవు. అలజడి లేదు.





కర్మఫలం ఏదైనా భవిష్యత్తులో అందేదే కదా! కర్మ ఫలాసక్తి కలవాడు కర్మఫలం ఎలా ఉంటుందో, ఎలా వస్తుందో, ఏ రూపంలో అందుతుందో అని ఆందోళన చెందుతూ ఉంటాడు. ఇదే మనస్సులో అశాంతి. ఇదంతా ఫలాసక్తి వలన కలిగిందే.

యోగయుక్తునికి కర్మ ఫలాసక్తి లేనందున మనస్సులో ఏ విధమైన ఆందోళన ఉండదు. ఏదో రావాలని కర్మలు చేయలేదు కనుక, ఏది వచ్చినా కలత చెందడు. ఏది వచ్చినా, ఎలా వచ్చినా ఆహ్వానమే. కర్మఫలాల యందు కర్మయోగి ఆనందంగా ఉంటాడే కాని ఆవేదన చెందడు.

ఇతరులు మనల్ని బాధిస్తే అర్థం చేసుకోవచ్చు. చేతనైతే అడ్డుకోవచ్చు. కాని, మనల్ని మనమే బాధ పెట్టుకోవడం ఆరంభిస్తే, దానిని ఎలా అర్థం చేసుకోవాలి? ఎలా అడ్డుకోవాలి? ప్రపంచంలో ఎక్కువ శాతం తమను తాము తెలిసో, తెలియకో హింసించుకొనే వారే. అలా తనను తాను కష్టపెట్టు కోని వాడు కర్మయోగి.

ఫలాసక్తితో కర్మ చేసి నపుడు ఫలితం విషయంలో ఆందోళన ఉంటుంది. తన ఫలం కొరకు కాక, కేవలం ఈశ్వరుని కొరకే కర్మలు ఆచరించిన వాడు తన కర్మకు ఏ ఫలాన్ని ఆశిస్తాడు? ఏ ఫలాన్ని ఊహిస్తాడు? ఏదీ ఆశించడు కనుక, దేనినీ ఊహించడు. ఏది అందినా, ఈశ్వరార్థం ఆచరించిన కర్మ యొక్క ఫలమే కావడం చేత దానిని ప్రసాదంగా స్వీకరిస్తాడు. ప్రసాదము అనేది వస్తువు కాదు; భావన. భావన బుద్ధిలో ఉంటుంది కనుక ప్రసాద భావన బుద్ధిలో చేరిపోతుంది.

***ప్రసాదః ఇతి ప్రసన్నతా*** - ప్రసాదము అంటే ప్రసన్నత. మానసిక ప్రశాంతత. చిత్త నైర్మల్యము. అదే చిత్త ప్రసాదము. ***ప్రసన్నస్య భావః ప్రసన్నత.*** ప్రసన్నత్వమే ప్రసాదము. కర్మఫలాలు ఎలా వచ్చినా చలించని ప్రశాంతత కర్మయోగి స్వభావము. ఈ విధమైన చిత్తశాంతి తనకు కర్మయోగము వల్ల కలిగింది.

ఇష్టాయిష్టాలు లేకుండా ఈశ్వర ప్రీత్యర్థం ఆచరించిన కర్మల యొక్క ఫలితాలే తనకు అందుతాయి కనుక, ఏ ఫలం వచ్చినా, అది కర్మఫలంగా ఉంటుందే గాని, ఇష్టఫలం గానో, లేక అనిష్టఫలం గానో ఉండదు. అందుచేత కర్మఫలం యోగయుక్తుని మనస్సును కలతపెట్ట లేదు. యోగయుక్తునికి ఆందోళన ఉండదు. ఆవేదన ఉండదు. అశాంతి ఉండదు. ఎప్పుడూ ప్రశాంతంగా ప్రసన్నంగా ఉంటుంది. అట్టి మనస్సులో శాంతి దూరం కాదు. ఈ విధమైన ***నైష్ఠికీం*** శాంతి ఒక కారణం వల్ల కలిగింది కాదు. అది అతని జీవనరీతిలో ఉద్భవించిన శాంతి పరిమళం. అశాంతి కారణాలు లేకపోవడం చేత సహజంగా విరజిమ్మ బడుతున్న శాంతి సౌరభం. అది నైమిత్తిక శాంతి కాదు. నిర్నిమిత్త శాంతి. సహజ శాంతి.

తొలకరి జల్లులు పడే టప్పుడు చాలా చల్లగా, హాయిగా, ఆహ్లాదంగా ఉంటుంది. పిల్లలు ఆడుతూ, పాడుతూ తొలకరి వానలో తడుస్తారు. పెద్దలు కూడా అలా తడవడంలో సంతసిస్తారు. చల్లని తొలకరి వానలో తడుస్తూ ఉంటే ఉల్లం ఊయలగా మారి ఊగుతుంది. ఆనందంలో తూగుతుంది. పరవశిస్తుంది. ఏదో చల్లని ప్రశాంతత గుండెలో గూడు కట్టుకుంటుంది. అలాగని ఈ తొలకరి పులకరింతలు ఎప్పుడూ ఉండాలంటే ఉండవు. ఉన్నప్పుడే ఉంటాయి. లేనప్పుడు, లేవు అనే నిరాశను, నిస్పృహను కలిగిస్తూ ఉంటాయి. నిమిత్తాలతో కలిగే సుఖాలు, శాంతులు ఎప్పుడూ ఇలాగే ఉంటాయి. కాని యోగయుక్తునికి కర్మనిష్ఠ వలన జనించిన, చిత్తశుద్ధి ద్వారా ప్రాప్తించిన శాంతి స్వాభావిక మైనదే గాని నైమిత్తిక మైనది కాదు. అందుకే అది ***నైష్ఠికీం*** శాంతి. దీనినే యోగయుక్తుడు పొందుతున్నాడు ***(శాంతి మాప్నోతి నైష్ఠికీం)***. ఈ వాక్యం చివర కొంత చేర్చుకోవాలి అన్నారు ఆచార్యులు. అలా వాక్యం చివర చేర్చుకోవడాన్ని 'వాక్యశేషం' అంటారు. ***శాంతి***

***మాప్నోతి నైష్ఠికీమ్*** అనే వాక్యం చివర, ***సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మ సంన్యాస జ్ఞాన నిష్ఠా క్రమేణ ఇతి వాక్యశేషః.***

***నైష్ఠికీం*** అంటే ***నిష్ఠాయాం భవాం*** - అనగా నిష్ఠ వలన కలిగేది అని అర్థం చెప్పుకున్నాం కదా! ***నైష్ఠికీం*** తరువాత చిత్తశుద్ధి, జ్ఞానప్రాప్తి, సర్వకర్మ సన్యాసము, జ్ఞాననిష్ఠ అనే క్రమం వాక్యం చివర చేర్చి అర్థం చేసుకోవాలి. అదే వాక్యశేషం. అంటే, కర్మ ఫలాకాంక్ష లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలను ఆచరించే యోగయుక్తుడు ముందుగా అంతఃకరణ శుద్ధిని పొందుతాడు. ఆ తరువాత, జ్ఞానమును, సర్వకర్మ సన్యాసమును, జ్ఞాననిష్ఠను పొంది, చివరగా జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షము అనే స్వరూప శాంతిని పొందుతాడు ***(శాంతిం మోక్షాఖ్యామ్ ఆప్నోతి).*** అంటే, కర్మయోగం చేత ***నైష్ఠికీం*** శాంతిని పొంది, క్రమేణ జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షాన్ని పొందుతాడు అని భావం. ఈ విధంగా కర్మయోగం వలన ఏర్పడే చిత్త ప్రశాంతత ***నైష్ఠికీం*** శాంతి కాగా, జ్ఞానం వల్ల ప్రాప్తించే నిత్యశాంతి స్వరూప శాంతి అవుతుంది. కర్మయోగి ఈ రెండిటిని క్రమేణ పొందుతాడు.

**అయోగ యుక్తుడు**

యోగయుక్తుడు కాని అవివేకి కామప్రేరణ చేత కర్మఫలము నందు ఆసక్తి కలిగి ఉంటాడు. ఈ ఫలాసక్తి కారణంగా, సుఖశాంతులను కోల్పోతాడు. అశాంతితో అలమటిస్తూ ఉంటాడు. అంతే కాదు, కర్మబంధంలో చిక్కుకొని దుఃఖిస్తూ ఉంటాడు. ఇదంతా ఫలాసక్తి వల్లే కలిగింది ***(ఫలే సక్తః నిబధ్యతే).*** ఫలాసక్తి అనేది కామ ప్రేరణ చేత కలుగుతుంది ***(కామకారేణ).***

***కారః*** అంటే చేయడము అని అర్థము ***(కరణం కారః).*** కామం యొక్క కారం కామకారం. ఆ కామకారం చేత ***(కామకారేణ)*** ప్రేరేపించ బడిన వాడు అని అర్థము. అతడే అయుక్తుడు ***(అయుక్తః).*** నేను ఈ విధమైన ఫలాన్ని ఆశించి ఈ కర్మ చేస్తున్నాను అనే ఫలాసక్తితో కర్మలను ఆచరించే అయుక్తుడు కర్మ సుడిగుండంలో పడిపోతున్నాడు. కర్మల చేత బద్ధు డవుతున్నాడు ***(మమ ఫలాయ ఇదం కరోమి కర్మ ఇత్యేవం ఫలేసక్తః నిబధ్యతే).*** కనుక యోగయుక్తునికి, అయుక్తునికి మధ్య ఫలసంగం లేక పోవడము, ఫలాసక్తి ఉండటమే ప్రధానమైన తేడా. కాబట్టి, అర్జునా! నువ్వు యోగయుక్తుడివి కా! అనేదే పరమేశ్వరుని భావము ***(అతః త్వం యుక్తః భవ ఇత్యర్థః).***

*ఇంతవరకు కర్మనిష్ఠను వివరించిన పరమేశ్వరుడు ఇప్పుడు జ్ఞాననిష్ఠను కూడా విస్పష్టం చేస్తున్నాడు.*

**సర్వకర్మాణి మనసా సంన్య స్యాస్తే సుఖం వశీ ।**
**నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్ ॥** 13

***సర్వకర్మాణి-మనసా-సంన్యస్య-ఆస్తే-సుఖం-వశీ***
***నవద్వారే-పురే-దేహీ-న-ఏవ-కుర్వన్-న-కారయన్***

| | | | |
|---|---|---|---|
| వశీ | = ఇంద్రియ నిగ్రహము గలవాడు | దేహీ | = పురుషుడు |
| మనసా | = మనస్సు చేత | న ఏవ కుర్వన్ | = చేయని వాడై |
| సర్వకర్మాణి | = సమస్త కర్మలను | న కారయన్ | = చేయించని వాడై |
| సంన్యస్య | = విడిచి పెట్టి | సుఖం | = సుఖముగ |
| నవద్వారే | = తొమ్మిది ద్వారములు గల | ఆస్తే | = ఉంటున్నాడు |
| పురే | = పురమున | | |





**ఇంద్రియాలను వశ పరచుకొనిన జీవుడు, సమస్త కర్మలను మనస్సు చేత సన్యసించి, ఏమీ చెయ్యక, ఏదీ చెయ్యించక తొమ్మిది ద్వారాలు కలిగిన శరీర మనే పట్టణంలో సుఖంగా ఉంటాడు.**

**వ్యాఖ్య**

సాంఖ్య, యోగాలలో ఇంత వరకు మనం అర్థం చేసుకున్న దానిని విశ్లేషించి చూస్తే, చిత్తశుద్ధి లేని వారికి కర్మసన్యాసం కన్నా కర్మయోగమే శ్రేయస్కర మని, చిత్తశుద్ధి కలిగిన యోగయుక్తులకు సర్వ కర్మ సన్యాసమే శ్రేయస్కర మని నిర్ధారింప బడింది.

కర్మయోగికి చిత్తశుద్ధియే ముఖ్య ప్రయోజనం. క్రమంగా చిత్తశుద్ధి ద్వారా జ్ఞానప్రాప్తి, జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షము ఏకైక ప్రయోజనం. ఇది కర్మనిష్ఠకు సంబంధించిన విషయం.

ఇక జ్ఞానయోగి విషయానికి వస్తే, సర్వకర్మ సన్యాసము ముఖ్య ప్రయోజనం. సర్వకర్మ సన్యాసం ద్వారా బ్రహ్మజ్ఞాన ప్రాప్తి, అంటే బ్రాహ్మీస్థితిలో ఉండటం ఫలం. ఇది జ్ఞాననిష్ఠకు సంబంధించిన విషయం.

జ్ఞానకర్మ సన్యాసమే బ్రాహ్మీస్థితి. సన్యాసము, బ్రహ్మము, సాంఖ్యము అనేవి పర్యాయ పదాలు. వీటన్నిటికీ అర్థం ఒక్కటే. అదే బ్రహ్మము.

***న్యాస ఇతి బ్రహ్మే బ్రహ్మే హి పరః*** అన్నది వేదం. ఇక్కడ 'బ్రహ్మ' శబ్దానికి సన్యాసము అని అర్థం. సమస్త వేదాంత వాక్యాల చేత చక్కగా **(సమ్యక్)** చెప్పబడుతూ ఉంది కనుక **(ఖ్యాయతే)** బ్రహ్మము **సంఖ్యమ్** అని పిలువ బడింది. సంఖ్యమును గూర్చి చెప్పేది సాంఖ్యము. బ్రహ్మము, బ్రహ్మజ్ఞానము వేరు కావు కనుక, సాంఖ్యము అంటే పరబ్రహ్మము అని అర్థము. కనుక సన్యాసిగా ఉండటము అంటే బ్రహ్మముగా ఉండట మనే అర్థము. ఇది జ్ఞాననిష్ఠ ఫలము. జ్ఞానకర్మ సన్యాసము. పరమార్థ దర్శనము. అట్టి పరమార్థ దర్శనము కలవాడు పరమార్థ దర్శి. అతడే ఆత్మజ్ఞాని. బ్రహ్మాత్మజ్ఞానంతో శోభించే జ్ఞానకర్మ సన్యాసి. అతడు ఎలా ఉన్నాడో చెబుతున్నాడు.

**జ్ఞానకర్మ సన్యాసి**

సర్వ కర్మలను జ్ఞానము చేత సన్యసించిన వాడు జ్ఞానకర్మ సన్యాసి. ఇతడిని **వశీ** అని, **దేహీ** అని ఈ శ్లోకంలో పేర్కొనడం జరిగింది. ముందుగా ఈ రెండు విషయాలను అర్థం చేసుకుందాం.

'వశీ' అంటే వశపరచుకున్న వాడు అని అర్థము. తన వశం చేసుకున్న వాడు అని భావం. అలా అనగానే దేనిని వశం చేసుకున్నాడు? అనే ప్రశ్న పుడుతుంది. అప్పుడు దేహేంద్రియ మనస్సులను వశీకరించుకున్న వాడు అనే సమాధానం లభిస్తుంది. కనుక, 'వశీ' అంటే జితేంద్రియుడు అని అర్థం ***(వశీ జితేంద్రియః ఇత్యర్థః).***

ఇక్కడ మరొక్క విషయాన్ని కూడా అర్థం చేసుకోవాలి. దేహేంద్రియాలను వశం చేసుకోవడమే నిజమైన వశీకరణం. ప్రయత్నిస్తే వశపడేవి కూడా ఇవే. ఇవి తప్ప ఇంకేమి వశ పడతాయి చెప్పండి! గాలిని మనం వశ పరచుకోగలమా? మేఘం మనకు వశపడి ఉంటుందా? వానలు మనకు వశపడి ఉంటాయా? పరవశాలు పారదర్శకాలు కావు. పైగా వాటిని వశీకరించుకొని సాధించే దేముంటుంది?

కనుక 'వశీ' అంటే జితేంద్రియుడు. శరీర వశీకరణమునకు ఇది ఉపలక్షణము. 'వశీ' ఎక్కడున్నాడో తెలుసా? దేహం లోనే ఉన్నాడు. అందుకే అతడు 'దేహీ' అని కూడా పిలువ బడినాడు. దేహంలో ఉండేవాడు దేహము తన వశంలో ఉండక పోతే, ఆ దేహంలో దేహిగా ఎలా ఉంటాడు? కనుక దేహంలో హాయిగా సుఖంగా ఉండాలి అంటే ***(వశీ సుఖం ఆస్తే)*** దేహము, దేహము లోని ఇంద్రియ మనస్సులు కూడా తనకు వశపడి ఉండాలి.

### సర్వకర్మ సన్న్యాసము

విశ్రాంతి తీసుకొనే వాడు పనులకు ముగింపు పలకాలి. కర్మలను త్యజించాలి. మరి, దేహంలో సుఖంగా వసించే 'వశీ', సర్వ కర్మలను విడిచి పెట్టేశాడు. కర్మలను సంపూర్ణంగా విడిచి పెట్టడం సాధ్యమా? సాధ్యం కాదు. అందుచేత దేహి సర్వ కర్మలను మనస్సు చేత సన్యసించాడు ***(సర్వ కర్మాణి మనసా సన్న్యస్య).*** మనస్సుతో ఎలా సన్యసిస్తాడు? మనస్సు చేత సన్యసించడం అంటే వివేకము చేత త్యజించడము అని భావము ***(మనసా వివేక బుద్ధ్యా).***

మనస్సు చేత త్యజించడము అంటే జ్ఞానము చేత త్యజించడము అని అర్థము. ఇంతకీ ఏమిటి ఆ జ్ఞానము? కర్మల యందు అకర్మను దర్శించే జ్ఞానము ***(కర్మాదౌ అకర్మ దర్శనేన సంత్యజ్య ఇత్యర్థః).*** తాను అకర్త అనే జ్ఞానం చేత కర్మలను సన్యసించడమే ఇక్కడ వివేక బుద్ధి.

ఆత్మ అకర్త. కనుక ఆత్మయైన తాను అకర్తే. అకర్తలో కర్మ ఎలా సాధ్యం? నేను అకర్తను. కనుక ఏ కర్మను కూడా నేను చేయడం లేదు ***(న ఏవ కించిత్ కరోమి).*** నాలో కర్మాచరణకు అవకాశమే లేదు. నాలో కర్మలు లేవు. కాని ఎండమావిలో జలం లాగా లేనివే ఉన్నట్లు ఆరోపించ బడ్డాయి. ఈ అధ్యాస మనస్సు లోనే జరిగింది కనుక, నాలో ఆత్మజ్ఞానం చేత నేను అకర్తను అని గ్రహించడం వల్ల మనస్సులో అధ్యస్త మైన కర్మలను వివేకముతో మనస్సు చేతనే త్యజించాను.

మరి కర్మలు దేహము ద్వారా, ఇంద్రియాల ద్వారా కూడా జరుగుతాయి కదా! ఒక్క మనస్సు చేత త్యజిస్తే సరిపోతుందా? అనే సందేహం రావచ్చు. సర్వ కర్మలను సన్యసించడము అనేది మనస్సు చేత, మనస్సు లోనే జరగాలి. వినడము అనే దానిని త్యజించాము అనుకోండి. దాని వల్ల శ్రోత్రేంద్రియమును త్యజించడమే జరుగుతుంది. రసనేంద్రియమును త్యజించినట్లు అవుతుందా?

ఏ ఇంద్రియాన్ని జయిస్తే, ఆ ఇంద్రియ విషయాలే జయింప బడుతాయి. కాని మనస్సు చేత సన్యసిస్తే సర్వేంద్రియ కార్యాలను త్యజించినట్లు అవుతుంది. విషయ సంపర్కము ఇంద్రియాల ద్వారా, దేహము ద్వారా జరుగవచ్చు. కాని, విషయ జ్ఞానం మాత్రం మనస్సు లోనే కలుగుతుంది. కనుక మనస్సు చేత, అనగా వివేకము చేత సన్యసిస్తే సర్వ కర్మలు త్యజింప బడుతాయి. ఉదాహరణకు, వాక్కును సన్యసించాలి అనుకున్న వారిలో అట్టి వాగాది ప్రవృత్తి నివృత్తులు వాక్కు స్థాయిలో జరగవు. మనోవ్యాపారం గానే జరుగుతాయి. ఒక వాక్యం చూడండి!

**యద్ధి మనసా ధ్యాయతి త ద్వాచా వదతి తత్కర్మణా కరోతి!**

మనస్సు చేత ఏది ఆలోచిస్తున్నాడో దానినే వాక్కు చేత చెబుతున్నాడు. దానినే కర్మగా ఆచరిస్తున్నాడు. కనుక ప్రవృత్తి అయినా, నివృత్తి అయినా మనోస్థాయిలో జరుగ వలసిందే గాని దేహేంద్రియాల స్థాయిలలో కాదు.

### సన్న్యాసి నివాసము

దేహేంద్రియ మనస్సులను వశ పరచుకొని, వివేకము చేత సర్వ కర్మలను త్యజించిన జ్ఞానకర్మ సన్యాసి ఎక్కడున్నాడు? ఆయన వాసస్థాన మెక్కడ? దేహం లోనే. దేహంలో వసిస్తూ ఉన్నాడు కనుకనే 'దేహి' అయ్యాడు. 'దేహి' అంటే, దేహమును ధరించిన వాడు లేదా దేహంలో ఉన్నవాడు అని అర్థం.

శరీరం అనే పురంలో ఉన్నాడు. ఆ పురానికి తొమ్మిది ద్వారాలు. అది నవద్వార పురము. తొమ్మిది





ద్వారాలు గల దేహ మనే నగరంలో సర్వ కర్మలను సన్యసించి ప్రభువు లాగా సుఖంగా వసిస్తున్నాడు ***(నవ ద్వారే పురే, దేహీ, సర్వం కర్మ సన్న్యస్య సుఖమ్ ఆస్తే).*** ఇది జ్ఞాని యొక్క వాసస్థలము.

అదేమిటి? అందరమూ ఉండేది దేహాల లోనే కదా! మరి, జ్ఞాని ప్రత్యేకత ఏమిటి? సన్యాసి అయినా, సన్యాసి కాకపోయినా ప్రతి దేహీ దేహం లోనే కదా ఉన్నాడు! అలాంటప్పుడు సన్యాసి దేహంలో ఉంటాడు అని విశేషించి పలకడంలో ఔచిత్య మేమిటి? ఈ విశేషణం అర్థరహితం కదా! ***(తత్ర అనర్థకం విశేషణం ఇతి)*** అనేది శంక.

అందరూ ఉండేది దేహాల లోనే అయినా, అలా ఉన్నాము అనే జ్ఞానం ఎవ్వరికీ లేదు, ఇలా ప్రశ్నించే వ్యక్తితో సహా. అందుచేతనే జ్ఞాని విషయంలో విశేషించి చెప్పవలసి వచ్చింది.

ఏమండీ! నిన్న మీ రెక్కడున్నారు అని అడిగితే ఏమి చెబుతాడు? ఇంట్లోనే ఉన్నానండీ! అంటాడు. సరిపోయిందా! తాను 'దేహి' అనే జ్ఞానమే కనుక ఉంటే ఇంట్లో ఉన్నాను అని అనడు. ఒంట్లో ఉన్నాను అంటాడు. అదే విశేషము.

ఎవరైనా సెల్‌ఫోన్‌లో పలకరిస్తే, సాయంత్రం చెయ్యండి, ఇప్పుడు ఆఫీసులో ఉన్నాను అంటాడు. లేదా, ప్రస్తుతం కారులో వెళ్తున్నాను, పావుగంట తరువాత నేనే చేస్తాను లెండి అంటాడు.

ఇంతకీ ఇంట్లో ఉన్న దెవరు? ఆఫీసులో ఉండింది ఎవరు? కారులో ప్రయాణం చేసిందెవరు? దేహమే. దేహమే. దేహమే. ఎప్పుడు అడిగినా, ఎవరిని ప్రశ్నించినా, 'నేను దేహము' అనే స్థాయి నుండి సమాధానం చెబుతున్నారే గాని, 'నేను దేహములో ఉండే దేహిని' అనే జ్ఞానంతో ఎవరైనా మాట్లాడు తున్నారా?

మనం వసించే ఇల్లు ఎలా మనం కామో, మనం వసించే దేహం కూడా మనం కాము. దేహం ఎక్కడున్నా, తాను దేహంలో ఉన్న ఎరుక కలిగిన వాడు జ్ఞాని. తాను ఆత్మయై దేహంలో ఉండేవాడు జ్ఞాని. తాను దేహమై గృహంలో ఉండేవాడు అజ్ఞాని.

***అహ మిహాస్మి*** - నేను ఇక్కడ ఉన్నాను అని అందరూ చెబుతారు. ఎక్కడ? అని ప్రశ్నిస్తే, ఇంట్లో అని ఒకడు, ఆఫీసులో అని మరొకడు, కారులో అని వేరొకడు సమాధాన మిస్తారు. అంతేగాని, నేను దేహంలో ఉన్నాను అని ఎవ్వరూ చెప్పరు. ఎందుకని? తెలియదు కనుక. అలా తెలిసిన వాడు జ్ఞాని ఒక్కడే. నవద్వార పురంలో ప్రభువులా శోభించగల వాడు జ్ఞాని ఒక్కడే.

### పుర ప్రభువు

పురి అంటే పురము లేదా శరీరము అని అర్థము. పురము నందు అనగా శరీరము నందు ఉండేవాడు కనుక పురుషుడు అనే పేరు వచ్చింది ***(పురి శరీరే శేతే ఇతి పురుషః).*** అందరూ పురుషులే. కాని, శరీరము పురము అనే జ్ఞానం అందరికీ లేదు.

శరీరంలో ఉండేవాడు శరీరి. అతడే దేహి. తొమ్మిది ద్వారాలు గల పురంలో ప్రభువు లాగా ఉన్నాడు. నవరంధ్రాలు గల మానవ శరీరమే నవద్వార పురం. శీర్షణ్యములు ఏడు. ఇవి ఊర్ధ్వ ద్వారాలు. విసర్గార్థములు రెండు. ఇవి అధోద్వారాలు. మొత్తము తొమ్మిది.

ఇదొక అద్భుతమైన పురము. అందమైన నగరము. ఎన్నో సౌకర్యాలు ఉన్న పట్టణము. తొమ్మిది ద్వారాలు కావడం చేత అన్ని వైపుల నుండి సమస్తము తెలుస్తూ ఉంటుంది. ద్వారాలు ఎక్కువ కనుక రాకపోకలకు ఇబ్బంది లేదు. రక్షణ వ్యవస్థ మహాద్భుతంగా ఉంటుంది. రాత్రిపూట అన్ని ద్వారాలు మూత

పడతాయి. హాయిగా, ప్రశాంతంగా విశ్రాంతి సదనం శోభిస్తూ ఉంటుంది. శయన మందిరములో లబ్-డబ్ అనే గుండె గడియారం శబ్దం తప్ప మరొక శబ్దం ఉండదు.

భగవద్గీత ఉపనిషత్సారము అని ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు. ఈ నవద్వార పురము అనే దేహ విషయాన్ని ఉపనిషత్తులు ఉదహరించే ఉన్నాయి. కఠోపనిషత్తులో మానవ దేహాన్ని పదకొండు ద్వారాల పురం అని అభివర్ణించడం జరిగింది *(పురం ఏకాదశ ద్వారం).* నవరంధ్రములతో పాటు పై భాగాన నడినెత్తిన బ్రహ్మ రంధ్రము, దిగువ భాగాన నాభితో కలసి పదకొండు ద్వారాలుగా కఠోపనిషత్ ప్రవచించింది ***(2-5-1).*** శ్వేతాశ్వతరోపనిషత్తు మాత్రం నవద్వారాలు అనే పేర్కొంది ***(3-18).*** అదే మంత్రంలో నవద్వార పురం అనే దేహంలో వసించే ప్రభువైన ఆత్మను 'వశీ' అని చెప్పడం కూడా జరిగింది. కాకపోతే, మనం ప్రస్తుతం చర్చిస్తున్న గీతా శ్లోకంలో 'వశీ' అంటే దేహేంద్రియ మనోబుద్ధులను వశ పరచుకున్న వాడు అని అర్థం చెప్పుకున్నాం. శ్వేతాశ్వతర ఉపనిషత్తు చరాచర ప్రపంచాన్ని వశ పరచుకున్న వాడు అని ఆత్మ యొక్క సర్వ వ్యాపకత్వాన్ని కూడా స్పృశించింది *(వశీ సర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ).*

శిరోగతా లైవ ఏడు రంధ్రాలు (రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు నాసికా రంధ్రాలు, ఒక నోరు వెరశి ఏడు ద్వారాలు), అధోగతాలైవ పాయూపస్థలు రెండు, మొత్తం తొమ్మిది రంధ్రాలు తొమ్మిది ద్వారాలు. ఈ విధమైన నవద్వారపురము, ఒక పురము ఎలా ప్రభువు కొరకు ఉంటుందో, అలాగే పుర ప్రభువు అయిన ఆత్మ కొరకు ఉంటుంది. ఇక్కడ పురము అని చెప్పడంలో పురం వంటి పురము అని అర్థం. అంతేగాని కేవలం పురం అనే కోణం నుండి చూడ కూడదు *(పురం పురమివ పురం* - శ్రీ శంకరుల ఉపనిషద్భాష్యం).

పురము రాజు అధీనంలో ఉంటుంది. కాని పురము వేరు, రాజు వేరు. రాజు స్వతంత్రుడై శోభిస్తాడు. అలాగే దేహ మనే పురము దేహి అయివ ప్రభువు అధీనంలో ఉంటుంది *(వశీ).* కాని, దేహం వేరు, దేహి వేరు.

రాజు ఉండటం వల్లనే నగరంలో సర్వ కార్యాలు జరుగుతూ ఉంటాయి. అలాగని, రాజు ఆ కార్యాలను స్వయంగా చేయడు. తానేమీ చేయక పోయినా, తన సన్నిధి మాత్రం చేతనే పురంలో సర్వ కార్యాలు సాగిపోతూ ఉంటాయి. కాకపోతే, పురవాసు లందరూ తన వశంలో ఉంటారు.

ఆత్మ ఉండటం చేతనే నవద్వార పురమైన దేహంలో సమస్త కార్యాలు జరుగుతూ ఉంటాయి. ఆత్మకు ఏ కార్యమూ ఉండదు. ఆత్మ అకర్త. తానేమీ చేయక పోయినా, చేయించక పోయినా, తన సన్నిధి మాత్రం చేత శరీర మనే పురంలో *(ఇదం శరీరాఖ్యం పురం నవద్వారాణి)* సర్వ కార్యాలు సాగిపోతూ ఉంటాయి. కాకపోతే అన్నీ తనకు వశపడి ఉంటాయి. పురవాసులు రాజుకు వశపడి ఉన్నట్లు, ఇంద్రియాలు, మనస్సు, చిత్తము, బుద్ధి, ప్రాణాలు అనే పురవాసులు దేహికి వశపడి ఉంటాయి. ఈ విధంగా నవద్వార పురంలో శోభించే పుర ప్రభువు పురంలో ఉండే వాడే గాని, పనులు చేసే వాడు కాడు, చేయించే వాడూ కాడు *(న ఏవ కుర్వన్, న కారయన్).*

**ఉనికే గాని ఊడిగము లేదు**

దేహానికి విలక్షణంగా దేహి ఉన్నాడు అని అర్థం చేసుకున్నాం. దేహికి కర్మలు లేవు. కార్యాలన్నీ దేహేంద్రియ మనోబుద్ధుల లోనే గోచరిస్తున్నాయి. అనాత్మలో తెలుస్తున్నాయి. అనాత్మ సంబంధమైన దేహేంద్రియాదులలో జరిగే కర్మలను అకర్త అయిన ఆత్మలో అజ్ఞానం చేత ఆరోపించడం వల్ల, ఆత్మను కర్తగా, కారయితగా భావించడం జరుగుతూ ఉంది. వాస్తవానికి కర్తృత్వ కారయితృత్వాలు అకర్త యైన ఆత్మలో లేవు. జపాకుసుమ సాదృశ్యము ఈ విషయాన్ని సులభ గ్రాహ్యం చేస్తుంది.





జపాకుసుమము అంటే దాసాని పువ్వు. అది రక్త వర్ణంతో ఉంటుంది. దానిని స్ఫటికం సమీపంలో ఉంచితే, సాన్నిధ్య ప్రభావం చేత స్వచ్ఛమైన స్ఫటికంలో రక్త వర్ణము గోచరిస్తుంది. గోచరిస్తుందే గాని వాస్తవానికి స్ఫటికంలో రక్త వర్ణము లేదు. అలాగే అనాత్మ సాన్నిధ్యము వలన అకర్త యైన ఆత్మలో కర్తృత్వ కారకత్వాదులు ఆరోపించ బడుతున్నాయి. వాస్తవానికి ఆత్మ నిష్క్రియ మైనందున ఆత్మలో ఏ కార్యకలాపాలు జరిగే అవకాశం లేదు. సర్వ కర్మలు ఆత్మ యందు ఆరోపించ బడినవే గాని వాస్తవముగా లేనివే. లేని వాటిని త్యజించడం ఎలా సాధ్య పడుతుంది? బుద్ధిలో అజ్ఞానం చేత లేకనే ఉన్నట్లు తెలిసే వాటిని బుద్ధి లోనే జ్ఞానం చేత విడిచి పెట్టాలి కనుక, సర్వ కర్మలను వివేక బుద్ధి చేత ఆత్మజ్ఞుడు సన్యసించడం జరిగింది *(సర్వ కర్మాణి మనసా సన్యస్య).*

'ఆత్మకు కర్తృత్వ కారయితృత్వాదులు లేకపోవడం అనేది లేదు. అవి సహజంగా ఆత్మలో ఉన్నవే. కాకపోతే, సర్వ కర్మ సన్యాస ఫలంగా అవి లేకుండా పోయాయి' అని యోచించే ప్రబుద్ధులు కూడా లేకపోలేదు. అంటే, సహజంగా నడవ కలిగిన వాడు నడవడం అనే వ్యాపారాన్ని విడిచి పెట్టినట్లు, కర్తృత్వము సన్యాసము చేత లేకుండా పోయిందా, లేక స్వతః ఆత్మలో కర్తృత్వము లేదా? *(యథా గచ్ఛతః గతిః గమన వ్యాపార పరిత్యాగేన స్యాత్ తద్వత్, కిం వా స్వతః స్వతః ఏవ ఆత్మనః నాస్తి ఇతి?).*

ఆత్మలో ఏ వికారమూ లేదు. ఆత్మ అవికార్య సత్తా స్వరూపము. కర్తృత్వము గాని, కారయితృత్వము గాని ఆత్మలో ఉండేందుకు అవకాశమే లేదు. ఒకవేళ అలా ఉంటే, పురుషార్థ సిద్ధియే లేకుండా పోతుంది కదా! నడిచేవాడు ఆపిన నడకను తిరిగి ప్రారంభించి నట్లు, సన్యాస ఫలంగా అదృశ్యమైన కర్తృత్వాదులు తిరిగి బుద్ధి తెర పైకి వచ్చే ప్రమాదము లేకపోలేదు. కనుక, నిష్క్రియమైన ఆత్మలో కర్తృత్వాదులు ఉండే ప్రసక్తే లేదు. దేహంలో ఉన్నంత మాత్రాన దేహేంద్రియ సంఘాతము యొక్క ప్రభావము ఆత్మపై పడదు.

ఆత్మ దేహంలో ఉంది అంటే, దేహానికి పరిమితమై ఉంది అని అర్థం కాదు. ఆత్మ దేహానికి పరిమితమై ఉంటే, అవినాభావ సంబంధంతో లేదా సమవాయ సంబంధముతో దేహ ధర్మాలు ఆత్మ యందు ఉంటాయి అని పలికే ప్రమాదం ఉండవచ్చు నేమో గాని, దేహంలో ఉన్న దేహి దేహానికి పరిమితం కాడు. దేహంలో ఉన్నప్పటికి సమస్తములో వ్యాపించి ఉన్నాడు **(పిండస్థః అపి ఆత్మా సర్వవ్యాపీ భవతి).** కనుక, ఆత్మకు కర్తృత్వము లేదు. కారకత్వమూ లేదు.

*దేహిగా దేహంలో సుఖంగా ఉన్న పుర ప్రభువు తాను ఏమీ చేయక, ఏదీ ఇతరుల చేత చేయించక పోతే, మరి దేహం లోని సర్వ వ్యాపారాలను చేయించేది ఎవరు? చెబుతున్నాడు.*

**న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।**
**న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥** 14

***న-కర్తృత్వం-న-కర్మాణి-లోకస్య-సృజతి-ప్రభుః***
***న-కర్మఫల సంయోగం-స్వభావః-తు-ప్రవర్తతే***

| | | | |
|---|---|---|---|
| ప్రభుః | = ప్రభువు | కర్మఫల సంయోగం | = కర్మఫల సంబంధమును |
| లోకస్య | = లోకమున | న సృజతి | = సృష్టించడు |
| కర్తృత్వం | = కర్తృత్వమును | స్వభావః తు | = స్వభావమే |
| కర్మాణి | = కర్మలను | ప్రవర్తతే | = ప్రవర్తిస్తూ ఉంది |

**భగవంతుడు లోకానికి కర్తృత్వమును కలిగించడు. కర్మలను తగిలించడు. కర్మఫల సంబంధమును కూడా కల్పించడు. సహజమైన ప్రకృతియే అలా చేయిస్తూ ఉంది.**

### వ్యాఖ్య

దేహము జడము. దేహి చైతన్యము. చైతన్య రూపుడైన దేహి ఉండటం చేతనే దేహంలో చలనాదులు జరుగు తున్నాయి. ఇంద్రియాలు కదులు తున్నాయి. బుద్ధిలో ఆలోచనలు పుట్టు కొస్తున్నాయి. ఇవన్నీ సంయోగమై బాహ్యాభ్యంతరాలలో కర్మలను ఆవిష్కరి స్తున్నాయి. ఇంతకీ ఈ కర్మలను చేసే దెవరు? చేయించేది ఎవరు?

దేహి ఆత్మయే కనుక అకర్త అయిన ఆత్మ చేసేది కాదు, చేయించేది కాదు అని పదమూడవ శ్లోకం లోనే తెలుసుకున్నాం. దేహాదులు జడాలు కనుక స్వయంగా కర్మలను చెయ్యలేవు. పోనీ, ఆత్మ చైతన్య స్వరూపం కనుక, ఆత్మ ఆదేశంతో దేహాదులు కర్మలలో చరిస్తున్నాయి అనుకుందా మంటే, ఆత్మకు కర్తృత్వం లేదు ***(న కర్తృత్వం, స్వతః కురు ఇతి).*** 'నువ్వు స్వయంగా ఇది చెయ్యి' అని దేహాదులను ప్రేరేపించి కర్మలు చేయించడం కర్తృత్వము. అలాంటి కర్తృత్వం ఆత్మకు లేదు.

ఆదేశ పూర్వకంగా కర్తృత్వాన్ని ఆత్మ ఎలా సృజించడం లేదో అలాగే కర్మలను కూడా సృష్టించడం లేదు ***(న కర్మాణి సృజతి).*** ఇక్కడ కర్మలను సృజించడము లేదు అంటే, దీనిని రెండు విధాలుగా గ్రహించ వచ్చు. ఒకటి, కర్మలను చేయడం లేదు అని అర్థము ***(కర్మాణి న కరోతి).***

రెండవది. కర్మలు ఎందుకు చేస్తారు? ప్రియమైన వాటిని సాధించడానికి కర్మలు చేస్తారు. కాబట్టి క్రియల ద్వారా పొందడానికి ప్రియమైనవి ఏవో అవి కర్మలు అనబడతాయి. పాణినీ సూత్రము కర్మలను ఇలాగే నిర్వచించింది.

***కర్తుః ఈప్సిత తమం కర్మ*** - 'క్రియ చేత పొందడానికి మిక్కిలి ఇష్టము లైనవి కర్మలు' అని పాణినీ మహర్షి సూత్రీకరించాడు. ఇలా చూచి నపుడు ఇష్ట వస్తువులను కూడా ఆత్మ సృష్టించదు అనే అర్థం వస్తుంది. ***(రథ ఘట ప్రాసాదాది ఈప్సిత తమాని లోకస్య న సృజతి).*** అత్యంత ఇష్టము లైన శకటాలను, పాత్రలను, భవనాలను సృష్టించదు; అంటే ఉత్పాదనం చేయదు అని అర్థము.

కర్మను చేయవలసిందిగా అన్యులను ఆదేశించి తనలో కర్తృత్వాన్ని ఆత్మ సృష్టించుకోదు. అలాగే తాను స్వయంగా కర్మలను చేయదు. కర్మల ద్వారా పొందటానికి ఇష్టమైన వస్తువులను కూడా ఆత్మ సృష్టించదు. అయినా, కర్మలు సాగి పోతూనే ఉన్నాయి. కర్మలు సాగిపోతున్నాయి కనుక, వాటికి సంబంధించిన ఫలాలు ప్రాప్తిస్తున్నాయి. పోనీ, కర్మ చేసినవాడు తత్సంబంధమైన ఫలాన్ని అందుకుంటాడు కదా! మరి, ఆ ఫలాన్ని అందించే దెవరు? కర్తను కర్మఫలంతో జత చేసేది ఆత్మ అనుకుందామా? అదీ పొసగేలా లేదు. కర్మఫల సంయోగాన్ని కూడా ఆత్మ సృజించదు ***(కర్మఫల సంయోగం న సృజతి).*** మరి దేహి అయిన ఆత్మకు కర్తృత్వము, కారయితృత్వము, భోజయితృత్వము - ఇవి ఏవీ లేనపుడు మరి కర్మలను చేస్తూ, చేయిస్తూ, ప్రవర్తించేది ఎవరు? అనే ప్రశ్న ఉదయిస్తుంది. శ్లోకం యొక్క నాల్గవ పాదంలో ఆ ప్రశ్నకు కూడా సమాధానం చెప్పడం జరిగింది. స్వభావమే ప్రవర్తిస్తూ ఉంది అనే సమాధానం ఉంది. ఆ విషయాన్ని కూడా విశ్లేషించే ముందు, కర్మలలో ఆత్మ యొక్క, అనగా దేహి యొక్క విలక్షణత్వం ఏమిటో క్షుణ్ణంగా తెలుసుకుందాం. ఇది చాలా ప్రధానమైన, ప్రముఖమైన తాత్త్విక విషయం.





### విధిని విధించడు

రాజ్యంలో ప్రభువు ఉన్నట్లు, దేహంలో దేహి పురప్రభువుగా ఉన్నాడు. పురంలో విధి విధానాలను రాజు ఆదేశిస్తాడు. ఆజ్ఞాపిస్తాడు. కాని, పుర ప్రభువు పురంలో ఆ విధంగా ఆదేశాలను అందించడు. ఆ విధమైన కర్తృత్వం దేహి యైన ఆత్మకు లేదు ***(న కర్తృత్వం).***

దేహి దేహంలో ప్రకాశిస్తూ ఉంటాడే కాని, దేహానికి కాని, దేహంలో ఉండే ఇంద్రియ సంఘాతానికి కాని 'నువ్వు ఇది చెయ్యి' ***(స్వతః కురు ఇతి)*** అని ఆజ్ఞాపించడు. ఆ విధమైన కర్తృత్వం తనకు లేదు.

కాస్త ఆలోచించు అని మనస్సుకు చెప్పడు. ఉత్తరం వ్రాయి అని చేతిని ఆదేశించడు. తిను - లేదా తిట్టు అని నోటికి చెప్పడు. నడు - లేదా కూలబడు అని కాళ్ళను ఆజ్ఞాపించడు. కోప్పడు అని అహంకారాన్ని పురికొల్పడు. క్రిందపడు అని దేహాన్ని ప్రోత్సహించడు. అలసిపొండి అని ఇంద్రియాలతో అనడు. ఆందోళన పడు అని బుద్ధిని. శాసించడు.

రాజ్యంలో సాగే కార్యకలాపాలతో రాజుకు ప్రత్యక్ష ప్రమేయం ఉన్నట్లు కనిపించక పోయినా, పరోక్షంగా ఆయన ఆదేశాలే రాజ్యంలో అమలు జరుగుతూ ఉంటాయి. అందుచేతనే రాజ్యం సురక్షితంగా లేనపుడు, లేదా సంక్షోభంలో కూరుకు పోయినపుడు అందరూ రాజునే తప్పు పడతారు.

కాని, ఇక్కడ పురప్రభువు పరిస్థితి వేరే. పురంలో తాను ప్రభువుగా శోభిస్తున్నా, పురంలో జరిగే కార్యాలతో తనకు ఏ విధమైన సంబంధం లేదు. కర్తృత్వము, కర్మలు, కారయితృత్వము, ఇవి ఏవీ తనకు లేకపోవడం చేత ఎవరూ తనను వేలెత్తి చూపించ లేరు. కర్మలతో దేహికి ప్రత్యక్ష ప్రమేయమూ లేదు. పరోక్ష ప్రమేయమూ లేదు.

ఆత్మకు కర్తృత్వము ఉండేట ట్లయితే, ఆత్మ ఎప్పుడూ ఉండేదే కాని, ఒకప్పుడు ఉండి ఒకప్పుడు లేకుండా పోయేది కాదు కాబట్టి, దేహం ద్వారా నిరంతరము కర్మలు సాగుతూనే ఉండాలి. క్షణం కూడా ఆగకూడదు. విరామం మాట రాము డెరుగు; అలాంటి నిర్విరామ కర్మ ప్రవాహాన్ని ఏ వ్యక్తి లోను మనం చూడలేదు.

అలాగే ఆత్మకు కారయితృత్వం ఉండేట ట్లయితే, అంటే ఆత్మ కర్మలను చేయిస్తుంది అని అభిప్రాయ పడితే, అప్పుడు అస్మదాదులకు కర్మ స్వేచ్ఛ లేనట్లే కదా! పురుషుడు స్వాతంత్ర్యము లేనివాడు అవుతాడు కదా! సత్కార్యమైనా, దుష్కార్యమైనా దానికి ప్రేరకుడు దేహియే కదా! మరి ఈ కర్మల ప్రయోజన కర్తృత్వం పురుషునిదా? పుర ప్రభువుదా? అదలా ఉంచితే, కొందరిని సత్కర్మలకు, మరి కొందరిని దుష్కర్మలకు పురికొల్పితే, పుర ప్రభువైన దేహికి లేదా ఆత్మకు లేదా పరమేశ్వరునికి భేద భావాలున్నట్లే కదా! వైషమ్యా లున్నట్లే కదా! రాగద్వేషాలు ఉన్నట్లే కదా! మరి, అకర్త యైన ఆత్మలో ఇవన్నీ ఉన్నాయా? అందుకే అంటున్నాడు ఆత్మకు కర్తృత్వమూ లేదు. కర్మలూ లేవు అని.

### పని లేని పెద్ద తల

ఆత్మకు కర్తృత్వము, కారయితృత్వము లేవు అనేదే వాస్తవ మైతే, ప్రమాణ హాని సంభవించే ప్రమాదము, అనుభవ వైరుధ్యము కలిగే పరిస్థితి ఆసన్న మవుతాయి కదా!

**సర్వాధిపత్యం కురుతే మహాత్మా** - పరమాత్మ సర్వాధిపత్యమును నిర్వహిస్తున్నాడు. ఆయన పరమేశ్వరుడు. **ఏష ఏవ సాధుకర్మ కారయతి** - అతడే పుణ్యకర్మను చేయిస్తున్నాడు. ***ఏషత ఆత్మాంతర్యామి అమృతః*** - అతడే

అంతర్యామి, అమృత స్వరూపుడు అయిన ఆత్మ అని వేద ప్రమాణము. మరి, కర్తృత్వ కారకత్వాలు పరమాత్మకు లేవు అంటే శాస్త్రము అప్రమాణ మైనట్లే కదా!

ఇక అనుభవంలో చూస్తే ప్రతివాడు, 'నాకు పరమేశ్వరుని వల్ల ఈ మేలు జరిగింది. నేను ఈ రోజు ఇలా ఉండటానికి భగవంతుని అనుగ్రహమే కారణము. అంతా ఆయన కృప. నేను పనిముట్టును మాత్రమే. అంతా ఈశ్వరుడే చేస్తున్నాడు. ఆయన ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు. చేనైనా పెట్టదు'. ఇలాంటి మాటలు అంటూ ఉండటం వింటూ ఉంటాము.

అలాగే మరికొందరు, 'ఎందుకనో భగవంతుడు కూడా నా మీద కక్ష కట్టాడు. ఆయనకు కూడా నేను గిట్టకుండా పోయాను. పట్టకుండా పోయాను. అడు గడుగునా పరీక్షిస్తున్నాడు. కష్టాల మీద కష్టాలు పెడుతున్నాడు. మొట్టేవాణ్ణే కాని మొక్కేవాణ్ణి దేవుడు కూడా పట్టించుకోడు కాబోలు అనే నిష్ఠూరపు మాటలు పలకడం విడ్డూరంగా వింటూ ఉంటాము.

భగవంతునికి కర్తృత్వ కారకత్వాలు లేవు అనగానే అటు శాస్త్రము ప్రామాణికంగా అందిస్తున్న పవిత్ర వాక్యాలు, ఇటు జనావళిలో పలుకుబడి కలిగిన అనుభవ వచనాలు రెండూ ప్రమాదంలో పడిపోతాయి అనే సందేహము తప్పక కలుగుతుంది. కాని, అది వాస్తవం కాదు. ఎలాగో అది కూడా చెప్పుకుందాం.

సూర్యోదయం కాగానే అంధకారము అదృశ్య మవుతుంది. ప్రత్యక్ష దైవమైన సూర్యునికి అభిముఖంగా నిలబడి ఆదిత్య హృదయాన్ని పఠిస్తాము. ***తిమిరోన్మథనః... తమోఘ్నాయ... జ్యోతిషాం పతయే నమః.*** చీకటిని పోగొట్టే వానికి, తిమిరాన్ని హరించే వానికి, వెలుగుల రేడు అయిన సూర్యదేవునికి నమస్కారము అంటున్నాము కదా!

చీకటిని నిర్మూలించడము అనే కర్తవ్యము సూర్యునికి ఉందా? అదే నిజమైతే, సూర్యుడు చీకటిని సృష్టించ గలడా? ఆదిత్యుని సాన్నిధ్యములో అంధకారము అదృశ్య మవుతూ ఉంటే, సూర్యుడు తమస్సును పోగొడుతున్నాడు అంటున్నాము. చీకటిని పోగొట్టడము అనే కర్తృత్వము సూర్యునికి లేదు. ఆ విషయంలో ప్రభాకరుడు కర్త కాడు. కర్మ ఆయనకు లేదు. తాను ప్రకాశకుడే గాని ప్రవర్తకుడు కాడు. తేజస్సు ముందు తిమిరము మిగలదు. అంతే. కనుక, సర్వ ప్రకాశకత్వము సూర్యునికి ఉన్నట్లు, సర్వాధిపత్యం ఈశ్వరునిది అనే శ్రుతి ప్రమాణానికి వైరుధ్య మెక్కడుంది?

ఇకపోతే, అనుభవ వైరుధ్య మేమిటి అంటారా? అది కూడా వినండి. అయస్కాంతము యొక్క సాన్నిధ్యములో ఇనుపముక్క కదులుతూ ఉంటే, ఆ ఇనుము (అయస్సు) చలించడానికి చుంబకము కారణ మని మనం భావిస్తాము. అనుభవంలో చూచేవే ఇవన్నీ. అయస్కాంత సన్నిధిలో జరిగే అయశ్చాలకత్వమును అయస్కాంతానికి ఆరోపించి, అయస్కాంతము ఇనుప ముక్కను కదిలించింది అనే కర్తృత్వాన్ని, కర్మను చుంబకానికి అంట గడతాము. ఇది అనుభవ జనితమే అయినా సత్యదూరము.

అలాగే, ఆత్మ సాన్నిధ్యములో దేహేంద్రియ మనోబుద్ధుల ద్వారా సర్వ కర్మలు జరిగి పోతూ ఉంటాయి. వాటికి ఆత్మ కర్త కాదు. ఆత్మలో కర్మ లేదు. ఆత్మ నిష్కలము - అవయవాలు లేనిది. ఆత్మ నిష్క్రియము - అది చేసేది కాదు, రుచి చూచేది కాదు, తినేది కాదు, తినబడేది కాదు. కనుక ఆత్మకు కారయితృత్వమూ లేదు. భోజయితృత్వమూ లేదు. ఇదే శాస్త్ర ప్రమాణము. ప్రమాణ జనిత జ్ఞానము.

***నిష్కలం నిష్క్రియం శాన్తం, న త దశ్నాతి కించన, న తత్ అశ్నాతి కశ్చన*** - ఆత్మ నిష్కలము, నిష్క్రియము,





శాంత స్వరూపము. అది దేనిని భుజించదు. దానిని ఎవ్వడూ భుజించ లేడు అన్నది వేదం. దేహంలో ఉన్నంత మాత్రాన దేహి కర్మ చేయడు. కర్మ చేత అంటబడడు అని భగవంతుడే మున్ముందు పదమూడవ అధ్యాయంలో చెప్పబోతాడు ***(శరీరస్థోఽ పి కౌన్తేయ న కరోతి న లిప్యతే).***

## అప్రస్తుత ప్రసంగం

ఈ సందర్భములో మరో విధమైన విచిత్ర వాదము ఒకటుంది. అవసర మెంతో తెలియదు గాని వినడానికి ఆసక్తికరంగా ఉంటుంది. సమవాయ సంబంధాన్ని సృష్టించి, 'ఆత్మకు కర్తృత్వము లేకపోవచ్చు గాని, ఆత్మలో కర్మ లేకుండా పోలేదు' అనే విడ్డూరమైన వాదము. సమవాయ సంబంధము అంటే అవినాభావ సంబంధము.

బాహ్యంలో ఉండే వస్తువుల్ని దీపము ప్రకాశింప చేస్తూ ఉంది. అలాగే బాహ్యం లోని వాయు చలనము దీపాన్ని కదిలిస్తూ ఉంది. ఇది సమవాయ సంబంధము. ఈ సంబంధమును అన్వయించి అర్థం చేసుకుంటే, ఆత్మ దేహేంద్రియాదులను ప్రభావితం చేస్తూ ఉంది కనుక, ఆత్మకు కర్తృత్వం ఉంది. అలాగే దేహేంద్రియ మనోబుద్ధుల ప్రభావం ఆత్మపై ఉంటుంది. ఈ విధమైన పరస్పర సంబంధ ప్రభావము చేత ఆత్మకు కర్తృత్వం ఉన్నట్లే అనేది ఈ వితండ వాదము లోని ప్రథమాంశము. ఈ వాదము ముందే మన చేత ఖండింప బడింది. ఆత్మ భుజించదు. భుజింప బడదు అనే సిద్ధాంతము అక్కడే వచ్చింది.

ఇక, ఈ వాదము లోని రెండవ అంశము ఆసక్తికరము. ఆత్మ అనాత్మలకు సమవాయ సంబంధాన్ని అనుసరించి అన్యోన్యాశ్రయత్వం లేక పోవచ్చు. కాని, స్వాశ్రయ క్రియ ఉంటుంది కదా! అలా చూచి నపుడు ఆత్మకు కర్తృత్వం లేకపోవచ్చు నేమో గాని, ఆత్మలో కర్మ లేకుండా పోలేదు కదా!

చలిస్తున్న దీపాన్ని తీసికొని ఇంటి లోపల గాలి లేని చోట ఉంచితే, దీపంలో చలనము ఉండదు. వాయు చలనము దీపాన్ని చలింప చేయలేదు. అందుచేత దీపము నిశ్చలంగా ఉంటుంది. అంతమాత్రాన దీపంలో క్రియ లేదు అని చెప్పగలమా? వాయుచలన ప్రభావము లేకపోవచ్చు. కానీ తాను చేస్తున్న తైలదాన క్రియ జరుగుతూనే ఉంది కదా అనేది ఈ వాదము లోని ఆసక్తికర మైన విషయము.

తైలదాన క్రియ అంటే నూనెను పీల్చడము అనే కార్యము. నూనెను పీల్చక పోతే దీపం ప్రకాశించదు. దీపం ప్రకాశిస్తూ ఉంది అంటే నూనెను పీల్చడం అనే కర్మ జరుగుతూనే ఉంది అని అర్థం. అలాగే, ఆత్మకు అన్యోన్యాశ్రయత్వం లేని కారణంగా కర్తృత్వం లేకపోవచ్చు. కాని, తైలదాన క్రియ లాగా స్వాశ్రయ కర్మ ఉండొచ్చు కదా! అలాంటప్పుడు ఆత్మలో కర్మ లేదు **(న కర్మాణి)** అని ఎలా చెబుతారు? అనేది ఈ అప్రస్తుత ప్రసంగం లోని పస లేని నస.

ఆత్మ నిరవయవ మైనది అగుట చేత క్రియకు ఆశ్రయముగా ఉండుట సంభవించదు. ఆత్మ అఖండమై నందున స్వాశ్రయక్రియకు అవకాశము లేదు. వెలిగే దీపము జడము. దీపంలో వత్తి వేరు, చమురు వేరు. చమురుపై ఆధారపడి వత్తి వెలుగుతూ ఉంది. కాని, ఆత్మ చైతన్య స్వరూపము. అఖండం. అద్వితీయము. స్వప్రకాశము. స్వతః సిద్ధము. అందుచేత ఆత్మలో స్వాశ్రయక్రియ ఉండ లేదు.

ప్రభువు వలె ఆత్మ కారయిత కాదు. భృత్యుని వలె ఆత్మ కర్త కాదు. కనుక ఆత్మకు కర్తృత్వం లేదు. కర్మలు లేవు. పోనీ, కర్మఫల సంయోగం ఉందా అంటే, అదీ లేదు అంటున్నాడు.

## వంట రాదు - వడ్డన తెలియదు

ఎవరు ఏ కర్మ చేసినా ఫలాన్ని ఆశించే చేస్తారు. కర్మ చేసి నపుడు ఫలం అందుతుంది కదా! మరి కర్మ

చేసిన కర్తను కర్మ యొక్క ఫలముతో కలిపే దెవరు? దేని ప్రభావం చేత కర్తకు ఫలం అందుతూ ఉంది? అనేది శంక.

రైతు పంట పండించడం అనే కార్యాన్ని ఆచరిస్తాడు. రైతు చేసే వ్యవసాయము అనే కార్యానికి ఫలసాయము అందుతుంది. వ్యవసాయము చేసిన రైతుకు ఫలసాయముతో సంబంధమును కలిగించే కార్యము కూడా ప్రభువు అయిన ఆత్మకు లేదు *(న సృజతి కర్మ ఫల సంయోగం).*

కర్మలు చేసిన వారిని వారు చేసిన కర్మల యొక్క ఫలములతో పరమేశ్వరుడు జత చేయడు అని అర్థము. ఫలములతో కూర్చడు అంటే, వారి వారి పుణ్యపాపాలకు సంబంధించిన ఫలములను సమకూర్చి తజ్జనిత సుఖదుఃఖాలను అనుభవించే టట్లు చేయడు అని అర్థము. దీనినే భోజయితృత్వము అంటారు. అది కూడా ఆత్మకు లేదు. ఈ విషయాన్ని సుస్పష్టం చేయడానికి నీలకంఠ భాష్యంలో ఒక అందమైన ఉదాహరణము ఇవ్వడం జరిగింది.

సూర్యోదయంతో కొలనులో కమలాలు వికసిస్తాయి. అదే సమయంలో కలువలు ముకుళిస్తాయి. ఈ రెండూ సూర్యోదయం వల్లే జరుగుతాయి. ఈ విధమైన ఫల సంయోగం సూర్యునిదా! అని ప్రశ్నించారు నీలకంఠాచార్యులు. నిజమే కదూ! సూర్యోదయము అనే ఒకే కార్యానికి వికచము, ముకుళితము అనే పరస్పర విరుద్ధమైన ఫలాలు ఎలా అందుతాయి? సూర్యుడు వికసింప చేసే గుణం కలవాడైతే, కలువలు ఎందుకు ముకుళించాయి? భానుడు ముకుళింప చేసే వాడైతే పద్మాలు ఎందుకు వికసించాయి? వికసింప చేసేవాడు అయితే, ముకుళింప చేసేవాడు కాడు. ముకుళింప చేసేవాడు అయితే వికసింప చేసేవాడు కాడు. పోనీ, రెండూ చేశాడు అని చెబుదామంటే, ఒకే కాలంలో ఒకే వ్యక్తి తూర్పు పశ్చిమాలలో ప్రయాణం చేయడం సాధ్యం కానట్లు, సూర్యుడికి కూడా రెండు పరస్పర విరుద్ధమైన కార్యాలు చేయడం సాధ్య పడదు. సూర్య భగవానునిలో ప్రకాశక లక్షణం ఉందే గాని ప్రవర్తక లక్షణం లేదు. అలాగే పరమేశ్వరునికి జీవుల కర్మఫల సంయోగ కార్యము లేదు.

దేహి యైన ఆత్మకు చేయించడము అనే కారయితృత్వము లేదు *(న కర్తృత్వం).* కలిగించుట అనే ప్రాపయితృత్వము లేదు *(న కర్మాణి).* అనుభవింప చేయుట అనే భోజయితృత్వము కూడా లేదు *(న కర్మఫల సంయోగం).* ఇక్కడికి శ్లోకంలో మూడు పాదాలు ముగిశాయి. అయితే, ఇవన్నీ చేసే దెవరు? ప్రవర్తింప చేసే దెవరు? ఫలమును ఎవరు కలిగిస్తున్నారు? ఎందుకని ఆశించిన ఫలాలు అందడం లేదు? ఎందుకని అనిష్ట ఫలాలు అందుతున్నాయి? పరమేశ్వరుడు కారణం కాదని తేలి పోయింది. పోనీ, మనకు మనమే కర్మఫలాలను నిర్ణయించుకొని పొందుతున్నామా? ఈ విషయంలో వాస్తవ మెంత? అనేది ఈ సందర్భంలో చర్చనీయాంశము కాదు గాని, కర్మఫల సంయోగమే గనుక మన అధీనంలో ఉంటే, ఇష్టఫలాలు రాకపోవడము, అనిష్ట ఫలాలు ప్రాప్తించడము అనేది ఎందుకు జరుగుతుంది? వీటన్నిటికి సమాధానాన్ని శ్లోకం యొక్క నాల్గవ పాదంలో అందిస్తున్నాడు. అంతా స్వభావమే చేస్తూ ఉంది అంటున్నాడు.

## స్వయంకృతాపరాధం

***స్వః భావః స్వభావః*** - స్వభావము అంటే తన భావము అని అర్థము. తనకు తానే కల్పించుకొనుట స్వభావము ***(స్వయం భావయతి).*** దీనినే ప్రకృతి అంటారు. ప్రకృతి అనేది ఏదో కాదు, అవిద్యా లక్షణమైన మాయ అన్నారు భాష్యంలో శ్రీ శంకరులు. అదే ప్రవర్తిస్తూ ఉంది అన్నారు ***(స్వభావః అవిద్యా లక్షణా ప్రకృతిః మాయా ప్రవర్తతే).*** అవిద్యా లక్షణమైన ప్రకృతియే ఇక్కడ స్వభావము అని చెప్పబడింది. అదే మాయ. కర్తృత్వానికి కారయితృత్వానికి మాయే కారణము.





మాయా ప్రభావం చేత జన్మాంతర సంస్కారాలను తయారు చేసుకొనిన జీవులు, వారి వారి సంస్కారాలకు సంబంధించిన కార్యాలను ఆచరిస్తూ, 'నేను చేస్తున్నాను' **(అహం కరోమి)** అనే కర్తృత్వముతో కర్మలను ఆచరించి, తత్ఫలితాలను పొంది అనుభవిస్తూ ఉంటారు. ఎవ రెవరిలో ఏయే గుణాలు, సంస్కారాలు చోటు చేసుకొని ఉన్నాయో, వాటికి అనుగుణంగా ప్రవర్తిస్తూ ఉంటారు. గుణాలు మాయాకార్యాలు. కనుక కర్మ లన్నీ మాయా ప్రేరితాలే. ఈ విషయాన్ని ఏడవ అధ్యాయం - విజ్ఞాన యోగంలో విస్పష్టం చేస్తాడు భగవంతుడు. అక్కడ చాలా విపులంగా చర్చించుకోబోతాము.

'అర్జునా! త్రిగుణ మిళితమైన మాయ దైవ సంబంధ మైంది. దానిని దాటడం అందరికీ శక్యం కాదు. ఎవరు నన్నే ఆశ్రయిస్తారో వారు మాయను దాటుతారు' అని ఏడవ అధ్యాయంలో చెబుతాడు.

కనుక కర్మలు, కర్తృత్వాలు, ఫలసంయోగాలు అన్నీ మాయా కార్యాలే. ఆత్మ సంబంధ మైనవి కావు. కాని లేని వాటిని ఆరోపించుకోవడం చేత ఆత్మ యందు కర్తృత్వ కారయిత్వ భోజయిత్వాదులు లేకనే ఉన్నట్లు గోచరిస్తున్నాయి. అజ్ఞానం లోనే అగుపిస్తున్నాయి. కనుక జీవులు అనుభవించే పుణ్యపాపాలకు స్వభావమే కారణం గాని పరమేశ్వరుడు కాడు.

*దేహంలో వసించే దేహియైన ఆత్మ పరమేశ్వరుడు. ఆయన ఎవరికీ పుణ్యాన్ని గాని, పాపాన్ని గాని కల్గించడు. అజ్ఞాన మనే మాయ జ్ఞానాన్ని కప్పి వేయడం చేత, జీవులు మోహానికి లోనై పరమేశ్వరుని యందు లేని వాటిని ఉన్నట్లు చూస్తున్నారు. అదెలాగో చెబుతున్నాడు.*

**నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥** 15

***న-ఆదత్తే-కస్యచిత్-పాపం-న-చ-ఏవ-సుకృతం-విభుః***
***అజ్ఞానేన-ఆవృతం-జ్ఞానం-తేన-ముహ్యంతి-జంతవః***

| | | | |
|---|---|---|---|
| విభుః | = ప్రభువు | జ్ఞానం | = జ్ఞానము |
| కస్యచిత్ | = ఎవరి యొక్క | ఆవృతం | = కప్పబడింది |
| పాపం | = పాపమును | తేన | = దాని చేత |
| సుకృతం చ ఏవ | = పుణ్యమును కూడ | జంతవః | = ప్రాణులు |
| న ఆదత్తే | = గ్రహించడు | ముహ్యంతి | = మోహము చెందు తున్నవి |
| అజ్ఞానేన | = అజ్ఞానము చేత | | |

**భగవంతుడు ఎవరి పాపపుణ్యాలు గ్రహించడు. జ్ఞానము అజ్ఞానము చేత కప్పబడి ఉంది. అందుచేత జనులు మోహాన్ని పొందు తున్నారు.**

**వ్యాఖ్య**

కొన్నిటితో ముడిపడి ఉండటం, కొన్నిటితో విడిపడి ఉండాలి అనుకోవడం మానవ నైజంగా మనం చూస్తూ ఉన్నాం. విడిపడి ఉండలేక కొన్నిటితో ముడిపడి ఉండటం, ముడిపడి ఉండలేక కొన్నిటి నుండి విడిపడి ఉండాలి అనుకోవడం తరచుగా చూస్తూ ఉంటాం. ముడిపడి ఉండటము - విడిపడి ఉండటము అనే రెండిటిలో 'ఉండటము' అనేది సామాన్యంగా ఉంది. ఆ ఉండటము ఏదో అర్థమైతే, ముడిపడే అగత్యం ఉండదు. విడిపడే

అవసరమూ ఉండదు. అర్థం కానపుడు ముడి పడింది చిక్కుముడిగా మారుతూ ఉంటుంది. విడిపడింది దారుణంగా వాడిపోతూ ఉంటుంది.

వీటిని అర్థం చేసుకోవడం చాలా కష్టము. ఇవన్నీ ఒక విధంగా చెప్పాలంటే ఆరోపాలే గాని స్వరూపాలు కావు. ఆరోపాలు లేనివే కనుక ప్రయత్నించినా అర్థం కావు. స్వరూపం అర్థం చేసుకో దగిందే అయినా, ఆరోపాల కారణంగా తెలిసి రాదు.

ఎంత ప్రయత్నించినా, పోరాడినా అర్థం గాని ఈ వింతలు వివేకం వికసించడం ప్రారంభించ గానే, జ్ఞానం ఉదయించడం మొదలు కాగానే, మన ప్రయత్నము యొక్క అవసరం లేకనే, నిద్ర నుండి మేల్కొన గానే స్వప్నగత పోరాటాలు, ఆరాటాలు అంతరించి నిజ ప్రపంచం గోచరించి నట్లు, సత్యదర్శనం జరిగి, ఆ దివ్య వెలుగులో పడి ఆరోపాలు అదృశ్య మౌతాయి. స్వరూపాలు ఆవిష్కృత మవుతాయి.

కర్మలు, కర్తృత్వాలు, భోక్తృత్వాలు, కారయితృత్వాలు, భోజయితృత్వాలు అన్నీ మాయా కార్యాలే నని, స్వభావం చేత ప్రవర్తిస్తూ ఉన్నాయని గ్రహించాము. ఈ కర్మ సమూహంతో పరమేశ్వరునికి ఏ విధమైన సంబంధము లేదని కూడా గ్రహించాము. దేవుడు చేయించేవాడు కాడు. జీవుడు చేసేవాడూ కాడు. కారయితగా దేవుడు ఉండడు. కర్తగా జీవుడు లేడు. ఇది అర్థం కావడం జ్ఞానం. అర్థం కాకపోవడం అజ్ఞానం.

అజ్ఞాన ప్రభావం చేత ప్రకృతి కార్యాలను వ్యష్టిలో తన మీద, సమిష్టిలో పరమేశ్వరుని మీద ఆరోపించడం జరుగుతూ ఉంది. స్వరూపాలు తెలియని దుర్దశలో ఉన్న వన్నీ ఆరోపాలే.

నేను చేసేవాణ్ణి, నేను అనుభవించేవాణ్ణి, నేను దానిని పొందాలి, నేను దీనిని పోగొట్టుకోవాలి, నేను అది చేయగలను, ఇది చేయగలను, ఏదైనా చేయగలను - ఇలా మాట్లాడుతూ, ఆరోపం బాటలో పటాటోపం ప్రదర్శిస్తున్నాడే గాని, తాను అకర్త అని, అభోక్త అని, ఆత్మ యనే స్వరూప జ్ఞానాన్ని పొందలేక పోతున్నాడు.

అలాగే భగవంతుడు చేసే వాడని, చేయించే వాడని, గ్రహిస్తాడని, పని గట్టుకొని కొందరిని అనుగ్రహిస్తాడని భావిస్తున్నాడే గాని, పరమేశ్వరుడు నిష్క్రియుడని, సర్వాతీతుడని, సాక్షీమాత్రుడని గ్రహించలేక పోతున్నాడు.

గ్రహించడం జ్ఞానము. గ్రహించలేక పోవడం అజ్ఞానము. జ్ఞానం లేదు అంటే అజ్ఞానం ఉంది అని అర్థము. సూర్యుడు కనిపించడం లేదు అంటే, అలా కనిపించక పోవడానికి ఏదో అవరోధం ఉందని అర్థము. ఆ అవరోధమే మేఘము. మేఘము అనిత్యము. సూర్యుడు నిత్యము. మేఘము అప్రకాశము. సూర్యుడు స్వప్రకాశము. మేఘము సూర్యుణ్ణి కప్పడం జరిగితే సూర్యుడు కనిపించడు. మేఘము వాస్తవానికి సూర్యుణ్ణి కప్పలేదు. కాని, కప్పినట్లు ఉండటం ఆరోపము. మేఘము తొలగితే సూర్యుడు అగుపిస్తాడు. ఆరోపం తొలగితే స్వరూపం తెలుస్తుంది.

ఇటు ఆత్మ యైన తాను, అటు పరమాత్మ ఇరువురూ అకర్తలే. ఇరువురికీ కర్మలు లేవు. కర్తృత్వాలు లేవు. లేనివి ఉన్నట్లు ఆరోపించ బడ్డాయి. అందుచేత చేసేవాడుగా జీవుడు, చేయించే వాడుగా దేవుడు భావించబడుతూ ఉన్నారు. అందించే కర్మ జీవునికి, అందుకొనే కార్యము ఈశ్వరునికి ఆపాదించ బడుతున్నాయి. ఇవేవీ వాస్తవాలు కావు. అన్నీ ఆరోపాలే.

**ఆరోపం తెలిసి రాదు**

పరమేశ్వరునికి పక్షపాతం లేదు. విషమత్వం తెలియదు. కర్మలతో, కర్మఫలాలతో ఏ విధమైన





సంబంధము లేదు. పాపపుణ్యాలను భగవంతుడు కలిగించడు. సుఖదుఃఖాలను ఏర్పరచడు. ఎవరి పాపాన్ని గ్రహించడు (**కస్యచిత్ పాపం న ఆదత్తే**). అలాగే ఎవరి పుణ్యాన్ని కూడా స్వీకరించడు (**సుకృతం చ ఏవ న ఆదత్తే**).

పాపకార్యాలు చేసే వారు దుష్టులు. పుణ్య కార్యాలు చేసేవారు శిష్టులు లేదా భక్తులు. దుష్టుల పాపాలను స్వీకరించడు అంటే అర్థం చేసుకోవచ్చు. శిష్టులైన భక్తుల పుణ్య ఫలాలను కూడా అందుకోడు అనే దానిని ఎలా అర్థం చేసుకోవాలి? అందుకోడు అని అచ్యుతుడు ప్రసంగిస్తున్నాడు. అది అంతే నంటూ ఆచార్యులు వ్యాఖ్యానిస్తున్నారు (**భక్తస్యాపి కస్యచిత్ పాపం న గృహ్ణాతి, న గృహ్ణాతి సుకృతం భక్తైః ప్రయుక్తః**).

వివేకము లోపించి, పరిపక్వత చెందని మనస్సులలో ఇలాంటి సత్యాలు కలవరం రేపుతాయి. కలతలను సృష్టిస్తాయి. తెలియక చేసిన పాపాలు పరమేశ్వరుని ఆశ్రయిస్తే పోతాయి అని కదా భక్తులు విశ్వసిస్తారు.

**హరిః హరతి పాపాని దుష్ట చిత్తై రపి స్మృతః**

దురాత్ములైనా, దుష్టులైనా మనస్సులో స్మరించి నంత మాత్రాన భగవంతుడు వారి పాపాలను హరిస్తాడు అని కదా భక్తుల విశ్వాసము. మరి, పాపాలను పరమేశ్వరుడు స్వీకరించడు అంటే ఈ శాస్త్ర ప్రమాణాలు ఏమి కావాలి? వాటి నంటి పెట్టుకొని ఉన్న మానవ విశ్వాసాలు ఏమై పోవాలి?

**ధర్మావహం పాపనుదం భగేశం వరదం దేవ మీడ్యం**

పుణ్యప్రదుడు, పాపహరుడు, ఐశ్వర్య ప్రదాయకుడు, వరదాత, పూజనీయుడైన పరమేశ్వరుని నేను భజిస్తాను. నా ప్రార్థనలను ప్రభువు ఆలకిస్తాడు. వాటి చేత ప్రీతి చెందుతాడు (**ప్రభుః ప్రీణాతి**). నన్ను అనుగ్రహిస్తాడు అని కదా భక్తులు భావిస్తారు.

నిజమే. ఇవన్నీ ప్రమాణాలే. ప్రామాణికాలే. ఆ విషయంలో ఏ విధమైన సందేహము లేదు. ఇవన్నీ పరమేశ్వరుని మహిమలే. మోక్ష సాధనమైన జ్ఞానానికి అవసరమైన చిత్తశుద్ధిని పొందడానికి సాధకునిలో ఆసక్తిని దించే ప్రయత్నంలో ఉపాసనలు, ఆరాధనలు ప్రతిపాదించ బడ్డాయే గాని, నిర్వికార సత్తా స్వరూపమైన పరమాత్మను సవికారునిగా చూపడానికి కాదు. అకర్తను కర్త స్థాయికి దించడానికీ కాదు.

గడచిన శ్లోకంలో కూడా పరమాత్మకు ఫలసంయోగం లేదు అనగానే చాలా మంది పాఠకులు అర్థం గాక కలత పడి ఉంటారు. భగవంతునికి ఫలసంయోగం లేకపోతే, మనకు ఫలితాలను భగవంతుడు అనుగ్రహించడం లేదా? భగవంతుడు అనుగ్రహించ నపుడు ఫలాలు ప్రసాదా లెలా అవుతాయి? అని ఏదో ఏదో ఊహించుకొని ఆందోళన చెందుతూ ఉంటారు. శాస్త్రావగాహన పూర్ణంగా లేకపోవడమే ఈ అయోమయానికి కారణము.

సృష్టిలో నియతి ఉంది. ధర్మాలు ఉన్నాయి. ధర్మం ఏదో కాదు, ఈశ్వర వైభవమే. సృష్టిలో దైవ రూపంగా భాసించే ధర్మాల వల్ల ఫలితాలు అందుతాయి. కాని, పదిహేనవ శ్లోకంలో మనకు చర్చనీయాంశము ఆత్మస్వరూప వైభవమే గాని, కర్మఫల విశ్లేషణ కాదు. సందర్భాలను దృష్టిలో ఉంచుకో నపుడు సంశయాలు తలెత్తుతాయి. ఇదంతా జ్ఞానం లేకపోవడం వల్లనే. అజ్ఞానం అధిపత్యాన్ని చెలాయించడం వల్లనే. ఈ విధంగా జ్ఞానం అజ్ఞానం చేత ఆవరించ బడింది. అందుకే జీవులు మోహం చెందుతున్నారు.

**అజ్ఞానం తెలియదు**

ఉన్నది ఉన్నట్లు తెలియ నపుడు లేనిది ఉన్నట్లు తెలిసే ప్రమాదం లేక పోలేదు. జ్ఞానం లేనపుడు

ఏముంటుంది? అజ్ఞానమే ఉంటుంది. అదే చెబుతున్నాడు. జ్ఞానం అజ్ఞానం చేత కప్పబడింది అంటున్నాడు **(అజ్ఞానేన ఆవృతం జ్ఞానం వివేక జ్ఞానం).** ఇక్కడ జ్ఞానం అంటే వివేక జ్ఞానం అని అర్థము. ఏది ఆత్మ, ఏది అనాత్మ? ఆత్మ కర్తా, లేక అకర్తా? అనే వివేకము. వివేక జ్ఞానాన్ని అజ్ఞానం మూసి నపుడు ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు గోచరిస్తుంది. అదే మోహము. మోహానికి గురైన జీవులు నేను చేస్తున్నాను - నేను చేయిస్తున్నాను **(అహం కరోమి కారయామి),** నేను అనుభవిస్తున్నాను - అనుభవింప చేస్తాను **(అహం భోక్ష్య, భోజయామి)** అనే మోహానికి గురి అవుతారు. ఈ మనుషులే సంసారులు **(ఇత్యేవం మోహం గచ్ఛన్తి అవివేకినః సంసారిణః జన్తవః).** ఇక్కడ ఒక విచిత్ర మేమిటంటే, అజ్ఞానంలో ఉండే వారికి తాము అజ్ఞానములో ఉన్నట్లు తెలిసి రాదు. అదే నిజమైన అజ్ఞానము. దట్టమైన అజ్ఞానము.

*కనుక, ప్రతి ఒక్కరు అజ్ఞాన నివృత్తికి తీవ్రంగా ప్రయత్నించాలి. మరి, అజ్ఞాన నివృత్తిలో ఏం జరుగుతుంది? చెబుతున్నాడు.*

**జ్ఞానేన తు త దజ్ఞానం యేషాం నాశిత మాత్మనః ।**
**తేషా మాదిత్యవ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥** 16

***జ్ఞానేన-తు-తత్-అజ్ఞానం-యేషాం-నాశితం-ఆత్మనః***
***తేషాం-ఆదిత్యవత్-జ్ఞానం-ప్రకాశయతి-తత్పరం***

| | | | |
|---|---|---|---|
| ఆత్మనః | = ఆత్మ యొక్క | తేషాం | = వారి యొక్క |
| జ్ఞానేన | = జ్ఞానము చేత | జ్ఞానం | = జ్ఞానము |
| యేషాం | = ఎవరి యొక్క | ఆదిత్యవత్ | = సూర్యుని వలె |
| తత్ అజ్ఞానం తు | = ఆ అజ్ఞానము | తత్పరం | = ఆ పరమాత్మను |
| నాశితం | = నశింపజేయ బడిందో | ప్రకాశయతి | = ప్రకాశింప చేస్తుంది |

**ఎవరి అజ్ఞానము ఆత్మ జ్ఞానము చేత నశించిందో, అట్టి వారి జ్ఞానము సూర్యుని వలె పరబ్రహ్మ స్వరూపమును ప్రకాశింప చేస్తుంది.**

### వ్యాఖ్య

అనర్థ హేతువైన అజ్ఞానం ఎలా దుఃఖాన్ని కలిగించి బాధిస్తూ ఉందో గడచిన శ్లోకంలో చూశాం. అజ్ఞానమును అంత మొందించి జ్ఞానంతో శోభించేది ఎలాగో ప్రస్తుత శ్లోకంలో చూడబోతాం. రాగ మేమిటో గడచిన శ్లోకంలో చూశాం. చికిత్సను, తద్వారా పొందే ఆరోగ్యాన్ని ఈ శ్లోకంలో చూస్తాం. వ్యాధి రూపంలో అజ్ఞానం ఉంది. ఔషధ రూపంలో జ్ఞానం ప్రాప్తిస్తూ ఉంది.

ఏ అజ్ఞానము చేత మోహితులై మానవులు కలత చెందు తున్నారని గడచిన శ్లోకంలో గ్రహించామో, ఆ అజ్ఞానము **(తత్ అజ్ఞానం)** ఎవరి యొక్క **(యేషాం)** ఆత్మ సంబంధమైన **(ఆత్మనః)** వివేక జ్ఞానం చేత **(జ్ఞానేన)** నశింప బడుతుందో **(నాశితమ్)** ఆ జ్ఞానము యొక్క వైభవాన్ని వర్ణిస్తున్నాడు.

### అజ్ఞానము - ఆవరణము

జ్ఞానము అజ్ఞానము చేత కప్పబడింది అని గడచిన శ్లోకంలో చూశాం. అజ్ఞానము జ్ఞానము చేత నశించింది అని ప్రస్తుత శ్లోకంలో చూస్తున్నాం. ఇంతకీ, ఈ అజ్ఞానము ఏమిటి? అజ్ఞాన శబ్దార్థం ఏమిటి?

అజ్ఞానము అంటే జ్ఞానము యొక్క అభావము లేదా జ్ఞానము లేకపోవుట అని చెబుతూ ఉంటారు.





అది ఒక అర్థం. అలా చూచి నపుడు అజ్ఞానము అంటే జ్ఞానము లేని స్థితి. అభావం అంటే లేనిది. ఇదే వాస్తవ మైతే, లేని అజ్ఞానము ఉన్న జ్ఞానాన్ని ఎలా కప్పుతుంది? లేని దానితో కప్పుకునే అవకాశమే ఉంటే, ఇంటికి కప్పు ఎందుకు? ఒంటికి బట్టెందుకు? కుండకు మూత ఎందుకు? గదికి తలుపు ఎందుకు? కంటికి రెప్ప ఎందుకు? కొబ్బరికి చిప్ప ఎందుకు? లేనిది ఎలా ఆవరిస్తుంది?

అదలా ఉంచితే, జ్ఞానం చేత నశించిన అజ్ఞానం అని ప్రస్తుత శ్లోకంలో చూశాం. జ్ఞానం చేత నశించింది అంటే, అలా నశించిన అజ్ఞానము ఉన్నదేనా? లేక లేనిదా? లేనిదే అయితే ఎలా నశిస్తుంది? అజ్ఞానము అనేది జ్ఞానము యొక్క అభావమే అయితే, అభావం అంటే లేనిది కనుక లేనిది నశించదు.

కనుక అజ్ఞాన శబ్దార్థం జ్ఞానము యొక్క అభావం అని అర్థమా? లేక, అజ్ఞాన మనేది స్వవిషయక మైన ఒకానొక పదార్థమా? ***అజ్ఞానేన ఆవృతం; జ్ఞానేన నాశితం*** అనే రెండు వాక్యాల చేత మనకు ఒక్క విషయం సుస్పష్ట మవుతూ ఉంది. లేనిదే అయితే జ్ఞానమును కప్పే ప్రసక్తి లేదు. లేనిదే అయితే జ్ఞానము చేత నశింపబడే అవకాశం లేదు. కనుక అజ్ఞానము జ్ఞానము యొక్క అభావము అనేది నిరాకరింప బడింది.

ఇక రెండవది అజ్ఞానము భావరూపమే. ఇదే అంగీకారము. అజ్ఞానమునకు ఏది విషయమో దానికి సంబంధించిన జ్ఞానము కలిగితే అజ్ఞానము నశిస్తుంది అనే హేతువు చేతను, అజ్ఞానమునకు ఏది ఆశ్రయమో, అట్టి ఆశ్రయ సంబంధ ప్రమాణ జ్ఞానము వలన అజ్ఞానము నశిస్తుంది అనే కారణము చేతను అజ్ఞానము అనేది భావరూపమే అని తెలుస్తూ ఉంది. జ్ఞానము చేత నశిస్తూ ఉంది కనుక అది జ్ఞానము యొక్క అభావము కాదు, జ్ఞాన విరోధి. దీనినే అవిద్య లేక మాయ అన్నారు.

### ఆవరణము - విక్షేపము

అజ్ఞానానికి ఆవరణము, విక్షేపము అనే రెండు శక్తులు ఉన్నాయి. ఆ రెండే బంధహేతువులు ***(అజ్ఞానస్య ద్వేశక్తీః బంధహేతు భూతే ఆవరణ శక్తిః విక్షేప శక్తిశ్చ ఇతి).*** ఈ ఆవరణ విక్షేప శక్తులే సర్వ అనర్థములకు మూలము. ఉన్నది ఉన్నట్లు తెలియకుండా కప్పి పుచ్చేది ఆవరణ శక్తి. లేని దానిని కల్పించి చూపేది విక్షేప శక్తి. దివ్య తేజోమయమైన ఆత్మను ఆత్మగా తెలియకుండా కప్పి పుచ్చేది ఆవరణ శక్తి కాగా, అనాత్మ మైన దేహమే ఆత్మ యని, తాను దేహమే అనే అభిమానాన్ని కల్పించి దుఃఖానికి గురి చేసేది విక్షేప శక్తి. ఇదే మోహము. ఈ మోహం చేత తాను కాని అనిత్యదేహాన్ని తాను అని పురుషుడు భావిస్తాడు ***(పుమాన్ మోహాత్ అనాత్మానం శరీరం అహమితి కలయతి).*** ఇదే అజ్ఞాన వృత్తి, ఆత్మ అజ్ఞాన వృత్తి.

అజ్ఞాన వృత్తి ఏదైనా జ్ఞానవృత్తి చేతనే నశించాలి. ఘట జ్ఞానము లేనపుడు ఘటము యొక్క అజ్ఞానం ఉంటుంది. ఘట జ్ఞానము కలిగితే ఘట అజ్ఞానము నశిస్తుంది. ఈ విధంగా జ్ఞానవృత్తి చేత అజ్ఞాన వృత్తి నశిస్తుంది.

ఏ విషయానికి సంబంధించిన అజ్ఞాన వృత్తి ఆ విషయానికి సంబంధించిన జ్ఞానవృత్తి చేతనే నివృత్తి అవుతుంది. ఘట అజ్ఞానవృత్తి పట జ్ఞానవృత్తి చేత, పట అజ్ఞాన వృత్తి ఘట జ్ఞాన వృత్తి చేత నివర్తింప బడవు.

ఆత్మకు సంబంధించిన అజ్ఞానము ఆత్మను కప్పివేసింది. కనుక ఆత్మ అజ్ఞాన వృత్తి ఉంది. ఆత్మ అజ్ఞాన వృత్తి నశించాలి అంటే, అది ఆత్మ జ్ఞాన వృత్తి వల్లనే సాధ్య మవుతుంది. మరొక విషయానికి సంబంధించిన జ్ఞానవృత్తి చేత సాధ్యం కాదు.

ఆత్మ అజ్ఞానము అంటే, ఆత్మ విషయమైన అజ్ఞానము. ఆత్మ ఆశ్రయంగా గల అజ్ఞానము. ఆత్మ అజ్ఞానము ఆత్మ సంభవమే అనే విషయాన్ని విస్మరించ కూడదు. ఆత్మ అజ్ఞానానికి ఆత్మే కేంద్ర బిందువు. కేంద్ర విషయము.

సూర్యుని వలన జనించిన మేఘాలు సూర్యుణ్ణే ఎలా కప్పుతున్నాయో, అలాగే ఆత్మ దగ్గరే పుట్టి, ఆత్మకు సంబంధించి ఉన్న అజ్ఞానము ఆత్మనే కప్పేస్తూ ఉంది. సూర్యుని మరుగు పరచిన మేఘము అంతా తానే అయినట్లు ఎలా ఊరేగుతూ ఉందో, అలాగే ఆత్మను కప్పిన ఆత్మ అజ్ఞానము తానే సర్వమై సంసారాన్ని సృష్టిస్తూ ఉంది.

ఈ దృష్టాంతాన్ని మరొక కోణం నుంచి చూద్దాం. మేఘ మండలము సూర్యుణ్ణి మరుగు పరచిన సమయంలో, మేఘము నిజానికి సూర్యుణ్ణి కప్పేసిందా? ఇంత చిన్న మేఘం అంత పెద్ద సూర్యుణ్ణి కప్పగలదా? కప్పేసింది అనే అనుకుందాం. మేఘం కప్పడం చేతనే సూర్యదర్శనం కావడం లేదు. బాగుంది. మరి మేఘం కనిపిస్తూ ఉందా, లేదా? సూర్యుడు కనిపించడం లేదు గాని మేఘం కనిపిస్తూ ఉంది. మేఘం కనిపించడానికి ప్రకాశ మేమిటి? మేఘాన్ని ప్రకాశింప చేసిం దెవరు? ప్రకాశంలో లేకపోతే మేఘాన్ని చూడలేము. మరి మేఘాన్ని ప్రకాశింప చేసింది ప్రకాశం లేని మేఘమేనా?

సూర్యుణ్ణి మరుగు పరచిన మేఘము సూర్యుని ప్రకాశం చేతనే మనకు ఉన్నట్లు తెలుస్తూ ఉంది. ఇక మేఘం సూర్యుణ్ణి కప్పిం దెప్పుడు? కప్పినట్లు ఉంది. అదే ఆవరణ శక్తి. మేఘం తొలగితే సూర్యుడు స్వయంగా ప్రకాశిస్తూ గోచరిస్తాడు. అజ్ఞానము కూడా ఆత్మను కప్పలేదు. అజ్ఞానానికి సంబంధించిన జ్ఞానం కూడా మనకు ఆత్మ వలననే కలుగుతూ ఉంది.

ఇది అర్థం గాని అవివేకి సూర్యుణ్ణి లేని వాడుగా, లేక ప్రకాశం లేని వాడుగా భావిస్తాడు. ఆత్మ విషయంలో అజ్ఞాని కూడా అలాగే సంభావిస్తాడు.

**ఘనచ్ఛన్న దృష్టిః ఘనచ్ఛన్న మర్కం యథా నిష్ప్రభం మన్యతే చాఽతి మూఢః**

అతిమూఢుడు కప్పి ఉన్న మేఘ దృష్టి గలవాడై, మేఘము చేత ఆవృతమైన ఆదిత్యుని ప్రకాశం లేని వాడుగా భావిస్తున్నాడు.

**ఆవరణ ధ్వంసం - అజ్ఞాన నాశం**

ఆత్మకు సంబంధించిన జ్ఞానం లేనపుడు ఆత్మకు సంబంధించిన అజ్ఞానం ఉంది. అదే అజ్ఞాన వృత్తి. ఆత్మ లక్షణం సత్యం - జ్ఞానం - అనంతం అని అర్థమైతే, తద్వారా ఆత్మ జ్ఞాన వృత్తి పుడుతుంది. జ్ఞానవృత్తి అజ్ఞాన వృత్తిని వశింప చేస్తుంది. అంతే. ఆవరణ శక్తి ధ్వంస మవుతుంది. ఆవరణం ధ్వంసం కాగానే, ఆవరణమునే ఆశ్రయించుకొని విజృంభిస్తున్న విక్షేప శక్తి కూడా నశిస్తుంది. సంసారం అదృశ్య మవుతుంది. ఆత్మజ్ఞానము సమస్తమును ప్రకాశింప చేస్తుంది.

సూర్య భగవానుడు తాను ఉదయించ గానే అంతవరకు ఉన్న తిమిరాన్ని నశింప చేసి, తన తేజస్సులో సమస్తాన్ని ఎలా ప్రకాశింప చేస్తాడో, ***(యథా ఆదిత్యః సమస్తం వస్తు జాతం అవభాసయతి)*** అలాగే ***(తద్వత్)*** జ్ఞానము తెలియ దగిన సమస్తమును ***(జ్ఞానం జ్ఞేయం వస్తు సర్వం)*** సూర్యుని వలె ప్రకాశింప చేస్తుంది ***(ఆదిత్య వత్ ప్రకాశయతి).*** అంతా పరబ్రహ్మ స్వరూపంగా ప్రకాశింప చేస్తుంది ***(తత్ పరం పరమార్థ తత్త్వమ్).***

***తత్పరమ్ ప్రకాశయతి*** అంటే, పరబ్రహ్మమును ప్రకాశింప చేస్తూ ఉంది అనే విషయాన్ని కూడా జాగ్రత్తగా





అర్థం చేసుకోవాలి. జ్ఞానము పరబ్రహ్మమును ప్రకాశింప చేస్తే, ప్రకాశింపబడే పరబ్రహ్మము జడమయ్యే ప్రమాదం ఉంది. పరబ్రహ్మము యొక్క ప్రకాశాన్ని అనుసరించి సర్వం ప్రకాశిస్తూ ఉన్నప్పుడు, పరతత్త్వాన్ని ప్రకాశింప చేసే శక్తి ఎవరికి ఉంటుంది?

అజ్ఞాన వృత్తి జ్ఞానానికి అవరోధంగా మారింది. స్వరూపము యొక్క ఎరుక లేకుండా చేసింది. జ్ఞానవృత్తి అజ్ఞాన వృత్తిని తొలగించ గానే ఆత్మ స్వప్రకాశమై భాసిస్తూ ఉంది.

ఒక్క విషయాన్ని ఈ సందర్భములో జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. అజ్ఞానవృత్తి, జ్ఞానవృత్తి రెండూ వృత్తులే కనుక, అవి బుద్ధి లోనే ఉంటాయి. బుద్ధిలో కలిగే ప్రమాణ జనిత జ్ఞానం వల్లనే బుద్ధిలో భ్రాంతి చేత ఏర్పడిన అజ్ఞానము నశిస్తుంది. ఇదీ విషయం. జ్ఞానాజ్ఞానాలు రెండూ బుద్ధిలో ఉన్నవే గాని ఆత్మలో లేవు. జ్ఞానాజ్ఞానములు రెండిటిని ప్రకాశింప చేసేది స్వప్రకాశమైన ఆత్మ చైతన్యమే. ఆత్మను తెలుసుకొనే జ్ఞానము ఆత్మ కన్నా వేరుగా లేదు.

**జ్ఞాన వర్జితాఽజ్ఞాన హీన చిత్,**
**జ్ఞాన మస్తి కిం జ్ఞాతు మన్తరమ్ ॥**

చైతన్యము జ్ఞానమూ కాదు; అజ్ఞానమూ కాదు. తెలియబడేది అక్కడ ఏముంది? అని ప్రశ్నించారు ఉపదేశ సారం అనే గ్రంథంలో భగవాన్ శ్రీ రమణమహర్షి.

*ఈ విధంగా ప్రాప్తించిన జ్ఞానము యొక్క ఫలం ఏమిటో, ఎలాంటిదో తరువాత శ్లోకంలో వివరిస్తున్నాడు.*

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః ॥ 17

***తద్బుద్ధయః-తదాత్మానః-తన్నిష్ఠాః-తత్పరాయణాః***
***గచ్ఛంతి-అపునరావృత్తిం-జ్ఞాన నిర్ధూత కల్మషాః***

| | | | |
|---|---|---|---|
| తద్బుద్ధయః | = ఆ బ్రహ్మము నందే బుద్ధి కల వారు | జ్ఞాననిర్ధూత కల్మషాః | = జ్ఞానము చేత పోగొట్టబడిన పాపము గలవారునై |
| తదాత్మానః | = దాని యందే మనస్సు కల వారు | | |
| తన్నిష్ఠాః | = దాని యందే నిష్ఠ కల వారు | అపునరావృత్తిం | = జన్మరహిత మైన మోక్షమును |
| తత్పరాయణాః | = అదే పరమగతిగా కల వారు | గచ్ఛంతి | = పొందుచున్నారు |

**పరమాత్మ యందే బుద్ధి గల వారు, పరమాత్మ యందే మనస్సు గల వారు, పరమాత్మ యందే నిష్ఠ గల వారు, పరమాత్మే పరమగతి అని భావించు వారు, జ్ఞానము చేత పాపమును పోగొట్టుకున్న వారు, జన్మ రహితమైన మోక్షమును పొందుతారు.**

**వ్యాఖ్య**

మనస్సు మనస్సుగా ఉండి మహిమను చేరుకోలేదు. బుద్ధి బుద్ధిగా ఉంటూ భగవంతుని అందుకోలేదు. బ్రహ్మజ్ఞానము అనేది ఎవరికో కలిగేది కాదు. ఎవరికి బ్రహ్మ జ్ఞానము కలుగుతుందో అతడు అబ్రహ్మ కాడు. ఆత్మజ్ఞానం ప్రాప్తించడం అంటే, ఆత్మ కాని వాడికి ఆత్మజ్ఞానం ప్రాప్తించడం కాదు. అలా ప్రాప్తిస్తే, అనాత్మకు ఆత్మజ్ఞానం కలిగింది అని అర్థము. ఆత్మను తెలుసుకోవడానికి ఆత్మ కన్నా వేరుగా మరొకడు లేడు.

బ్రహ్మము కన్నా మరొకడు వేరుగా ఉండటం అనేది ఆత్మజ్ఞాని ఊహించ లేడు. ఆత్మ కన్నా వేరుగా ఉండి ఆత్మను తెలుసు కోవాలి అంటే, ముందుగా ఆత్మ అనేది చైతన్యమా, లేక జడమా అనేది నిర్ధారణ కావాలి. ఆత్మ చైతన్యమే అయితే, వేరుగా ఉండి ఆత్మను తెలుసుకొనే దెవరు? తెలుసుకొనే వాడు జడమై ఉండాలి. జడము అనేది తెలియబడేదే గాని తెలుసుకొనేది కాదు. మరి తెలుసుకొనే వాడు చైతన్యము అయితే, తెలియబడే ఆత్మ ఏమవుతుంది? జడ మవుతుంది. ఆత్మ జడమే అయితే, తెలుసుకొని ఏమి సాధించాలని? అలా కాకుండా, తెలుసుకొనే వాడు, తెలియబడే ఆత్మ రెండూ చైతన్యమే అయితే, అప్పుడు చైతన్యాలు రెండు ఉన్నాయి అనే అర్థరహిత మైన విషయాన్ని చెప్పవలసి ఉంటుంది. రెండు చైతన్యాలు ఉండటము అంటే ఏదీ చైతన్యము కాదు అని అర్థము. ఆత్మను తెలుసుకోవడంలో ఆనందము ఉంది కనుకనే ఎవరైనా ప్రయత్నం చేస్తారు. ఆత్మ భయహేతువు అని తెలిస్తే ఎవరు ప్రయత్నిస్తారు? వేరుగా ఉండి ఆత్మను తెలుసుకోవడం భయహేతువే అవుతుంది.

**ఏతస్మిన్ ఉదర మన్తరం కురుతే, అథ తస్య భయం భవతి!**

బ్రహ్మము కన్నా భిన్నంగా ఏ కొంచెము ఉన్నా అది భయ కారణ మవుతుంది అన్నది ఉపనిషత్తు. తెలియ బడేది ఏదీ ఆత్మ కాదు. చైతన్యము తెలియ బడదు. అప్పుడు చైతన్య స్వరూపుడైన వాడు ఆత్మను తెలుసుకొనే వాడు అని చెప్పవలసి వస్తుంది. చెప్పడం కష్టం కాదు. దేనిని తెలుసుకుంటాడు? అని ప్రశ్నిస్తే, సమస్య మళ్ళీ మొదటికి వస్తుంది. తన కన్నా అన్యమైన దానిని తెలుసుకుంటాడు అని చెప్పేట ట్లయితే, అలా తన కన్నా అన్యమైనది ఒకటి వేరుగా ఉందని అంగీకరించవలసి వస్తుంది. అలా ఉంటే, అది భయకారణ మవుతుంది.

తన కన్నా అన్యంగా, అంటే ఆత్మ కన్నా అన్యంగా, లేదా బ్రహ్మ కన్నా భిన్నంగా మరొకటి ఉంటే, అది ఎలా భయకారణం అవుతుందో తన కన్నా వేరుగా ఏమీ లేదు అనేది కూడా భయకారణమే అవుతుంది. ఇది మన అందరి అనుభవంలో ఉంది. భయానికి ఇంకేదో ఉండటం, మరెవరో ఉండటం ఎలా కారణమో, ఏదీ లేకపోవడము, ఎవరూ లేకపోవడము కూడా కారణమే.

పిల్లల్ని చూడండి. పసి పిల్లవాడు ఇంట్లో దోగాడుతూ, ఒక దశలో దోగాడటం ఆపి అటూ ఇటూ చూస్తాడు. ఎవ్వరూ కనిపించక పోయే సరికి కెవ్వుమని కేక వేసి ఏడుపు నారంభిస్తాడు. ఎందుకో తెలుసా? భయం చేత. ఎవ్వరూ లేరు అనే భయం చేత. ఆ ఏడుపు విని ఎవరైనా పరుగెత్తుకు రాగానే వారిని చూచి రోదించడం మానేస్తాడు.

పిల్లవాడు భయప డటానికి ఏదో కారణం కాదు. ఎవరో కారణం కాదు. ఉన్నది భయకారణం కాకపోగా, లేనిది భయకారణ మైంది. ఇది ఎంత విచిత్రమో! ఊహించను సాధ్యం కాని విషయం. అభావం భయహేతువు కావడం అనూహ్యం.

ఆత్మ కన్నా అన్యంగా 'ఏదో ఉంది' అనేది ఎలా భయ కారణమో, 'ఏదీ లేదు' అనేది కూడా భయ కారణమే. 'ఆత్మే ఉంది' అనేదే అభయ కారణము. ఆనంద స్వరూపము.

ఉన్నది, లేనిది, మరో విధంగా ఉన్నది - ఇలా ఎన్ని చెప్పుకున్నా, చివరికి ఏదీ ఆత్మకు బాహ్యంలో లేదు అనవలసి వస్తుంది. ఆత్మకు బాహ్యంలో లేదు అంటే, ఆంతర్యంలో ఉంది అనే అర్థం ధ్వనిస్తుంది. అది కూడా సాధ్యం కాదు అనే సత్యాన్ని శ్రమించి అర్థం చేసుకోవాలి.





నువ్వు ఆత్మవు. నీ ఆంతర్యంలో ఏది ఉన్నా, ఆత్మవైన నువ్వు దానికి బాహ్యంలో ఉన్నావు అని అర్థము. ఆత్మ బాహ్యంగా లేదు. ఆంతర్యంలో ఉంది అంటే, బాహ్యం ఏమిటి? అనే ప్రశ్న పుడుతుంది. బాహ్యం ఉంటేనే ఆంతర్యం ఉంటుంది.

అటు బాహ్యం కాకుండా, ఇటు ఆంతర్యం కాకుండా నీ కన్నా అన్యమైనది నీవు గానే ఉంది అని చెబుదా మంటే, అది కూడా అన్వయించదు. ఉదాహరణకి స్వప్నగత విషయాన్ని తీసుకుందాం.

మనం కల కంటున్నాము. మన కల మన కన్నా వేరుగా లేదు. పోనీ, బాహ్యంలో ఉందా? లేదు. ఆంతర్యంలో ఉంది అంటారా? అప్పుడు స్వప్నానికి బాహ్య మేమిటి? స్వప్నగత బాహ్యమా? మేలుకున్న తరువాత తెలిసే బాహ్యమా? ఆలోచించండి.

స్వప్నం మనం గానే మనకు అర్థ మవుతున్నా, మనలో మనంగా ఏది ఉండినా అది కూడా భయ కారణమే అవుతుంది. అందుచేతనే స్వప్నంలో భయాలు, బాధలు, ఆందోళనలు, ఆవేదనలూనూ.

కనుక, ఆత్మను లేదా బ్రహ్మమును తెలుసుకొనే వాడు ఒకడు ఉన్నాడు అనేది వాస్తవం కాదు. ఒకవేళ ఉంటే, ఆ ఉన్నవాడు ఆత్మగానే లేదా బ్రహ్మము గానే ఉన్నాడు. ఒకవేళ తెలియడ మంటూ ఏదైనా జరిగితే, అది ఇలా తెలియడమే. ఏ సంబంధమూ లేని సంబంధమే బ్రహ్మవిదునికి బ్రహ్మతో ఉన్న సంబంధము. ఈ మాత్రము అవగాహనతో తెలుసుకోవడం అనే పదంలో ఉండే అవరోధము, సంపూర్ణంగా తీరిందని నేను భావించడం లేదు. ముమ్ముందు ఎంతో ఉంది. కాని, ఒక్కమాట. ఈ నా వ్యాఖ్యానాన్ని సంపూర్ణం అని రెండు చేతులు జోడించే నాటికి, ఏ అవరోధము లేకుండా అర్థమవుతుంది అని నా ప్రగాఢ విశ్వాసము. ఈ లోగా ఎంతో పరిణతి చెందాలి. చదవండి.

**తద్బుద్ధులు**

**తద్బుద్ధయః** - దాని యందే బుద్ధి గల వారు. దేని యందు? ఏ పరమార్థ తత్త్వము జ్ఞానం చేత ప్రకాశిత మైనది అని గడచిన శ్లోకం చివర గ్రహించామో **(యత్పరం పరమార్థ తత్త్వం ప్రకాశితమ్)** ఆ పరమార్థము నందే బుద్ధి గలవారు.

బ్రహ్మజ్ఞానము లేదా పరమార్థతత్త్వము అనేది కర్మతంత్రము కాదు. అది వస్తు తంత్రమే గాని, పురుష తంత్రము కాదు. పురుషుని ప్రయత్నం చేత పొందేది కాదు. జ్ఞానము అనేది కార్యము కాదు. అది కర్మ పరిధి లోకి రాదు. క్రొత్తగా ప్రాప్తించేది కాదు. ఉన్నదే. నిత్యమైనది క్రొత్తగా పుట్టదు.

నీ కన్నా అన్యమైన దానిని తెలుసుకోవాలి అంటే బుద్ధి ఉండి తీరాలి. నీవు ఉన్నట్లు తెలియడానికి బుద్ధి అవసరమా? బుద్ధి ద్వారా తెలుసుకోవడము అనే కర్మకు నీవు ఫలమా? లేక, నీవు ఉండటం చేత బుద్ధి బుద్ధిగా చలిస్తూ ఉందా? కనుక, బుద్ధి బ్రహ్మను **(తత్)** తెలుసుకోవడం అంటే బుద్ధి అదిగా ఉండటమే. అలా ఉండేవారు తద్బుద్ధులు.

తద్బుద్ధులు ఉన్నట్లే అతద్బుద్ధులు కూడా ఉన్నారు. ఆత్మయే బ్రహ్మము. ఇదే బ్రహ్మాత్మజ్ఞానము. తెలిసినా, తెలియక పోయినా అందరూ బ్రహ్మస్వరూపులే. కాని కొందరికి ఈ సత్యం తెలుసు. అందరికీ తెలియదు. తెలిసిన వారు తదాత్ములు.

**తదాత్ములు**

ఇంతవరకు ఏ పరమార్థ తత్త్వమును పరబ్రహ్మముగా మనం చర్చించామో, ఆ బ్రహ్మము తమ

ఆత్మయే అనే జ్ఞానం కలవారు తదాత్మలు ***(తదాత్మనః తదేవ పరంబ్రహ్మ ఆత్మా యేషాం తే తదాత్మానః).*** బ్రహ్మాత్మ జ్ఞానం కలవారు. బ్రహ్మమును ప్రత్యేకించి పొంద నవసరం లేదు అని తెలిసిన వారు. బ్రహ్మము తమ ఆత్మయే అని క్షుణ్ణంగా ఎరిగిన వారు తదాత్మలు. ఆత్మ వృత్తి జ్ఞానము కాదని, జ్ఞానవృత్తి కూడా కాదని కేవలం స్వరూపమని తెలిసిన వారు ఆత్మ కన్నా అన్యంగా లేరు కనుక వారు తదాత్మలు.

తదాత్మలు కనుక వారు సర్వకర్మ వినిర్ముక్తులు. బ్రహ్మస్వరూపము నందే స్థిరపడి ఉన్నవారు. అందుచేత తద్బుద్ధులైన తదాత్మలు తన్నిష్ఠులు.

**తన్నిష్ఠులు**

బ్రహ్మము నందే నిష్ఠ కలవారు తన్నిష్ఠులు. బ్రహ్మము నందే తాత్పర్యం కలవారు. సర్వ కర్మలను త్యజించిన జ్ఞానకర్మ సన్యాసులు. బ్రహ్మము నందే అవస్థితులు తన్నిష్ఠులు ***(సర్వాణి కర్మాణి సంన్యస్య బ్రహ్మణి ఏవ అవస్థానం యేషాం తే తన్నిష్ఠాః).*** బ్రహ్మము అకర్త కనుక, తామూ అకర్తగా, అభోక్తగా శోభిస్తూ ఉంటారు. దేహంలో ఉన్నట్లు ఉన్నా, సర్వగతమైన బ్రహ్మ చైతన్యము నందే అవస్థితులై ఉంటారు. సదా ముక్తులై ఉంటారు.

'నేనే బ్రహ్మము' అనే జ్ఞానం తన్నిష్ఠులకు సుస్పష్టంగా ఉంటుంది. ఏదీ తమను ఇక చలింప చేయలేదు. ప్రపంచం వారికి విస్మృతప్రాయం. దేహం కేవలం ఛాయామాత్రం. అందుచేత, తన్నిష్ఠులు తత్పరాయణులు.

**తత్పరాయణులు**

'పరం' అంటే ఉత్కృష్ట మైనది. 'అయనం' అంటే స్థానము. ఏ పరమార్థ తత్త్వమును ***తత్*** పదం ద్వారా ఇంతవరకు మనం గ్రహించామో, అదే పరమ గతిగా కలవారు తత్పరాయణులు ***(తదేవ పరం అయనం పరాగతిః యేషాం భవతి తే తత్పరాయణాః).*** తమ యందే తాము మాత్రమే తాముగా ఆనందించే ఆత్మపరాయణులు. ఆత్మ యందే రమించువారు ***(కేవల ఆత్మరతయః ఇత్యర్థః).***

ఈ విధంగా జ్ఞానాన్ని పొందిన ఆత్మస్వరూపులు తిరిగి అనాత్మ సంబంధమును పొందగలరా? సత్య జ్ఞానంలో అసత్య వస్తు దర్శనం జరుగుతుందా? అందుచేత, తరించి పోయిన ఆ మహాత్ములు తిరిగి దేహ సంబంధాన్ని పొందరు. పునర్జన్మను పొందరు. వారిది తిరిగి రాని పోక ***(అపునరావృత్తిం గచ్ఛన్తి).*** తిరిగి పుట్టడానికి, పుట్టి అనుభవించడానికి వారిలో ఏ కర్మ కల్మషమూ లేదు. జ్ఞానం చేత సర్వ కల్మషాలు కడిగి వేయబడిన వారు ***(జ్ఞాన నిర్ధూత కల్మషాః).*** వారే యతులు. యతివరేణ్యులు. జీవన్ముక్తులు.

*జ్ఞానులైన అట్టి మహాత్ములు ఈ దృశ్యమాన జగత్తును ఎలా దర్శిస్తారు? వారి దివ్య దృష్టి ఎలా ఉంటుంది? చెబుతున్నాడు.*

విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని । 18
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః ॥

***విద్యావినయసంపన్నే-బ్రాహ్మణే-గవి-హస్తిని***
***శుని-చ-ఏవ-శ్వపాకే-చ-పండితాః-సమదర్శినః***

| | | | |
|---|---|---|---|
| విద్యావినయసంపన్నే | =విద్య, వినయము కలిగిన | హస్తిని | = ఏనుగు నందు |
| బ్రాహ్మణే | =బ్రాహ్మణుని యందు | శుని చ | = కుక్క యందు |
| గవి | =గోవు యందు | శ్వపాకే చ ఏవ | = చండాలుని యందు కూడ |





| | | |
|---|---|---|
| పండితాః | = | పండితులు |
| సమదర్శినః | = | సమదృష్టి కలిగి ఉంటారు |

**విద్య, వినయము కలిగిన బ్రాహ్మణుని యందు, గోవు నందు, ఏనుగు నందు, కుక్క యందు, కుక్క మాంసము వండుకొనే వాని యందు సమదృష్టి కలవారు జ్ఞానులు.**

**వ్యాఖ్య**

ఆత్మజ్ఞానం చేత ఆత్మ అజ్ఞానమును పోగొట్టుకున్న వారు జ్ఞానులు. వారే పండితులు. అంతటా బ్రహ్మ దర్శనం చేసే సమదర్శులు. యతివరేణ్యులు. అరుదైన వైభవంతో శోభించేవారు. సర్వత్ర ఏకాత్మ దర్శనం చేసేవారు.

'సమం' అంటే బ్రహ్మము. సమదర్శనము అంటే బ్రహ్మ దర్శనము. సర్వత్ర సమదర్శనం చేసేవారు అన్నప్పుడు, ఆ సర్వత్ర ఏమిటో కూడా అర్థం కావాలి. 'సర్వత్ర' అంటే సర్వ ప్రపంచము నందు, సమదర్శనం అంటే బ్రహ్మదర్శనం చేసేవారు అని అర్థము. ఇక్కడే విషయం కాస్త సంక్లిష్ట మవుతూ ఉంది.

ప్రపంచము అనేది చాలా విచిత్ర మైనది. ముఖ్యంగా బ్రహ్మము కన్నా విభిన్న మైనది. గుణదోషాలతో కూడినది. రాగద్వేషాలతో నిండినది. పుణ్యపాప మిశ్రిత మైనది. సుఖదుఃఖ సంయుత మైనది. శోకమోహాలకు నిలయ మైనది. ప్రియా ప్రియములను పెనవేసు కున్నది. శత్రుమిత్రులకు నెల వైనది. లాభనష్టాలతో మిళిత మైనది. పరిణామశీల మైన ప్రపంచము ఈ విధంగా దోషయుత మైనది.

ప్రపంచము దోషయుతంగా గోచరిస్తూ ఉంటే, బ్రహ్మము నిర్దోషమై, నిర్గుణమై, అఖండానంద స్వరూపంగా ప్రకాశిస్తూ ఉంది. దృశ్యమైన ఈ ప్రపంచము నానాత్వముతో, మిథ్యాత్వముతో తెలుస్తూ ఉంటే, బ్రహ్మము నిత్యత్వముతో, సత్యత్వముతో భాసిస్తూ ఉంది. ఎలా చూచినా భిన్నత్వంతో గోచరించే ప్రపంచము కన్నా అభిన్నత్వ విజ్ఞానముతో ప్రకాశించే బ్రహ్మము విలక్షణంగా ఉంది.

బ్రహ్మము అద్వితీయం కనుక పండితులు సమదర్శనం చేస్తారు అంటే అర్థం చేసుకోవచ్చు. ప్రపంచము అంతటా సమదర్శనం చేస్తారు అంటేనే అర్థం చేసుకోవడం సామాన్యులకు సంక్లిష్టంగా ఉంటుంది. అలా దర్శించడమే సమదర్శన వైభవము.

**భిన్న ప్రకృతులు**

అందరూ మానవులే అయినా, అందరి మనస్సులు ఒక విధంగా లేవు. అందరూ ఆలోచించే వారే అయినా, అందరూ ఒకే విషయాన్ని ఆలోచించరు. ఒకే విధంగా ఆలోచించరు. కొందరి ఆలోచనలు సత్త్వగుణ ప్రధానంగా ఉంటాయి. కొందరి ఆలోచనలు రజోగుణ ప్రేరితాలై ఉంటాయి. కొందరివి తమోగుణ ప్రధానంగా ఉంటాయి. ఇవన్నీ కలిసి వారి వారి స్వభావాలను నిర్ణయిస్తూ ఉంటాయి. నియమిస్తూ ఉంటాయి. ఈ స్వభావాలు కూడా దేశకాలాలలో మార్పు చెందుతూ ఉంటాయి. భిన్న మనస్తత్త్వాలు, స్వభావాలు కలిగిన మానవుల ప్రవర్తనను వివిధ సన్నివేశాలలో అర్థం చేసుకోవడమే బహు కష్టము. ఇక ఈ విధమైన భిన్న ప్రకృతులను సమంగా వీక్షించడం సాధ్యపడే విషయ మేనా? గుణదోషములతో కూడిన ఈ ప్రపంచము నందు ***(గుణదోష విశిష్టే అస్మిన్)*** అంతటా బ్రహ్మమునే దర్శించడం ***(సర్వత్ర సమదర్శిత్వం)*** సాధ్యమేనా? అనేది ప్రశ్న. ఎవరికి సాధ్యం? ఎవ్వరికీ సాధ్యం కాదు. అదే విచిత్రం. ఎవ్వరికీ సాధ్యం కాని ఈ సమదర్శనం ఆత్మజ్ఞానికి మాత్రం సర్వ సామాన్యము. పండితునికి సహజ లక్షణము. చూద్దాం.

**జగద్రూపము - బ్రహ్మభావము**

సత్య జ్ఞానానంద స్వరూపమైన బ్రహ్మము లేని ప్రదేశము లేదు. సర్వాధిష్ఠాన మైన బ్రహ్మము లేనిదే జగత్తుకు అస్తిత్వమే లేదు. జగత్తు బ్రహ్మముపై ఆధారపడి ఉంది. జగత్తు యొక్క ఉనికి బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉంది. బ్రహ్మము ఏకము. అద్వయము. జగత్తులో గోచరించే భిన్నత్వము నామరూపాలకు సంబంధించిందే గాని బ్రహ్మమునకు సంబంధించింది కాదు. దీనిని ప్రామాణికంగా అర్థం చేసుకుందాం.

*అస్తి భాతి ప్రియం రూపం నామచేత్ అంశపంచకమ్*
*ఆద్యం త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయం ॥*

అన్నది ఉపనిషత్తు. ఏ వస్తువును మనం చూచినా అందులో ఐదు విషయాలు ఉంటాయి. మొదటి మూడు, అనగా అస్తి భాతి ప్రియాలు బ్రహ్మస్వరూపానికి సంబంధించిన లక్షణాలు. అవే సచ్చిదానందాలు. తరువాత రెండు, అనగా నామరూపాలు జగత్తుకు సంబంధించినవి.

నామరూపాలతో తెలిసే ప్రపంచం బ్రహ్మము నందు ఆరోపించ బడింది. ఆరోపించ బడిన నామరూప జగత్తుకు బ్రహ్మము అధిష్ఠానంగా ఉంది. జగత్తు ఉంది అంటే బ్రహ్మము ఉంది అని అర్థము. జగత్తు లేకపోయినా బ్రహ్మము ఉంటుంది.

ఉన్న సమయంలో కూడా జగత్తు మార్పు చెందుతూ ఉంటుంది. బ్రహ్మము సదా వికార రహితంగా ఉంటుంది. నామరూపాలు నశిస్తాయి. అస్తి భాతి ప్రియ లక్షణములు కలిగిన బ్రహ్మము నిర్వికారం గాను, అవినాశి గానూ ఉంటుంది. అందుచేత, అధిష్ఠానమైన బ్రహ్మము సత్యము. ఆరోపితమైన జగత్తు మిథ్య.

మట్టిపాత్రలు నామరూపాలతో విభిన్నంగా గోచరిస్తాయి. వాటన్నిటికి మట్టే ఆధారంగా ఉంటుంది. మట్టి లేనిదే పాత్రలు లేవు. పాత్రలు లేకపోయినా మట్టి ఉంటుంది. పాత్రలు మిథ్య. మట్టి సత్యము. నామరూపాలతో కూడిన మట్టి పాత్రలలో మట్టిని దర్శించడమే సత్యదర్శనము. అదే సమదర్శనము.

గుణభేదంతో, రూపభేదంతో, జాతిభేదంతో, సంస్కారభేదంతో, కర్మభేదంతో, ప్రాణిభేదంతో ఈ నామరూపాత్మక మైన ప్రపంచము విభిన్నంగా గోచరిస్తూ ఉంటుంది. ఈ జగత్తునకు బ్రహ్మమే ఆధారము. బ్రహ్మము లేనిదే జగత్తు లేదు. జగత్తు లేకపోయినా బ్రహ్మము ఉంటుంది. జగత్తు మిథ్య. బ్రహ్మము సత్యము. నామరూపాలతో కూడిన జగత్తులో ఆధారమైన బ్రహ్మమును దర్శించడమే సత్యదర్శనము. అదే సమదర్శనము. ఇలా దర్శించేవారు సమదర్శులు. ఆత్మజ్ఞానులు. యతిపురుషులు. అందరిలో, అంతటా వారు బ్రహ్మమునే దర్శిస్తారు. వారిది భిన్నత్వంలో అభిన్నత్వ విజ్ఞానం.

**సర్వత్ర సమదర్శనం**

విద్యా వినయాలు కలిగిన బ్రాహ్మణుని యందు, ఆవు నందు, ఏనుగు నందు, కుక్క యందు, కుక్కను వండుకొని ఆరగించే చెండాలుని యందు, పండితులు సమమైన బ్రహ్మమునే దర్శిస్తారు. ఇదే బ్రహ్మజ్ఞాని పవిత్రదృష్టి.

సత్త్వగుణ ప్రధానుడై సంస్కారవంతు డైన వాడు బ్రాహ్మణుడు. రజోగుణ ప్రధాన మైనది ఏనుగు. తమోగుణ ప్రధానంగా ఉంటూ నీచ కార్యాలలో శునకము, చండాలుడు నిమగ్నమై ఉంటారు. వీరిలో జాతి భేదము, కర్మభేదము, గుణభేదము స్పష్టంగా తెలుస్తున్నాయి. అయినా అందరిలో పండితుడు సమమైన బ్రహ్మమునే దర్శిస్తాడు.





**చరాచరం జగత్ బ్రహ్మ దృష్ట్యైవ పశ్యన్తి !**

సమదర్శన యోగి చరాచర ప్రపంచములో బ్రహ్మమునే దర్శిస్తాడు. ఇదే సమదర్శనము. ***సమః - సర్వ కాలేషు సమః, సర్వ వికార రహితత్వాత్ సమః.*** అన్ని కాలాలలో ఏ మార్పు లేకుండా ఉండే దానిని 'సమః' అంటారు. అది సమస్త వికారముల నుండి, అనగా మార్పుల నుండి విడి పడినది అని 'సమః' శబ్దార్థాన్ని శ్రీవిష్ణు సహస్రనామ భాష్యంలో ఆచార్యులు అనుగ్రహించారు.

కనుక, వివిధ నామాలతో, నానావిధ రూపాలతో ఈ జగత్తు గోచరిస్తూ ఉండినా, నామరూపాలను గ్రహించకుండా కేవలం అధిష్ఠానమైన అస్తి భాతి ప్రియమును దర్శించడమే సమదర్శనము. ఇలా సమదర్శనం చేసే శక్తి గల ఆత్మజ్ఞానులే పండితులు ***(పండా ఆత్మజ్ఞానం యేషాం తే పండితాః).***

ఒక వ్యక్తిని మనం చూచి నపుడు, అతనికి సంబంధించిన ఆలోచనలు మనలో కదుల్తాయి. ఒక సజ్జనుని చూచి నపుడు సద్భావాలు, ఒక దుష్టుని చూచి నపుడు తత్సంబంధమైన కలుషిత భావాలు మనలో కదుల్తూ ఉంటాయి. కాని, సమదర్శన యోగి వారిని చూచినపుడు అతని మనస్సులో ఏ విధమైన మార్పు ఉండదు. కారణ మేమిటో తెలుసా? బుద్ధి లోని భేదాలు మిథ్యా సంబంధ మైనవి. కనుక, వాటిని పండితుడు దర్శించడు. అతడు వారి లోని ఆత్మనే దర్శిస్తాడు కనుక, దృశ్యాల ప్రభావం అతని బుద్ధిపై ఉండదు.

**ఆఖ్యాయిక**

'ఈ రోజు ప్రవచనం ప్రారంభించే ముందు మిమ్మల్ని ఒక ప్రశ్న అడగా లనుకున్నాను. మీరు సమాధానం చెప్పాలి. రాత్రి ముగిసిందని, పగలు మొద లైందని ఎలా చెప్పగలరు?' అని గురువు శిష్యుల్ని ప్రశ్నించాడు.

'గురుదేవా! దీపం సహాయం లేకుండా కళ్ళ ముందున్న ప్రపంచము కనిపించి నపుడు రాత్రి లేదని, ఉన్నది పగలే నని చెబుతాము' అన్నాడు ఒకడు. 'కాదు, ఆ సమాధానం సరియైనది కాదు' అన్నాడు గురువు.

'సద్గురుదేవా! మనకు కనిపిస్తున్న మనుషులలో పురుషుల్ని పురుషులుగా, స్త్రీలను స్త్రీలుగా స్పష్టంగా గుర్తించ గలిగితే రాత్రి లేదని, పగలు వచ్చిందని అర్థము' అన్నాడు మరొకడు. 'అది కూడా సరైన సమాధానం కాదు' అన్నాడు గురువు.

ఏమి చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం గాక తికమక పడిన శిష్యులు చివరగా అదేమిటో చెప్పమని గురువునే ప్రార్థించారు.

'నాయనా! పురుషుణ్ణి చూడగానే అతనిలో నీకు భగవంతుడు దర్శనీయ మైనపుడు, అలాగే స్త్రీ మూర్తిని చూచినపుడు నీకు భగవతి దర్శనీయ మైనపుడు అది పగలు. అలా జరగనపుడు రాత్రే ఉందని అర్థము. ఇంకా తెల్లవార లేదనే భావము'. జ్ఞానోదయమే నిజమైన వెలుగు అన్నాడు గురువు.

కనుక, పండితుడు అంటే లౌకిక జ్ఞానం విశేషంగా కలిగిన వాడు అని కాదు. అభినయాలు, అవధానాలు, లౌకిక విద్యా ప్రావీణ్యతలు మొదలైన కళలలో ఆరితేరిన వారు కారు పండితులు అంటే. వారందరూ పద్మశ్రీలు, కమలశ్రీలు, కలువశ్రీలు, కనకాంబరశ్రీలు, మల్లెశ్రీలు, మందారశ్రీలుగా మూడు రోజులు వెలిగి, నాలుగో రోజు వాడిపోయే వారే. ఇక్కడ పండితుడు అంటే, సామాన్యుడు కాడు. గ్రంథకీటకం అసలే కాడు. పండితుడు అంటే సమదర్శన యోగి. సర్వత్ర ఆత్మదర్శనం చేసే జ్ఞాని. తానే బ్రహ్మము అనే బ్రహ్మాత్మ జ్ఞానంతో విలసిల్లే ముక్త పురుషుడు. ఒక్క మాటలో చెప్పాలంటే జీవన్ముక్తుడు. ***సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్*** - అంతటా సమదర్శనం లేదా బ్రహ్మ దర్శనం చేయడం అనేది జీవన్ముక్తుని లక్షణము అని శ్రీశంకరాచార్య స్వామి ప్రకరణ గ్రంథంలో వ్రాశారు.

*సమదర్శన వైభవాన్ని, బ్రహ్మ దర్శన ఫలాన్ని తరువాత శ్లోకంలో వివరిస్తున్నాడు.*

**ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః ॥** 19

**ఇహ-ఏవ-తైః-జితః-సర్గః-యేషాం-సామ్యే-స్థితం-మనః**
**నిర్దోషం-హి-సమం-బ్రహ్మ-తస్మాత్-బ్రహ్మణి-తే-స్థితాః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| యేషాం | = | ఎవరి యొక్క | బ్రహ్మ | = | బ్రహ్మము |
| మనః | = | మనస్సు | నిర్దోషం | = | దోషము లేనిది |
| సామ్యే | = | సమభావము నందు | సమం హి | = | సమంగా ఉంది కదా! |
| స్థితం | = | స్థిరముగ ఉందో | తస్మాత్ | = | అందుచేత |
| తైః | = | వారి చేత | తే | = | వారు |
| ఇహ ఏవ | = | ఈ లోకము నందే | బ్రహ్మణి | = | బ్రహ్మము నందే |
| సర్గః | = | జన్మము | స్థితాః | = | ఉంటారు |
| జితః | = | జయింప బడింది | | | |

**సమభావము నందు స్థిరమైన మనస్సు గల వారు ఇక్కడే, ఈ జన్మ లోనే జనన మరణ రూప సంసారాన్ని జయిస్తారు. ఎందుకంటే, బ్రహ్మము దోషము లేనిది. కాబట్టి వాళ్ళు బ్రహ్మము నందే ఉంటారు.**

**వ్యాఖ్య**

**జీవన్ముక్తి**

బ్రహ్మము సమము అని అర్థం చేసుకున్నాం. ఆత్మ బ్రహ్మమే కనుక బ్రహ్మము సమము అంటే, ఆత్మ కూడా సమము అనే అర్థం. అదే సమాత్మా. ***సర్వ భూతేషు సమః - ఏక ఆత్మా సమాత్మా*** - ఆత్మ సమము, ఏకము కనుక, సర్వభూతములలో ఆత్మ సమంగా ఉంది. అంటే అభేదంగా ఉంది అని అర్థం.

ఆత్మ అభేదము. ఆత్మ ప్రతి ప్రాణిలో ఉంది. కనుక, అందరూ ఆత్మస్వరూపులే. అందరూ ఆత్మ స్వరూపులే అయినపుడు, అందరిలో ఆత్మ ప్రకాశిస్తూ ఉండే టప్పుడు, జీవుల మధ్య భేదమును దర్శించడం జ్ఞానం కాదు.

ఆత్మ అందరి లోను ఏకమై, సమమై ఉంది. అకర్తగా ఉంది. అభోక్తగా ఉంది అనేదే ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానము కలవారు సమదర్శులు అవుతారు. ఆత్మజ్ఞానము లేనివారు భేద దర్శనం చేస్తారు. భేదము ద్వైతము. ద్వైతము దుఃఖానికి కారణము.

భేద దర్శనంలో దోష దర్శనం జరుగుతుంది. బ్రహ్మము సమము కనుక అభేదము. అభేద జ్ఞానము అఖండము కనుక ఏ దోషమూ అంటదు. బ్రహ్మము అందుచేతనే నిర్దోషము. బ్రహ్మము నిర్దోషము అని అర్థమైతే, ఆత్మ బ్రహ్మమే కనుక ఆత్మ కూడా నిర్దోషమే. అంటే దోష రహితమైనది.

బురద త్రొక్కిన వాడు కాళ్ళు కడుగుకోవడానికి నీటి వద్దకు వెళతాడు. దోషములతో కూడిన వాడు దోషమును పోగొట్టుకోవడానికి జన్మల నెత్తుతాడు. ఎప్పుడైతే ఆత్మజ్ఞానం కలిగిందో, తానే ఆత్మ అని తెలిసిందో, అట్టి ఆత్మవిదుడు సముడు, దోషరహితుడు అగుచున్నాడు కనుక, మళ్ళీ జన్మ నెత్త వలసిన అవసరం అతనికి లేదు.





జన్మ అనేది బంధము. జన్మ నుండి విడి పడటము మోక్షము. జన్మ నెత్తే అవసరం లేదు అంటే, ఆత్మవిదుడు ముక్తు డయ్యాడని అర్థము. ఎప్పుడు? ఎక్కడ? ఎప్పుడు అంటే కాలము అని అర్థము. ఎక్కడ అంటే దేశము అని అర్థము. దేశకాలాలలో మోక్షం ఇమిడేది కాదు. కాని, చాలా మంది అలాగే భావిస్తూ ఉంటారు. అందుచేత, **ఇహైవ** అని శ్లోకాన్ని ప్రారంభించాడు భగవంతుడు. **ఇహైవ - ఇహ ఏవ,** అంటే ఇక్కడే అని అర్థము.

ముక్తి అనేది ఎక్కడో పొందేది కాదు. ఏ దేశం లోనో, ఏ లోకం లోనో పొందేది కాదు. కాశిలో కైవల్యం ప్రాప్తించే టట్లైతే, కాశియే కైవల్య మవుతుంది గాని, కైవల్యాన్ని చేరడానికి కాశి కూడలి కాలేదు.

ఆ ప్రదేశంలో ముక్తి అంటే, ఈ ప్రదేశంలో లేదు అని అర్థము. ఆ లోకంలో ముక్తి అంటే, ఈ లోకంలో లేదు అని అర్థము. ఈ విధంగా ముక్తి కనుక ఒక ప్రదేశానికి పరిమిత మైతే, అలాంటి ముక్తి పరిమితంగా ఉంటుంది. పరిమితంగా ఉండేది ముక్తి కాలేదు. బంధ మవుతుంది.

ముక్తి ఎక్కడో ఉండేది కాదు అని అర్థమైతే, ఎప్పుడో లభించేది కాదు అని కూడా అర్థమై పోతుంది. ఒకప్పుడు ముక్తి లభిస్తుంది అంటే ముక్తి కాలగత మౌతుంది. కాలంలో ఏది ప్రాప్తించినా అది కాలంలో నశించి పోతుంది. ఒకవేళ ఈ కాలంలో లేని ముక్తి రాబోయే కాలంలో ప్రాప్తిస్తే, అది మరో కాలంలో లేకుండా పోతుంది. ఒక కాలంలో ఉండి మరొక కాలంలో లేనిది బంధం అవుతుందే గాని మోక్షం కాదు. నిత్యముక్తి కాదు. దీనినే శాస్త్రంలో **ప్రాప్య ముక్తి వాదము** అంటారు. 'ప్రాప్యముక్తి' అంటే లేనిది ప్రాప్తించడము అని అర్థము. ముక్తి అనేది లేనిది ప్రాప్తించడము కాదు. ఉన్నది ఉన్నట్లు తెలియడం. అదే నిత్యముక్తి.

ఉన్నది అంటే ఎప్పుడూ ఉండేది అని అర్థము. అదే 'అస్తి' శబ్దార్థము. అదే ఆత్మ. అదే బ్రహ్మము. ఆత్మయే బ్రహ్మము. ఇది తెలియడమే బ్రహ్మాత్మజ్ఞానము. ఆత్మ నిత్యము. నిత్యాత్మ తానే అని తెలుసుకున్న ఆత్మవిదుడూ నిత్యుడే. ముక్తుడే. నిత్యముక్తుడే.

కనుక, ఆత్మజ్ఞాని ఇంతవరకు లేని ముక్తిని క్రొత్తగా పొందేవాడు కాడు. తాను పొందే ఉన్నాడు. కాకపోతే, పొందే ఉన్నప్పటికి ఆత్మజ్ఞాని కాక ముందు ఆత్మ తానే అనే జ్ఞానం లేకుండా ఉన్నాడు. జ్ఞానం లేకపోవడమే అజ్ఞానము. ఆత్మజ్ఞానము వల్ల అజ్ఞానం నశించగా, తానే నిత్యాత్మ అనే జ్ఞానంతో శోభిస్తాడు. అదే నిత్యముక్తి. జ్ఞానం కలగక ముందు కూడా ముక్తి ఉంది. జ్ఞానం కలిగిన తరువాత అలా ఉన్నట్లు తెలిసింది. అంతే.

***సద్యోముక్తి కారణం ఆత్మజ్ఞానం*** అని ఆచార్యుల వారు బ్రహ్మసూత్ర భాష్యంలో చెబుతారు. దాని అర్థం ఆత్మజ్ఞానం కారణము, ముక్తి కార్యము అని కాదు. ఆత్మజ్ఞానం ఆత్మ అజ్ఞానాన్ని పోగొడుతుంది. అంతే. అది జరిగితే, తాను ఆత్మ అనే జ్ఞానాన్ని పొందిన ఆత్మవిదుడు మోక్షరూపుడై శోభిస్తాడు. జ్ఞానం ఎప్పుడైనా కలుగవచ్చు. ఎక్కడైనా కలుగవచ్చు. అయితే అదేదో ఇక్కడే కలుగవచ్చు ***(ఇహైవ).*** ఇప్పుడే కలుగవచ్చు ***(అద్యైవ).*** కనుక సమమైన బ్రహ్మము నందు, అనగా సామ్యస్థితి యందు ఎవరి మనస్సు స్థిరంగా ఉంటుందో ***(యేషాం మనః సామ్యేస్థితం)*** వారి చేత ***(తైః)*** జనన మరణ రూప సంసారము ***(సర్గః జననమరణ రూప సంసారః)*** ఇక్కడే జయింప బడుతుంది ***(ఇహైవ జితః).*** అదే ముక్తి. అదే మోక్షము. అదే జీవన్ముక్తి. జీవించి ఉండగానే ముక్తి. అజ్ఞానం నశిస్తే చాలు బ్రతికి ఉన్నవాడే బ్రహ్మ అవుతాడు. దేహ పతనం వరకు వేచి ఉండాల్సిన అవసరం లేదు ***(ఇహైవ, జీవద్భిః ....*** జీవించి ఉండగానే).

ఆత్మ యొక్క అఖండత్వానికి దేహము అవరోధము కాలేదు. ఆకాశము యొక్క విశాలత్వాన్ని ఘటం

పరిమితం చేస్తుందా? కుండ ఉపాధిగా ఉన్నందున కుండలో ఉండే ఆకాశాన్ని ఘటాకాశము అని పిలవవచ్చు. అంతమాత్రాన అనంతంగా ఉన్న ఆకాశము ఘటానికి పరిమితం అవుతుందా? ఘటము యొక్క పరిమితత్వము ఆకాశాన్ని పరిమితం చేయ గలుగుతుందా? ఉపాధిని తొలగిస్తే ఆకాశము ఏకమై, అఖండమై శోభిస్తుంది. అంటే, ఉపాధి నశించక ముందు ఆకాశము రెండుగా ఉండిందా? లేదు. ఉపాధి సహితమైనా, ఉపాధి రహితమైనా ఆకాశము ఆకాశమే. ఏకమే. ఉపాధి యొక్క గుణాలు ఆకాశాన్ని స్పృశించ లేవు. అలాగే దేహం ఉన్నా, దేహం పతన మైనా ఆత్మవిదునికి విశేష మేమీ లేదు. ఉపాధి గుణదోష సంబంధము ఆత్మకు లేదు. ఎందుకని? ఆత్మ నిర్దోషం కనుక ***(నిర్దోషం హి సమం బ్రహ్మ).***

**అసంగాత్మ**

బ్రహ్మము సమము అనగా ఏకము లేక అద్వితీయము *(సమం బ్రహ్మ ఏకం చ).* అద్వితీయము, అఖండము అయిన ఆత్మను కలుషితం చేసేందుకు రెండవ వస్తువు లేనందున బ్రహ్మము నిర్దోషము, అంటే దోష రహిత మైనది ***(నిర్దోషం దోష వర్జితం).***

దోషము రెండు విధాలుగా ఉంటుంది. సహజంగా తన లోనే దోష లక్షణం కలిగి ఉండటం మొదటిది. తాను దోష రహితంగా ఉన్నా, దోషం ఉన్న దానితో సంబంధం కలిగి ఉండటం చేత దోషయుతంగా మారడం రెండవది.

మురికినీరు కాలువలలో ప్రవహిస్తూ ఉంటుంది. క్రిమి సముదాయ సంకులమైన కాలువ నీరు సహజంగా దోషయుతము. కాని, గంగాజలము పవిత్రము. దోష రహితము. దోషము లేని గంగాజలము దోషయుత మైన మురికి నీటితో కలిసి నపుడు సహజంగా దోషరహిత మైన గంగోదకం దోషయుత మవుతుంది.

ఈ విధమైన రెండు దోషాలు బ్రహ్మములో లేవు. కనుక బ్రహ్మము నిర్దోషము. వైషమ్య దోష హేతువు లైన దేహాది ఉపాధుల యందు ఆత్మ ఉన్నది కనుక, మురికి నీటి దోషము గంగోదకానికి అంటినట్లు, ఉపాధిగత గుణదోషాల చేత ఆత్మ కూడా కలుషితమైంది అని అవివేకులు భావిస్తూ ఉంటారు.

ఆకాశము అంతటా ఉండినా, అన్నిటిలో ఉండినా, ఎలాగైతే దేనికీ అంటక, దేని చేత అంటబడక నిస్సంగంగా, నిర్లిప్తంగా ఉందో, అలాగే సర్వగత మైన బ్రహ్మము మిథ్యాభూతము లైన ప్రపంచాదుల చేత అంటబడదు.

మురికి కాలువ లోను, గంగా ప్రవాహం లోను సూర్యుడు ప్రతిబింబిస్తాడు కదా! అంతమాత్రాన వాటి గుణ దోషాలు ఆదిత్యునికి అంటుతాయా? బ్రహ్మము కూడా అంతే. ***అసంగోఽ హ్యయం పురుషః*** ఆత్మ దేని చేతను అంటబడదు అని శ్రుతి ప్రమాణము.

కనుక, విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని యందు, కుక్క మాంసాన్ని వండుకొని తినే చండాలుని యందు ప్రకాశించేది ఒకే ఆత్మ అయినా అసంగమైన ఆత్మ ఆకాశము లాగా, ఆదిత్యుని లాగా నిర్లిప్తంగా ఉంటుంది. సమంగా ఉంటుంది. **సమో మశకేన సమో నాగేన** - అతి చిన్నదైన దోమ యందు, అతి పెద్దదైన ఏనుగు నందు ఒకే ఆత్మ ప్రకాశిస్తుంది. ఏనుగు దేహంలో ఏనుగు అంత ఆత్మ, దోమ దేహంలో దోమ అంత ఆత్మ ఉండదు. ఆత్మ నిర్వికారము. ఆకాశం లాగా నిరాకారము.

***చీమలో బ్రహ్మలో శివకేశవాదులలో***
***ప్రేమ మీర మెలగు చుండే - బిరుదు వహించిన***
***సీతారామా! నన్ను బ్రోవరావే మొకో? లోకాభి ॥ రామ ॥***





'పిపీలికాది బ్రహ్మ పర్యంతము, చీమ మొదలు బ్రహ్మ వరకు అందరిలో, అంతటా వ్యాపించిన ప్రేమమూర్తి వైన రామా! లోకాభిరామా! నన్ను రక్షించడానికి ఎందుకని నీవు రావడం లేదు?' అని సముడైన బ్రహ్మమును వినమ్రుడై ప్రార్థించాడు త్యాగరాజస్వామి.

సమమైన, నిర్దోష మైన బ్రహ్మము నందే ఉన్నారు కనుక ***(నిర్దోషం హి సమం బ్రహ్మ - తస్మాత్)*** సమదర్శులైన ఆత్మవిదులు ***(తే)*** బ్రహ్మము కన్నా వేరుగా లేరు. బ్రహ్మము నందే ఉన్నారు. బ్రహ్మము గానే ఉన్నారు ***(బ్రహ్మణి స్థితాః).***

*ఉపాధులలో భేదా లున్నా, ఉపాధిగత గుణదోషాలతో సంబంధం లేకుండా, అందరిలో, అంతటా ఏకమై భాసించే ఆత్మ యొక్క సమస్థితిని దర్శించే ఆత్మవిదుడు వైరుధ్యము కలిగిన పరిస్థితుల మధ్య ఎలా ప్రవర్తిస్తాడు? చెబుతున్నాడు.*

న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్ । 20
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః ॥

***న-ప్రహృష్యేత్-ప్రియం-ప్రాప్య-న-ఉద్విజేత్-ప్రాప్య-చ-అప్రియం***
***స్థిరబుద్ధిః-అసమ్మూఢః-బ్రహ్మవిత్-బ్రహ్మణి-స్థితః***

| | | | |
|---|---|---|---|
| స్థిరబుద్ధిః | = స్థిరబుద్ధి గలవాడు | ప్రహృష్యేత్ | = సంతసించుట |
| అసమ్మూఢః | = మోహ రహితుడు | న | = లేదు |
| బ్రహ్మవిత్ | = బ్రహ్మజ్ఞాని | అప్రియం | = అయిష్టమును |
| బ్రహ్మణి స్థితః | = బ్రహ్మము నందు ఉన్నవాడు | ప్రాప్య | = పొందినా |
| ప్రియం | = ఇష్టమును | న ఉద్విజేత్ | = శోకించడం లేదు |
| ప్రాప్య చ | = పొందినా | | |

**బ్రహ్మవిదుడు స్థిరబుద్ధి కలవాడు. మోహము లేనివాడు. బ్రహ్మము నందే నిలకడ కలవాడు. ప్రియ మైనది లభించిందని పొంగిపోడు. అప్రియ మైనది ప్రాప్తించిందని కృంగిపోడు.**

**వ్యాఖ్య**

**నీడలు - నిజాలు**

ప్రపంచం యొక్క విలువ మనిషి మనస్సులో ఎంతటి స్థానాన్ని ఆక్రమించి ఉందో, దానిని బట్టి ఆ వ్యక్తి యొక్క మనో వికాసాన్ని ఊహించుకోవచ్చు. ప్రపంచం మహోన్నతంగా గోచరిస్తూ ఉంది అంటే, మనిషి విలువ బాగా తగ్గిపోతూ ఉంది అని అర్థము. మనిషి బుద్ధిలో ప్రపంచం విశాలమై పోతూ ఉంది అంటే, వ్యక్తి అంతకంతకు కుంచుకు పోతున్నాడని భావం. అనిత్యమైన ప్రపంచము విలువ పెరుగుతూ ఉంది అంటే, నిత్యమైన మనిషి విలువ తరుగుతూ ఉంది అని అర్థం. అనాత్మ ప్రభావం అధికమై ప్రకాశించడం ప్రారంభించింది అంటే, నిత్యాత్మ మసకబారి పోతూ ఉంది అని గ్రహించాలి. బాహ్యంలో సౌందర్యం వెల్లి విరిసింది అంటే, ఆంతర్యం వికారంగా మారుతూ ఉందనేది స్పష్టం. ఎందుకో తెలుసా? జీవితం యొక్క అర్థం జీవిలో కాకుండా జగత్తు వైపు మరలి పోయింది. బ్రతుకుకు అర్థం ప్రపంచమై నపుడు వ్యక్తి విలువ ఎంత? బ్రతుకుకు పరమార్థ మెక్కడ? ఆత్మ అణగద్రొక్క బడింది. అనాత్మ అందల మెక్కింది. ఆత్మ బానిస సంకెళ్ళలో బంధింప బడింది.

నవ్వే శక్తి మనిషిలో హరించ బడింది. ప్రపంచం నవ్విస్తేనే మనిషి నవ్వే దుస్థితి ప్రాప్తించింది. ప్రతి అల్ప సుఖానికి ప్రపంచం వైపు దీనంగా చూడ వలసిన దుర్గతి మానవాళికి ఏర్పడింది. ప్రపంచం ఎప్పుడు నవ్వించింది గనుక? ఎప్పుడూ ఏడిపిస్తూనే ఉంటుంది. ***అనిత్యం, అసుఖం లోకం*** అన్నది గీతామాత. సుఖం లేని ఈ గారడీ ప్రపంచంలో ఎప్పుడైనా, ఎక్కడైనా సుఖం గోచరించింది అంటే, అది స్వల్పం గానో, అల్పం గానో ఉంటుంది. క్షణభంగురంగా ఉంటుంది.

ఇదంతా ప్రపంచం యొక్క శక్తి కాదు. మనిషి యొక్క అశక్తత. లోకం లోని బలం కాదు. వ్యక్తి లోని బలహీనత. స్థిరత లేని ప్రపంచానికి స్థిరత్వాన్ని ఆపాదించడం, అస్థిరత తెలియని జీవునికి అస్థిరత్వాన్ని ఆరోపించడం బుద్ధి లోని బలహీనతకు అద్దం పడుతుంది.

మనిషి అనుభవించే సుఖదుఃఖాలకు వాస్తవానికి ప్రపంచం కారణం కాకపోయినా, ప్రపంచం వల్లే అవి కలుగుతున్నా యని మనిషి భ్రమిస్తున్నాడు. ఈ భ్రాంతిజన్య అవివేకమే ప్రపంచానికి లేని శక్తిని ఆపాదిస్తూ ఉంది. ఇక్కడే వ్యక్తిపై ప్రపంచం పట్టు సాధించింది.

వాస్తవానికి ప్రపంచానికి అంతటి శక్తి లేదు. దుఃఖ వలయం లోకి మనిషిని అమాంతం తోసేసే టంతటి సామర్థ్యం కలిగింది కాదు ప్రపంచము. ప్రపంచంలో విషయాలే ఉన్నాయి. సన్నివేశాలే ఉన్నాయి.

ఒక పరిస్థితిని ఎదుర్కొనే విషయంలో మనిషి దుర్బలు డైతే, దాని అర్థం ప్రపంచం బలమైందని కాదు. మనిషి యొక్క దుర్బలత్వాన్ని ప్రపంచం యొక్క బలంగా పేర్కొనడం అవివేకం.

ఒక సమస్యను ఎదుర్కొనే శక్తి నాకు లేనపుడు నేను అశక్తుణ్ణి. సమస్యను చూచి నేను భయపడు తున్నాను. ఈ భయం కేవలం నాకు సంబంధించింది. సమస్యకు సంబంధించింది కాదు. భయం సమస్యకు సంబంధించింది అయితే, అదే సమస్య అందరికీ భయహేతువు కావాలి. ఇతరుల విషయం ప్రక్కన పెట్టినా, కనీసం నా విషయంలో చూచినా సర్వదా, సదా అది భయహేతువు గానే ఉండాలి. అలా కూడా కనిపించడం లేదు. ఒక సమయంలో ఏ పరిస్థితిని చూచి మనం భయపడతామో, అదే పరిస్థితిని మరొక సమయంలో నిర్భయంగా మనమే ఎదుర్కోవడం మన అందరి అనుభవంలో ఉంది. ఇంతకీ సమస్య ఎక్కడుంది? ప్రపంచంలో లేదు. మన లోనే ఉంది.

ప్రపంచం సమస్య అయితే, పరిష్కారం ప్రపంచంలో లభిస్తుంది. అలా కాకుండా, సమస్య కేవలం మనిషి మీద కేంద్రీకృతమై ఉండే టప్పుడు, పరిష్కారము వ్యక్తిగతమే గాని విశ్వగతం కాదు. ఇది తెలియడమే వివేకము! వివేకం కలిగితే దృష్టి మారుతూ ఉంది కనుక, ఇక ప్రపంచంలో సమస్య ఉత్పన్నం కాదు. ప్రపంచంలో లేని సమస్య ఉన్నట్లు గోచరించడానికి, ఉన్న దేమిటో, లేని దేమిటో గ్రహించే వివేకము లేకపోవడమే కారణం. వివేకము లేదు అంటే అవివేకము ఉంది అని అర్థము. అవివేకిగా ఉంటూ సమస్యను ఎలా అర్థం చేసుకోగలం? అవివేకంలో పరిష్కార మెలా ప్రాప్తిస్తుంది? అవివేకం లోనే సమస్య ఉద్భవించి నపుడు వివేకం లేకుండా దానిని ఎలా పరిష్కరించ గలం?

***సమస్యలు ప్రపంచానివి అయితే***
***నీ కెందుకు పరిష్కారాలు?***
***నీవే నీకు సమస్యగ మారితే***
***నీకు సమాధానం నీవే కదా!***





***ఆరాటాలు పోరాటా లెందుకు?***
***అవలోకించి శాంతించు***
***రామ రామ జయ రాజారామ్***
***రామ రామ జయ సీతారామ్***

అని రామజోగి చిట్కా.

వాస్తవాలు అర్థం కానపుడు వివేకం లోపిస్తుంది. వివేకం చెడి నపుడు బుద్ధిలో అస్థిరత చోటు చేసుకుంటుంది. స్థిరబుద్ధి ఉండదు.

స్థిర బుద్ధి లేనివాడు అజ్ఞాని. అజ్ఞాని మోహంలో మగ్నమై ఉంటాడు. లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు చూస్తాడు. సత్యాన్ని అసత్యంగా, అసత్యాన్ని సత్యంగా భావిస్తాడు. తూర్పు అనుకొని పడమర వైపు పయనిస్తూ ఉంటాడు. ఎండమావులలో దప్పిక తీర్చుకోవాలని తపిస్తూ ఉంటాడు.

స్థిరబుద్ధి కలవాడు జ్ఞాని. అజ్ఞాన మోహం నుండి విడిపడి జ్ఞాన ప్రకాశంలో శోభిస్తూ ఉంటాడు. ఉన్న దానిని ఉన్నట్లు చూస్తాడు. సత్యాన్ని సత్యంగా, అసత్యాన్ని అసత్యంగా అర్థం చేసుకుంటాడు. ఎండమావులలో జలం లేదని గ్రహించి ప్రయత్నం ఆపి ప్రశాంతంగా ఉంటాడు. అతడే బ్రహ్మవేత్త. బ్రహ్మము నందే స్థిరపడిన బ్రహ్మవేత్త ***(బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః).*** స్థిరమైన బుద్ధి కలవాడు, మోహము లేనివాడు అయిన బ్రహ్మవిదుడు ***(స్థిరబుద్ధిః అసంమూఢః)*** ప్రియమైనది లభించిందని సంతోషించడు ***(ప్రియం ప్రాప్యన ప్రహృష్యేత్).*** అప్రియ మైనది ప్రాప్తించిందని దుఃఖించడు ***(అప్రియం ప్రాప్య న ఉద్విజేత్).***

**ప్రియాప్రియాలు**

జీవితం సుఖదుఃఖాల సమ్మేళనం. హర్షవిషాదాల సంగమం. సుఖాన్ని మనిషి ఇష్ట పడతాడు. సుఖం మనిషికి ప్రియంగా ఉంటుంది. దుఃఖానికి మనిషి దూరంగా ఉంటాడు. దుఃఖాన్ని భరించలేక కష్ట పడతాడు. అందుకే దుఃఖం మనిషికి అనిష్టం గాను, అప్రియం గానూ ఉంటుంది.

సుఖదుఃఖాలు, హర్ష విషాదాలు అనేవి చాలా విచిత్ర మైనవి. వాస్తవం చెప్పాలంటే, ప్రపంచంలో ఏది సుఖం? ఏది దుఃఖం? అంటే ఎవ్వరూ చెప్పలేరు. లోకంలో సుఖదుఃఖాలు లేవు. మనం అన్వేషించేది సుఖాలను కాదు. సుఖ కారణాలను. అలాగే మనం తొలగించాలని ప్రయత్నించేది దుఃఖాలను కాదు, దుఃఖ కారణాలను. ఇంతకీ సుఖదుఃఖా లేమిటో ఎవ్వరికీ అంతు పట్టదు.

సుఖ కారణం మనకు ఇష్టంగా ఉంటుంది. ప్రియంగా ఉంటుంది. అలాగే దుఃఖ కారణం మనకు అనిష్టంగా ఉంటుంది. అప్రియంగా ఉంటుంది. ఈ సుఖదుఃఖ కారణాలు మనిషికి మనిషికి మారుతూ ఉంటాయి. ఒకరి సుఖానికి కారణమైంది మరొకరి సుఖానికి కారణ మవుతుందని చెప్పలేము. ఒకరి సుఖానికి ఏది కారణమో, అదే మరొకరి దుఃఖానికి కారణం కూడా కావచ్చు.

మనుషులు పొందే ఈ సుఖదుఃఖ అనుభవాల వెనుక ప్రియాప్రియాలు ఉంటాయి. ఎవరికి ఏది ప్రియమో అది ప్రాప్తిస్తే వారికి సుఖం కలుగుతుంది. అలాగే ఎవరికి ఏది అప్రియమో, అది దూరమైతే వారికి సుఖం కలుగుతుంది. సుఖదుఃఖాల అనుభవాలకు ప్రియాప్రియాలు నిమిత్తాలుగా ఉంటాయి.

**జ్ఞాని చలించడు**

ఇష్టమైన దానిని పొంది జ్ఞాని సంతోషించడు ***(న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య).*** అనిష్టమైన దానిని పొంది దుఃఖించడు ***(న ఉద్విజేత్ అప్రియం ప్రాప్య).*** ప్రాప్యాలలో సంతసించడం, అప్రాప్యాలలో ఆవేదన చెందడం

అనేది మనోధర్మము. సుఖదుఃఖా లనేవి మనస్సులో కలిగే భావవికారాలు. అనాత్మధర్మాలు. తనను ఆత్మగా, అకర్తగా తెలుసుకున్న ఆత్మవిదుడు సుఖాలలో పొంగడు. దుఃఖాలలో క్రుంగడు.

ఇష్ట మైనది ప్రియంగా ఉంటుంది. ఏది ఇష్టము అనే ప్రశ్న పడితే, దేని మీద ఇష్టతా బుద్ధి ఏర్పడుతుందో అది ఇష్ట వస్తువు. ఒక దానికి సంబంధించిన గుణ, క్రియ, విశేష, సంబంధాదులను గూర్చి తదేక చింతనం చేయడం వల్ల దాని యందు ఇష్టతా బుద్ధి ఏర్పడుతుంది. ఆ తరువాత దాని అనుభవము నందు రమ్యతా బుద్ధి ఏర్పడుతుంది. అట్టి దాని సన్నిధిలో ప్రహర్షము ఉత్కర్ష మవుతుంది.

ఆత్మజ్ఞాని తనలో తాను తృప్తి చెంది ఉన్న సర్వభూతాత్మ భూతాత్ముడు, సమదర్శి కావడం చేత, అనాత్మ సంబంధమైన పదార్థ విమర్శనము అనర్థదాయక మని తెలిసిన వాడు కావడం చేత, అనిత్య విషయాలను చింతించడు. చింతించని కారణంగా వాటి యందు ఇష్టత్వ బుద్ధి కలగదు. ఇష్టత్వ బుద్ధి లేనందున రమ్యతా బుద్ధి ఏర్పడదు. అలాంటి వాడికి ఏది ప్రియం? ప్రియమైనదే లేనపుడు దేనికి సంతోషిస్తాడు?

దేహాదులు ఆత్మ అని భావించే అవివేకికి ప్రియాప్రియాలు ఉంటాయి. ప్రియాప్రియాలు హేతువులుగా ఉంటాయి కనుక దేహమే ఆత్మ అని భావించే అవివేకికి హర్ష విషాదాలు తెలుస్తాయి. అంతేకాని, ఆత్మజ్ఞానం కలిగిన సమదర్శికి కాదు ***(దేహమాత్ర దర్శినాం హి ప్రియా ప్రియ ప్రాప్తీ, హర్షవిషాదస్థానే, న కేవలాత్మ దర్శినః).*** ఆత్మవిదునిలో ప్రియాప్రియాలే లేనందున హర్షవిషాదాలు సంభవించవు.

**ఆత్మే ప్రియము**

ఆత్మజ్ఞానం గల బ్రహ్మవిదునికి ప్రియమైనదే ఉండదా? అంటే అతడు సంతోషానికే నోచుకోడా? ఆనందమే లేనివాడా? అనే సందేహాలు కలుగుతాయి. ఆత్మవిదునికి కూడా ప్రియమైనది ఉంది. అది ఒక్కటే. అదే ఆత్మ. ఆత్మలు అనేకము కావు కనుక, అతనికి ప్రియాలు లేవు. ప్రియమే ఉంది. అప్రియాలు అసలే లేవు. ఆత్మ కన్నా అన్యమైనది లేదు అనే స్థిరప్రజ్ఞ గల సమదర్శికి అప్రియ మైనది ఉండే అవకాశమే లేదు. కనుక జ్ఞాని యొక్క స్థితిలో ప్రియాప్రియాలు అసంభవాలు ***(తస్య ప్రియా ప్రియ ప్రాప్తి అసంభవాత్).*** ఒకవేళ ఆత్మవిదునికి ప్రియ వస్తువు ఏదైనా ఉన్నట్లు గోచరించినా, అది ఆత్మ కారణంగా ప్రియమే గాని మరో విధంగా కాదు.

***న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి! ఆత్మావా అరె ద్రష్టవ్యః శ్రోతవ్యః మన్తవ్యః నిదిధ్యాసితవ్యః !***

'మైత్రేయీ! సమస్తములో ఏదైనను దాని ప్రయోజన నిమిత్తము అది ప్రియంగా ఉండటం లేదు. సమస్తము ఆత్మ కొరకే ప్రియంగా ఉంది. ఆత్మయే దర్శింప దగినది. ఆత్మయే వినదగినది. ఆత్మయే ఆలోచింప దగినది. ఆత్మయే ధ్యానింప దగినది' అని యాజ్ఞవల్క్యమహర్షి బృహదారణ్య కోపనిషత్తులో తన భార్య మైత్రేయికి ఈ విధంగా ఆత్మబోధ చేశాడు.

కనుక బ్రహ్మవిదునికి ప్రియాప్రియాలు గాని, తజ్జనిత హర్షవిషాదాలు గాని ఏర్పడే అవకాశమే లేదు. బ్రహ్మము నందే స్థిరంగా ఉన్న బ్రహ్మవిదుని బుద్ధి స్థిరమైనది ***(స్థిరబుద్ధిః ఆత్మా ఇతి స్థిరా నిర్విచికిత్సా బుద్ధిః యస్య సః స్థిరబుద్ధిః).*** అద్వితీయాత్మ తానే అనే స్థిరబుద్ధి కలవాడు. ఈ విషయంలో ఎలాంటి సంశయము లేని బుద్ధి కావడం చేత ఆత్మవిదుని యొక్క స్థిరబుద్ధిని నిర్విచికిత్సా బుద్ధిః అన్నారు శ్రీ శంకరులు.

స్థిరబుద్ధి గల ఆత్మజ్ఞాని మోహము లేనివాడు. మూఢత్వము లేని వాడు ***(అసంమూఢః సంమోహ వర్జితః).*** సంమూఢుడు అంటే విపరీతముగా గ్రహించేవాడు అని అర్థము. విపరీతగ్రాహి కానివాడు





అసంమూఢుడు. అతడే స్థిరబుద్ధి గలవాడు. ప్రియాప్రియాలు లేని వాడు. అవి హేతువులుగా గల సుఖదుఃఖాలు తెలియని వాడు. సర్వ వాసనాక్షయం జరిగి పోయినవాడు. సర్వకామ లయం పొందినవాడు. ప్రియాప్రియాల కారణంగా ప్రాప్తించే సుఖదుఃఖాలు అనిత్యాలు. అవి వచ్చిపోతూ ఉంటాయి. కాని, ఆత్మ ప్రియత్వం కారణంగా ప్రాప్తించే ఆనందం నిత్యమై ఉంటుంది. అదే ఆత్మానందము. ***రసగ్ హ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి! -*** ఆత్మానందము చేత సంతుష్టుడైన ఆత్మవిదుడు ఆనందస్వరూపు డగుచున్నాడు అన్నది ఉపనిషత్తు.

చివరగా, ప్రస్తుత శ్లోకంలో అర్థం చేసుకోవలసిన విషయం ఒకటుంది. **ప్రహృష్యేత్, ఉద్విజేత్** అనేవి విధిని సూచించే లిఙ్ప్రత్యయములు. అంటే ప్రియము ప్రాప్తించి నపుడు సంతసించ కూడదు. అప్రియము ప్రాప్తించి నపుడు దుఃఖించ కూడదు అనే విధి సూచకం ఉంది. కనుక ఇది సాధకుని ఉద్దేశించి చేసిన బోధ అని కొందరు గ్రహిస్తారు. కాని, సందర్భాన్ని బట్టి చూస్తే, ఇక్కడ ఆత్మజ్ఞాని విషయమే గాని, సాధకుని ప్రస్తావన లేదు. **ప్రహృష్యేత్** అని శ్లోకంలో ఉన్నా, దానిని **ప్రహృష్యతి** అనే గ్రహించాలి. కాకపోతే, ఏవైతే జ్ఞానికి సహజ లక్షణాలుగా శోభిస్తూ ఉంటాయో, వాటిని ప్రయత్న పూర్వకంగా సాధకుడు సాధించాలి అని తెలియ చేయడానికే అలా ప్రత్యయ ప్రయోగం జరిగింది అని శ్రీ మధుసూదన సరస్వతి సమన్వయించడం కూడా సముచితం గానే ఉంది.

*ఆత్మజ్ఞానులు పొందే నిత్య సుఖాన్ని కూడా వివరిస్తున్నాడు.*

**బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్ద త్యాత్మని య త్సుఖమ్ ।** 21
**స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే ॥**

**బాహ్యస్పర్శేషు-అసక్తాత్మా-విందతి-ఆత్మని-యత్-సుఖం**
**సః-బ్రహ్మ-యోగయుక్తాత్మా-సుఖం-అక్షయం-అశ్నుతే**

| | | | | | |
|---|---|---|---|---|---|
| బాహ్యస్పర్శేషు | = | బాహ్య విషయము లందు | సః | = | వాడు |
| అసక్తాత్మా | = | అనాసక్తుడు | బ్రహ్మ యోగయుక్తాత్మా | = | బ్రహ్మయోగము నందు కూడిన వాడై |
| ఆత్మని | = | ఆత్మ యందు | | | |
| యత్ | = | ఎట్టి | అక్షయం | = | నాశము లేని |
| సుఖం | = | సుఖమును | సుఖం | = | శాంతిని |
| విందతి | = | పొందునో | అశ్నుతే | = | పొందుతాడు |

**బ్రహ్మవిదుడు ప్రాపంచిక విషయాల యందు ఆసక్తి లేకుండా ఉంటాడు. ఆత్మ యందున్న సుఖాన్ని పొందుతాడు. అది అక్షయమైన ఆనందము.**

**వ్యాఖ్య**

**సుఖ స్థానము**

సుఖప్రాప్తికి అనుక్షణం ప్రయత్నిస్తూ, పరితపిస్తూ, పోరాడుతూ మనిషి జీవన యాత్రను సాగిస్తున్నాడు. సుఖించడానికి అనుకూల పరిస్థితుల్ని , కీర్తి ప్రతిష్ఠల్ని, ఆరోగ్య ఐశ్వర్యాలను ప్రోగు చేసుకుంటున్నాడు. సుఖప్రాప్తికి మనిషి యత్నించడంలో దోషం లేదు. పైగా అది ప్రశంసనీయం కూడా. కాకపోతే, తాను ఆశించే సుఖాన్ని పొందడానికి మనిషి అనుసరించే విధానమే లోపభూయిష్టంగా ఉంది. దోషపూరితంగా ఉంది. అర్థరహితంగా ఉంది. నిరాశా జనకం గానూ ఉంది. ఇదంతా ఊహ కాదు. ప్రయోగజనిత ఫలమూ కాదు. ప్రతి నిత్యము మన అనుభవాలు ప్రతిబింబించే వాస్తవ చిత్రము.

వస్తు ప్రపంచం మన అనుభవంలో ఉన్నదే. సుఖాలను ఆశించి బాహ్యంలో వస్తువుల వెంట బడి పరుగులు తీయడం మనకు క్రొత్తేమీ కాదు. విషయ వాంఛలు మనకు తెలియనివి కావు. విషయానుభవాలు మనం చూడనివి కావు.

ఒక వస్తువును ఆశించినా, ఒక విషయానుభవాన్ని మనస్సు అభిలషించినా, దానిని పొందడం వల్ల జీవితంలో ఏదో జరిగి పోతుంది అనే భ్రాంతిలో మనం ఉన్నాము. ఎన్ని గుణపాఠాలు అందుతున్నా, ప్రతి అనుభవాన్ని మహోన్నతంగా ఊహించుకోవడం మనకు అలవాటుగా, ఆసక్తిగా మారింది. ఎప్పటి కప్పుడు ప్రతి భోగాన్ని నిత్యంగా భావించుకుంటూ మోసపోతున్నాం. మన వాంఛలే మనకు ఉరిత్రాళ్ళు అవుతున్నాయి. వస్తు ప్రపంచంపై మన కున్న ప్రేమ మన బ్రతుకునే పాషాణంగా మార్చేస్తుంది.

బాహ్యంలో మనం ఏది పొందినా, ఏ పొందును అనుభవించినా, తజ్జనిత సుఖం భోగ్య వస్తువు నుండి ఉత్పన్న మైనది కాదు. దానిని పొందాలి అని భావించడం వల్ల మన బుద్ధి కొలనులో కదిలిన తరంగాలు, దానిని పొంది నపుడు ఉపశమిస్తున్నాయి. మనలో అంతవరకు ఉన్న అలజడి అదృశ్యమై మనస్సు ఉపశాంతిని పొందుతూ ఉంది. ఈ ఉపశాంతి బాహ్య విషయ సంబంధ జనిత సుఖమని మనం భ్రమిస్తున్నాము. సుఖ మనేది బాహ్యంలో ఉండేది కాదని, ఆంతర్యం లోనే ఉన్నదని గుర్తించలేక పోతున్నాము. గ్రహించలేక పోతున్నాము. అలా గ్రహించ గలిగిన క్షణాన బాహ్య విషయాల యందు అరుచి జనిస్తుంది. ఆసక్తి నశిస్తుంది. ఇంతవరకు విషయాల యందు సుఖాన్ని అన్వేషించిన వ్యక్తి, ఆ నిరర్థక ప్రయత్నానికి స్వస్తి పలికి, తన ఆంతర్యం లోనే సుఖాన్ని పొందేందుకు ప్రయత్నిస్తాడు. పొంది తృప్తి చెందుతాడు.

అక్షయ సుఖ మనేది ఎక్కడుంది? అది దేనికి సంబంధించింది? ప్రపంచానికి సంబంధించిందా? అక్షయ సుఖ మనేది ప్రపంచంలో ఉందా? ప్రపంచము క్షయశీల మని మనకు తెలుసు కదా! క్షయ మయ్యే ప్రపంచం అక్షయ సుఖాన్ని ఎలా అందిస్తుంది?

ప్రపంచంలో అక్షయ సుఖం ఉందనే అనుకుందాం. ప్రపంచం వ్యక్తులతో, వస్తువులతో, విషయాలతో నిండి ఉంది కదా! ఇంతకీ ఆ సుఖం ఏ వస్తువులో ఉంది? ఏ వస్తువులో ఉందని చెప్పినా, మరొక వస్తువులో లేదని చెప్పినట్లే కదా! అలాంటప్పుడు అది అక్షయ మెలా అవుతుంది?

ఒక వస్తువులో సుఖం అక్షయంగా ఉంది అన్నప్పుడు, అక్షయ సుఖాన్ని కలిగిన ఆ వస్తువు ఎక్కడుంది అని ప్రశ్నిస్తే, ఫలానా చోట ఉందని చెప్పాలి కదా! అలా ఒక ప్రదేశములో ఉండి, మరొక ప్రదేశములో లేని వస్తువు ఏదైనా పరిమితమే కదా! పరిమితమైంది ఏదైనా క్షయమే కదా! మరి, క్షయమయ్యే వస్తువు అక్షయ సుఖాన్ని ఎలా అందిస్తుంది? అందుచేతనే ఒకరికి సుఖాన్ని పంచిన వస్తువు మరొకరికి సుఖాన్ని పంచలేక పోతోంది. పైపెచ్చు కొందరికి దుఃఖాన్ని కూడా పంచుతూ ఉంది. కనుక, ఏ వస్తువును కూడా సుఖము అని అనడానికి అవకాశము లేదు.

ప్రపంచంలో వస్తువులు ఉన్నట్లే, విషయాలు, సన్నివేశాలు కూడా ఉన్నాయి. వస్తువులు ఎలాగైతే పరిమితాలై క్షయ మౌతున్నాయో, అలాగే విషయాలు, సన్నివేశాలు కూడా మారుతూ నశించి పోతున్నాయి. నశించేవి ఏవీ అక్షయ సుఖాన్ని ప్రసాదించ లేవు. కనుక అక్షయ సుఖ మనేది ప్రపంచానికి సంబంధించింది మాత్రం కానే కాదు. అది ప్రపంచంలో లేనే లేదు. లేని దానిని, ఉన్నా ఒకనాడు లేకుండా పోయే దానిని ఉన్నట్లు భ్రమిస్తే అది లేకుండా పోయిన నాడు చేసిన పొరపాటుకు, అది సృష్టించిన ఎడబాటుకు యెదను బాధలతో పిండుకోవడమే జరుగుతుంది. కన్నీళ్ళు నింపుకోవడమే మిగులుతుంది.





**చరణము: పొరపాటులు ఎడబాటులు**
**ఎద బాధలు విధియేనా?**
**అశ్రులు నిండిన అనుభవ ధనమే**
**మనిషికి మిగిలిన నిధియేనా?**
**పల్లవి: జీవిత మింతేనా?**
**సుఖదుఃఖాల సమరాంగణ మేనా? ॥ జీవిత ॥**

అని పరిణామ శీలమైన ప్రపంచ సుఖాల లోని పరితాపాన్ని కాగడా పట్టి చూపించింది చైతన్య గీతం.

అక్షయ సుఖం ప్రపంచంలో లేదని తేలి పోయింది. మరెక్కడుంది? బాహ్యంలో లేదు కనుక ఆంతర్యంలో ఉండాలి. మహిలో లేని మహిమ మనిషి లోనే ఉండాలి. మనిషిలో అంటే ఎక్కడ? మనస్సులో అని భావమా? అదే నిజమైతే, మనస్సు ఉంది కనుక అక్షయ సుఖం కూడా ఉండాలి. అక్షయ సుఖాన్ని కలిగిన మనస్సు మనలో ఉన్నంత వరకు దుఃఖం తెలియకుండా ఉండాలి. మరి మనకు దుఃఖం ఉందా, లేదా? ఉంది. దుఃఖం ఉంది అని తెలిసిం దెవరికి? మనస్సుకే. అంటే దుఃఖం ఎక్కడుంది? మనస్సు లోనే. మరి, మనస్సులో సుఖం అక్షయంగా ఉండే టప్పుడు దుఃఖం ఎలా ఉంటుంది? మనస్సులో దుఃఖం లేనపుడు దుఃఖము నుండి విడి పడాలని మనస్సు ఎందుకు కోరుకుంటుంది? అక్షయ సుఖం అనేది వెలుపల ప్రపంచంలో లభించినా, లోపల మనస్సులో ప్రాప్తించినా, బుద్ధి ఈ రెండిటిలో ఏదో ఒకచోట స్థిమిత పడుతుందే గాని, పరమేశ్వరుని వైపు చూడనే చూడదు. కానీ చూస్తూ ఉంది. ఏ మనసైనా నిత్య సుఖాన్ని, పరమశాంతినే వాంఛిస్తూ ఉంది కనుక అట్టి సుఖము లేదా శాంతి మహిలో గాని, మనస్సులో గాని లభ్యమయ్యేది కాదని, పరమాత్మ యందే ప్రాప్తిస్తుందని దీనిని బట్టి స్పష్ట మవుతూ ఉంది.

**విసిగి పోయాను విని విని జగతి గోడు**
**నిన్ను చేరాలని నా మనస్సు జగడ మాడు**
**అడుగుతున్నాను అడుగైన వేయలేక**
**నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!**

అని చైతన్యుని నీలకంఠ శతకములో ఒక విబూది పండు.

అక్షయ సుఖం ప్రపంచంలో లేదు కనుక, ప్రపంచం ఎలా ఉన్నా నీకు నష్టం లేదు. అలాగే మనస్సులో కూడా లేదు అని అర్థం చేసుకున్నాం కనుక, మనస్సు ఎలా ఉన్నా నీకు కష్టం రాదు. ప్రపంచం ఎలా ఉన్నా, ఎలా లేకపోయినా, మనస్సు మారుతున్నా, మారలేక పోయినా వాటి ప్రభావం నీ మీద లేనే లేదు.

నీవే ఆనందం. నీవే సుఖం. నీ స్వరూపమే నిత్యానందం. అదే అక్షయ సుఖం. ప్రపంచంలో అక్కడక్కడ సుఖ లేశాలు కనిపించినా, మనస్సులో అప్పుడప్పుడు ఆనంద క్షణాలు అగుపించినా, అవన్నీ నీ వనే నిత్య సుఖాంబుధిలో ఎగసి పడే ఆనంద కెరటాలు మాత్రమే. ఇది అర్థమైతే, నీవు సదా అక్షయ సుఖానుభూతి లోనే ఓలలాడుతూ ఉంటావు.

**వెతక నేల బయట వెలుగు లేదు**
**అంతరంగాన ఉన్నది నిత్యకాంతి**
**వటపత్రశాయివై దారి చూపినావు**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చైతన్యుని చిన్నికృష్ణ శతకములో ఒక వెన్నముద్ద.

**సాత్త్విక సుఖము**

ఇంద్రియాలు ఇంద్రియ విషయాలతో సంయోగమును కలిగి యుండుటను 'స్పర్శలు' అంటారు. అంటే, ఇంద్రియాల చేత స్పృశింపబడే శబ్దాది విషయాలు 'స్పర్శలు'. కళ్ళు రంగులను రూపాలను, చెవులు శబ్దాలను, ముక్కు వాసనలను, నాలుక రుచులను, చర్మము తాకిడిని స్పృశిస్తూ ఉండగా, తత్సంబంధమైన అనుభవాలను మనస్సు పొందుతూ ఉంటుంది. ఈ విధమైన శబ్దాది విషయాల యందు నిరాసక్తు డైన వాడు, అనగా విషయాల యందు సక్తం కాని మనస్సు గలవాడు ***(బాహ్య స్పర్శేషు అసక్తః ఆత్మా అంతఃకరణం యస్య సః అయం అసక్తాత్మా),*** బాహ్య విషయాల యందు ప్రీతి లేనివాడు తన యందే ఉన్న సుఖాన్ని పొందుతున్నాడు.

బాహ్యంలో ఒక వస్తువును, లేదా విషయాన్ని ప్రగాఢంగా వాంఛించిన వాడు దానిని పొందగానే, ఆ ప్రత్యేకమైన కోరిక నుండి తాత్కాలికంగా విడిపోతున్నాడు. అంతవరకు ఏ రజోగుణ ప్రవృత్తి చిత్తాన్ని చలింప చేసిందో, కోరిక తీరడం వల్ల ఆ సమయానికి అది పలచబడి మనస్సు అంతర్ముఖ మవుతుంది. దాని ఫలితంగా మనస్సులో సత్త్వశుద్ధి ఏర్పడుతుంది. అది జరిగిన క్షణంలో విస్మయాన్ని చిందిస్తూ ఆత్మ బుద్ధిలో ప్రతిఫలిస్తుంది. ఇక్కడ, మనిషి ఒక విధమైన సాత్త్విక సుఖాన్ని అనుభవిస్తాడు.

విషయ సుఖాలు అనేవి బాహ్యం లోని వస్తువుల నుండి కలుగు తున్నాయి అని మనం భ్రమిస్తున్నాం. కాని ఇక్కడ బాహ్య వస్తువుల నుండి సుఖాన్ని మనస్సు లోకి కూరడం జరగడం లేదు. ఆత్మ సుఖమే ఆంతర్యం నుండి ఊరడం జరుగుతూ ఉంది. అజ్ఞాన వశుడైన జీవుడు ఈ సత్యాన్ని గ్రహించ లేక, బొటన వ్రేలు నుండి పాలు వస్తున్నాయని భ్రమించి పిల్లలు బొటన వ్రేలును చప్పరించి నట్లు ***(లాలాపానం ఇవ అంగుష్ఠే బాలానాం క్షీర విభ్రమః),*** విషయసుఖాలు విషయాల నుండి వస్తున్నాయని భ్రమించి వాటి చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాడు. కాని వాస్తవాన్ని గ్రహించిన జ్ఞాని, విషయాల యందు అనాసక్తు డవుతాడు. తృష్ణా రహితు డవుతాడు. విరక్తు డవుతాడు. ఈ విరక్తి వివేక జనిత ఫలం. బాహ్య విషయముల యందు అపేక్ష క్షీణించ గానే బుద్ధిలో ఉపశమనం కలుగుతుంది. ఇదే సాత్త్విక సుఖము. చిత్త ప్రశాంతత. ఇదే కర్మయోగి అనుభవించే ప్రసాద చిత్తము. ఇది సాధారణమైన సుఖం కాదు. ఇది ఈ లోకంలో లభించే సుఖం కాదు. అటు స్వర్గంలో ప్రాప్తించే సుఖం కూడా కాదు. వాస్తవంగా చెప్పాలంటే, ఆ ఇహపర సుఖాలు, అంతర్ముఖమైన చిత్తము పొందే సుఖంలో పదహారవ వంతు కూడా ఉండవు అన్నది మహాభారతము.

***యచ్చ కామ సుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్***
***తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్ ॥***

లోకంలో ఏ కామ సుఖం ఉందో, స్వర్గములో ఏ గొప్ప సుఖం ఉందో, ఆ రెండు కూడా, ఉపశమించిన బుద్ధిలో కలిగే సుఖంలో పదహారవ వంతు కూడా ఉండవు అని మహాభారతము స్పష్టం చేసింది.

**అక్షయ సుఖం**

ప్రపంచంలో విషయసుఖాల వెంటబడి పరుగులెత్తి, వాటి అనుభవంలో అలసి ఊరట చెందే సుఖము ప్రవృత్తి రూప సుఖము. సమస్త వ్యాపారాల నుండి మనస్సును మరలించి, బుద్ధిలో మనస్సును విలీనం చేసి నిద్రించడం వల్ల కలిగే తామస సుఖము నివృత్తి రూప సుఖము. ఈ రెండూ కాకుండా, ఆత్మసుఖము ఏదయితే ఉందో అది అక్షయ సుఖము. అది అనుభవ జనితం కాదు. స్వరూపానుభూతి. ఆ అక్షయ సుఖాన్ని బ్రహ్మయోగ యుక్తాత్ముడు మాత్రమే పొందుతాడు. అది స్వరూపానందము. విషయాల నుండి అనాసక్తితో విరమించిన మనస్సు ఉపశమించిన దశలో పొందే సాత్త్వికసుఖం కూడా కాదు.





'ఆత్మయే బ్రహ్మము' అని తెలియడము బ్రహ్మయోగము. అట్టి యోగముతో, అనగా తానే బ్రహ్మము అనే యోగంతో కూడిన వాడు బ్రహ్మయోగ యుక్తాత్ముడు. అతడే అక్షయ సుఖాన్ని పొందుతాడు ***(సుఖమ్ అక్షయం అశ్నుతే).***

*విషయ భోగాల నుండి సాధకుడు తన మనస్సును మరలించి తీరాలి. దానికి మరో హేతువును అందిస్తున్నాడు భగవంతుడు.*

**యే హి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥** 22

***యే-హి-సంస్పర్శజాః-భోగాః-దుఃఖయోనయః-ఏవ-తే***
***ఆద్యంతవంతః-కౌంతేయ-న-తేషు-రమతే-బుధః***

| | | | |
|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా! | దుఃఖయోనయః ఏవ | = దుఃఖహేతువులే |
| సంస్పర్శజాః | = విషయేంద్రియ సంయోగము వలన కలిగే | ఆద్యంతవంతః | = ఆద్యంతాలు గలవి |
| భోగాః | = భోగములు | తేషు | = వాని యందు |
| యే | = ఏవి కలవో | బుధః | = పండితుడు |
| తే | = అవి | న రమతే హి | = రమించడు గదా! |

**కుంతీ కుమారా! ఇంద్రియాలు విషయాలతో కలసి నపుడు కలిగే భోగాలు దుఃఖ హేతువులు. వాటికి ఆద్యంతా లున్నాయి. కనుకనే పండితుడు వాటి యందు రమించడు.**

**వ్యాఖ్య**

మన దేహం లోని ఇంద్రియాలకు, బాహ్యం లోని విషయాలకు గల పరస్పర సంయోగాలే స్పర్శలు. ఈ స్పర్శల వలన భోగానుభవం మనిషికి కలుగుతుంది. భోగానుభవంలో మనిషి సుఖానుభూతిని పొందుతాడు. కనుక విషయ సుఖానుభూతి భోగానుభవము మీద, భోగానుభవం భోగాసక్తి మీద ఆధారపడి ఉన్నాయి.

'అతనికి ఆ విషయము నందు ఆసక్తి లేదు. రాగము లేదు. అందుచేతనే దాని నుండి అతడు సుఖానుభవమును పొందుతున్నాడు' అని ఎవరైనా అనడం మీరు విన్నారా? మొదట మనస్సులో భోగానుభవ జనిత సుఖస్మరణం జరుగుతుంది. దాని వల్ల రాగం ఉదయిస్తుంది. దేనిపై రాగముందో, దానిని ప్రయత్నించి పొందినపుడు విషయ ప్రాప్తి చేత, విషయ భోగం వల్ల, సుఖం ప్రాప్తిస్తుంది. ఇహంలో నైనా పరంలో నైనా సుఖాలు ఇలాగే ఉంటాయి. ఇవే ఇహపర సుఖభోగాలు.

భోగాలు ఏవైనా సంస్పర్శజాలే ***(సంస్పర్శజాః విషయేంద్రియ సంస్పర్శేభ్యః జాతాః).*** ఇంద్రియాలు ఇంద్రియ విషయాలతో చక్కగా కలిసి పోవడము 'సంస్పర్శ'. అట్టి సంస్పర్శల వలన పుట్టినవే భోగాలు. ఇక్కడే ఉంది అర్థం చేసుకోవలసిన విషయమంతా. పుట్టినవి ***(జాతాః)*** అని ఎప్పుడైతే అనడం జరిగిందో, పుట్టేవి ఏవయినా గిట్టేవే అనే న్యాయానుసారం అవి అనిత్యాలు ***(అనిత్యాః)*** అని తేలిపోయింది.

అనిత్యాలు అని తెలియడం చేతనే వీటి యందు అరుచి ఏర్పడి, ఆసక్తి లేనివాడై, ముముక్షువు ***(బాహ్య స్పర్శేషు అసక్తాత్మా)*** ఆత్మ యందే ఆనందాన్ని పొందినట్లు గడచిన శ్లోకంలో చూశాం. కాని, ఇక్కడ ఒక్క విషయం మెలిక పడుతూ ఉంది.

బాహ్య విషయాల యందు అనాసక్తి ఏర్పడితే ఆత్మ సుఖానుభవం కలుగుతుందా? లేక, ఆత్మ సుఖానుభవం ఉంటే బాహ్య రుచిని త్యజించడం సంభవిస్తుందా? ఇదెలా ఉందంటే, పెళ్ళైతే పిచ్చి

కుదురుతుందా? లేక పిచ్చి కుదిరితే పెళ్ళౌతుందా? అన్నట్లుంది. అన్యోన్యాశ్రయ దోషప్రాప్తి సంభవించే ప్రమాద ముంది. ఈ సంశయాన్ని పరిహరిస్తూ, బాహ్య విషయాసక్తిని త్యజించడానికి విషయాల యందలి దోషానికి సంబంధించిన జ్ఞానమే ముఖ్య కారణము అంటూ ఈ శ్లోకాన్ని భగవానుడు ప్రారంభిస్తున్నాడు.

**విషయభోగాలు దుఃఖహేతువులు**

భోగాలలో సుఖం లేకపోతే వాటితో సంబంధాన్ని ఎవ్వరూ ఏర్పరచుకోరు. అదే సంయోగము లేక సంస్పర్శము. సంయోగము ఉంటేనే భోగాలు కలుగుతాయి. అవి ఏ భోగాలైనా, సంయోగము వల్లనే భోగ సుఖాన్ని అనుభవించడం జరుగుతూ ఉంది కనుక, సంయోగము ఏదైనా వియోగాంతమే కాబట్టి, సంబంధం నశిస్తే సుఖం నశిస్తుంది. దుఃఖం ప్రాప్తిస్తుంది. ఈ విషయ ప్రపంచంలో సంస్పర్శజాల వలన కలిగే ఏ సుఖమైనా తన గర్భంలో దుఃఖాన్నే నింపుకొని వస్తుంది. కనుకనే భోగాలన్నీ దుఃఖయోనులు, దుఃఖహేతువులు, దుఃఖానికి జన్మస్థానాలు అంటున్నాడు భగవంతుడు ***(భోగాః భుక్తయః దుఃఖ యోనయః).***

***లోక ఏష విషయాను రంజనం దుఃఖ గర్భమపి మన్యతే సుఖమ్ ।***
***అమిషం బడిశ గర్భమ ప్యహో మోహతో గ్రసతి యద్వ దణ్డజః ॥***

గాలమును కడుపులో దాచుకొనిన మాంసఖండమును మోహము చేత చేప ఎలా మ్రింగుతూ ఉందో, అలాగే దుఃఖాన్ని గర్భంలో దాచుకున్న విషయ సుఖాలను అజ్ఞానము చేత ఈ లోకం అనుభవిస్తూ ఉంది.

విషయాలలో సుఖం ఉందా? ఉందనే అనిపిస్తుంది. లేకుంటే ఎలా అనుభవిస్తారు? ఉందనే అనుకుందాం. నేడు విషయానుభవంలో సుఖం కలుగుతూ ఉంది అనేది వాస్తవమైతే, ఈ విషయభోగము రేపు కూడా సుఖాన్నే పంచాలి కదా? మరి నేడు కలిగిన సుఖం రేపు కలగటం లేదు ఎందుకని? మొన్న కలిగిన సుఖం నేడు కలగటం లేదు ఎందుకని? కలిగేట ట్లయితే బ్రతుకులో మార్పుల కొరకు ఆరాటా లెందుకుంటాయి? వివాహాలు విడాకులకు ఎందుకు దారి తీస్తాయి?

విషయ సుఖాలు అనిత్యాలే కాదు. అనేక విషయాలు అనుకూలించి నపుడే కలుగుతాయి. కనుక ఎక్కువ శాతం అవి దుఃఖాన్నే కలిగిస్తూ ఉంటాయి. ఈ సుఖ భోగాలు సంస్పర్శజాలు కనుక, మొదట విషయము, అనగా అనుభవింపబడే వస్తువు ఉండాలి. అట్టి వస్తువును శ్రమించి సాధించుకోవాలి. అలా సాధించుకున్న దానిని అనుభవించాలి అంటే ఇంద్రియాలు ఉత్తేజంతో ఉండాలి. అంతటితో సరిపోదు. మనస్సు కూడా ఉత్సాహంగా ఉండాలి. ఇవన్నీ ఒకే కాలంలో అనుకూలమైతే, అప్పుడు సుఖం కలుగుతుంది. అదీ తాత్కాలికమే. అనిత్యమే. స్వల్పమే. అల్పమే. క్షణభంగురమే.

ఇలా దగ్గరై దూరమయ్యేవే భోగాలన్నీ. దగ్గరై స్వల్ప సుఖాల్ని పంచుతాయి. దూరమై దుర్భర దుఃఖాన్ని కలిగిస్తాయి. ఈ అనుభవాలే అందరి హృదయాలలో నిక్షిప్తమై ఉన్నాయి. అందుకే ఇవి దుఃఖ యోనులు.

అవ్యాజమైన అనురాగంతో వ్యక్తులను దగ్గర చేర్చుకుంటే, చేరినట్లే చేరి, అనంతమైన ఆవేదనను అందించి వాళ్ళు దూరంగా పోయి నపుడు ప్రతి మనిషి ఎంతగానో క్రుంగిపోతాడు. 'ఇలా దుఃఖించడానికే ప్రేమించా నేమో!' అని కుమిలి కుమిలి ఏడుస్తాడు. సంస్పర్శజాలు ఇలాగే ఉంటాయి. విషయభోగాలు ఇలాగే బాధిస్తాయి. లోకంలో దేనిని ఆశించినా, ఎవరిని అభిలషించినా చివరికి దుఃఖమే మిగుల్తుంది. అందుకే సంస్పర్శజా భోగాలు దుఃఖహేతువులు అంటున్నాడు భగవంతుడు.

***యావన్తః కురుతే జన్తుః సంబంధాత్ మనసః ప్రియాన్ ।***
***తావన్తోఽస్య నిఖన్యన్తే హృదయే శోక శఙ్కవః ॥***





మనస్సుకు ప్రియమైన ఎన్ని సంబంధాలను జీవుడు తయారు చేసుకుంటూ ఉన్నాడో, అన్ని శోక శంకువులు (దుఃఖపు మేకులు) గుండెలో గ్రుచ్చుకుంటున్నాయి.

ఈ లోకం లోని భోగాలే కావు, స్వర్గలోక సుఖాలు కూడా ఇలాంటివే అని చెప్పడానికే 'ఏవ' శబ్ద ప్రయోగం చేశాడు ***(దుఃఖ యోనయః ఏవ).*** సంస్పర్శజా భోగాల వల్ల కలిగే దుఃఖాలు ఈ లోకంలో ఎలాగో పరలోకంలో కూడా అలాగే ***(యథా ఇహ లోకే తథా పరలోకేఽపి ఇతి గమ్యతే, ఏవ శబ్దాత్ - శ్రీ శంకర భాష్యము).***

**ఆద్యంత వంతాలు**

సంస్పర్శజా భోగాలు దుఃఖహేతువులే కావు. ఆద్యంతవంతాలు కూడా. విషయేంద్రియ సంయోగముతో భోగము ఆరంభ మవుతుంది. కనుక అది ఆది. దాని యొక్క వియోగమే అంతము. కనుక భోగాలన్నీ ఆదిమంతాలు. అంతవంతాలు.

ఆద్యంతాలు కలవి కావడం చేత అవి అనిత్యాలు. ముందు క్షణంలో లేనివి, తరువాత క్షణంలో ఉండనివి. కేవలం అనుభవించే సమయం లోనే ఉండేవి, అనగా మధ్య క్షణంలో మాత్రమే కనిపించేవి కనుక అవి అనిత్యాలు ***(మధ్య క్షణ భావిత్వాత్ అనిత్యాః).*** అందుచేత, అనిత్యమై, దుఃఖహేతువులై, ఆద్యంతవంతాలైన ఈ సంస్పర్శజా భోగాలలో పండితుడు రమించడు, ఆనందించడు అని అర్థము. ***బుధః*** అంటే వివేకి లేదా పండితుడు అని అర్థము. అంటే, పరమార్థ తత్త్వమును తెలిసిన వాడు అని భావము ***(అవగత పరమార్థ తత్త్వాః).***

దుఃఖ హేతువులైన సంస్పర్శజా భోగాలు ఆద్యంతవంతాలే గాక, గుణవ్యాపార స్వభావం కలిగినవి కనుక చంచలములు ***(చలం గుణవృత్తమ్).*** పైగా శీఘ్రంగా మార్పు చెందుతూ ఉంటాయి. క్షిప్ర పరిణామం స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. అందుచేత వివేకం గల పండితులు సంస్పర్శజా భోగాల యందు రమించరు.

*విషయ భోగాసక్తిని సమూలంగా నిర్మూలించలేక పోతే కామక్రోధాల ప్రవాహ వేగాన్నైనా అరికట్టే ప్రయత్నం చేయాలి అని తరువాత శ్లోకంలో చెబుతున్నాడు.*

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥ 23

***శక్నోతి-ఇహ-ఏవ-యః-సోఢుం-ప్రాక్-శరీర విమోక్షణాత్***
***కామక్రోధోద్భవం-వేగం-సః-యుక్తః-సః-సుఖీ-నరః***

| | | | |
|---|---|---|---|
| యః | = ఏ | సోఢుం | = సహించుటకు |
| నరః | = నరుడు | శక్నోతి | = సమర్థు డగునో |
| శరీర విమోక్షణాత్ | = శరీరమును విడుచుట కంటె | సః | = వాడు |
| ప్రాక్ | = పూర్వము | యుక్తః | = యోగి |
| ఇహ ఏవ | = ఈ లోకము నందే | సః | = అతడే |
| కామక్రోధోద్భవం | = కామక్రోధముల వలన కలిగిన | సుఖీ | = ఆత్మానందము గలవాడు |
| వేగం | = వేగమును | | |

**దేహము రాలిపోక ముందే, కామక్రోధాల వల్ల ఏర్పడే ఆవేశాన్ని ఇక్కడే అదుపు చేయగల సమర్థుడు యోగి. అతడే సుఖవంతుడు.**

### వ్యాఖ్య

ప్రతిబంధకాల నడుమ ప్రగతిని సాధించడం కష్టం. అవరోధాలను తొలగించుకోకుండా అభివృద్ధి సాధ్యం కాదు. మోక్షరూపమైన శ్రేయోమార్గంలో ఇది కడు అవసరనీయం. అనుసరణీయం.

సర్వానర్థ ప్రాప్తి హేతువు, నివారింప శక్యము కానిది అయిన దోషయుతమైన ప్రతిబంధకాన్ని ప్రవేశ పెడుతూ, దానిని పరిహరించడానికి సాధకుడు తీవ్రంగా ప్రయత్నించాలి అని చెబుతున్నాడు. అంతే కాదు. దుర్నివారముగా కనిపిస్తున్న కామక్రోధాల వలన కలిగే వేగాన్ని శరీరం పతనం కాక ముందే ఎవడు నిగ్రహిస్తాడో అతడే యోగి అవుతాడు. ఆ యోగి సుఖవంతుడు అవుతాడు అంటున్నాడు.

### కామోద్భవ వేగము

పూర్వము అనుభవించి సుఖానుభూతిని పొందిన విషయము కంటికి కనిపించినా, చెవికి వినిపించినా, మనస్సులో స్మరింపబడినా, దాని యందు ఏర్పడే అత్యాసక్తి కామం. దీనిని 'గర్ధి' అంటారు. కామము అనేది మనోవికార విశేషము. రత్యాత్మక మైన తృష్ణ. కామానికి ఉపభోగమే గాని ఉపశమించుట తెలియదు. అనుభవించే కొద్ది వేగాన్ని పుంజుకోవడమే గాని, వేగాన్ని నిగ్రహించుకోవడం ఉండదు.

*న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి*

*హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాఽ భి వర్ధతే ॥*

కామములను ఉపభోగించుట చేత కామము నశించదు. అగ్నికి ఆజ్యం తోడైనట్లు మరీ విజృంభిస్తుంది.

నిగ్రహించడానికి వీలు పడని కామము బలమైనది. భయంకర మైనది. వివేకిని కూడా విచలితం చేస్తుంది. వృద్ధునిలో కూడా మోహాన్ని సృష్టిస్తుంది. సాధకులను కూడా తీవ్రంగా బాధిస్తుంది.

కామానుభవా లన్నీ రాగయుతాలుగా ఉంటాయి. అందుచేత కామానుభవాల చేత మానవుడు సుఖవంతుడవుతాడు. మొదట సుఖప్రాప్తి స్మరణం చేత మనస్సులో రాగం ఉదయిస్తుంది. విషయము ప్రాప్తించి నపుడు అదే సుఖంగా పరిణమిస్తుంది. ఆ తరువాత ప్రతి క్షణం వృద్ధి చెందుతూ వేగాన్ని పుంజుకుంటుంది. ఒక దశలో విషయము అప్రాప్త మైనా, అలా అప్రాప్త మైన దశలో దుఃఖం ప్రాప్తించినా, దాని కారణముగా మనస్సు ఉద్వేగాన్ని పొందుతుంది. ఇదొక మనోవికార విశేషము. దీనినే క్రోధము అంటారు. క్షోభ జనితమైన ద్వేష ప్రజ్వలిత ప్రకోపము.

### క్రోధోద్భవ వేగము

తనకు అప్రియమైన, ప్రతికూలమైన, సంతాప హేతువులైన విషయాలు కంటికి కనిపించినా, చెవికి వినిపించినా, మనస్సులో స్మరింప బడినా వాటి విషయంలో ఏ ద్వేషం ప్రజ్వలిస్తుందో అది క్రోధం. క్రోధంలో వైషమ్యమే గాని విచారము ఉండదు. క్రోధం ఎవరిని ఆశ్రయించుకొని ఉంటుందో అతడిని కూడా అది అగ్ని లాగా దహించి వేస్తుంది. క్రోధము అగ్ని లాంటిది. చాలు, మేలు అనే పదాలు క్రోధానికి నచ్చవు. కామ తృప్తికి అవరోధం కలిగి నపుడు చెలరేగే మానసిక క్షోభ ద్వేషంగా పరిణమిస్తుంది.

### కామక్రోధోద్భవ వేగము

కామక్రోధాలు అనేవి మనిషిని జీవించి ఉన్నంత కాలం ప్రేరేపిస్తూనే ఉంటాయి. ఈ ప్రేరణనే ఇక్కడ వేగం అన్నాడు. కామక్రోధాల నిమిత్తంగా ఏ ప్రేరణ పుంజుకుంటూ ఉందో, ఏ వేగానికి కామక్రోధాలు ప్రేరకాలుగా ఉన్నాయో, దానినే కామక్రోధోద్భవ మైన వేగం అంటారు ***(తౌ కామక్రోధౌ ఉద్భవః యస్య వేగస్య సః కామక్రోధోద్భవః***





***వేగః).*** కామక్రోధాల వలన కలిగే ఈ వేగాన్ని సహించడానికి, అంటే నిలువరించడానికి ఎవడు సమర్థుడో అతడే మానవుడు. అతడే యోగయుక్తుడు. అతడే సుఖవంతుడు అని శ్రీభగవానువాచ ***(తం కామక్రోధోద్భవం వేగం యః ఉత్సహతే ప్రసహతే సోఽయం ప్రసహితం సః యుక్తః యోగీ సుఖీచ ఇహ లోకే నరః).***

ఈ కామక్రోధాలు అనేవి ఏదో ఒక కారణంగా మనస్సులో ప్రవేశించి మనస్సును క్షోభకు గురి చేసే ప్రమాదం ఉంది. ఇవి కేవలం మనో వికారాలు అయినందున వీటిని విశ్వసించకూడదు. అందుచేత వీటికి మరణాన్నే హద్దుగా నిర్ణయించడం జరిగింది. ఇవి ఎప్పుడు విజృంభించినా, ఆ వేగానికి అడ్డుకట్ట వేసే ప్రయత్నంలో సాధకులు అప్రమత్తులై ఉండాలి.

కామక్రోధాలు ప్రశస్త మైనవి కావు. శ్రమించి పొందడానికి ఐశ్వర్యాలు కావు. సుగుణాలూ కావు. అలాగని ప్రాప్తించి ఉన్నట్లైతే, వాటిని అలాగే ఉంచుకోవడానికి అవి అవసరాలలో ఉపకరించేవీ కావు. అలాగని ఉపద్రవాలను సృష్టించనివీ కావు. ఈ కామక్రోధాల వేగాన్ని అరికట్టడం ఎంతటి వారి కైనా కష్టతరమైన విషయమే. అందుచేతనే కామక్రోధాల విషయంలో 'వేగ' శబ్దాన్ని ప్రయోగించడం జరిగింది.

ఇక్కడ 'వేగం' అనే పదం నదీ వేగ సామ్యము చేత చెప్పబడింది. ప్రధానంగా వర్ష ఋతువులో నదీ ప్రవాహ వేగము ఉధృతంగా ఉంటుంది. అలాంటి ప్రవాహంలో ఈత వచ్చిన వాళ్ళు కూడా వేగాన్ని ఎదుర్కోలేక కొట్టుకొని పోతారు.

***వర్షాసు న నదీం ప్రవిశేత్ -*** వర్షాకాలంలో నదిలో దిగకూడదు అన్నది వేదం. నదీ వేగము యొక్క ప్రమాదకర పరిస్థితిని తెలియ చేయడమే అలా చెప్పడం లోని అంతర్భావము. కామక్రోధోద్భవ వేగంలో పడి, దానిని ఈది బయట పడలేక, జనన మరణ రూప సంసార సాగరములో పడి అన్యాయమై పోకుండా, మనస్సులో ప్రవేశించిన కామక్రోధాల వేగమును, నదీ వేగాన్ని తిమింగలము ఎదుర్కొనినట్లు, ఏ యతి పురుషుడు నిలువరించి నిలబడతాడో, అట్టి నరుడే యోగయుక్తుడు. అతడే సుఖవంతుడు.

### ప్రమాదం రాక ముందే ప్రమోదం

కామక్రోధాలను, వాటి వేగాన్ని నిలువరించడ మనేది ఎక్కడో ఎప్పుడో జరిగేది కాకూడదు. ఇక్కడే జరగాలి ***(ఇహైవ).*** ఇప్పుడే జరగాలి ***(అద్యైవ).*** అంటే జీవించి ఉండగానే జరగాలి. మరణంలో శరీరం పతనం కాక ముందే జరగాలి ***(శరీర విమోక్షణాత్ ప్రాక్).***

జీవించి ఉన్న వానికి కామక్రోధాల వేగం తప్పకుండా ఉంటుంది. అది ఏ క్షణంలో నైనా అగుపించ వచ్చు. కనుక జీవించినంత కాలము ప్రతి క్షణం అప్రమత్తులై ఉండాలి అని అర్థం. అందుచేతనే మరణాన్ని హద్దుగా చెప్పడం జరిగింది. కామక్రోధాలను నిగ్రహించకుండా మోక్ష సాధనమైన జ్ఞానము పొందడం కష్టతమము.

కామక్రోధాలను జయించిన వానికే శమం, అనగా మనో నిగ్రహము కలుగుతుంది. శమాది సత్త్వ సంపద ఉన్నప్పుడే మనస్సు శాస్త్రాధ్యయనం చేసి జ్ఞానమును సముపార్జించ కలుగుతుంది. జ్ఞానం కలిగి నపుడే మోక్షము సిద్ధిస్తుంది. కనుక అక్షయ సుఖాన్ని పొందాలని అభిలషించే వాడు కామక్రోధాలను అవశ్యం నియమించాలి. ఈ విషయంలో సాధకుడు తీవ్ర ప్రయత్నం చేయాలి. కాని, జ్ఞానకర్మ సన్యాసి తానే నిగ్రహ స్వరూపంగా శోభిస్తూ ఉంటాడు. అతడే సుఖవంతుడు. వసిష్ఠ మహర్షి ఈ విషయాన్ని సోదాహరణంగా వివరిస్తాడు.

***ప్రాణే గతే యథా దేహ స్సుఖం దుఃఖం న విన్దతి!***

***తథాచేత్ ప్రాణయుక్తోఽ పి స కైవల్యాశ్రమే వసేత్ ॥***

ప్రాణం పోయిన తరువాత పురుషుని దేహాన్ని భార్యాదులు కౌగిలించుకొని విలపిస్తూ ఉంటారు. అలాగే, మృతుని కళేబరాన్ని పుత్రాదులు శ్మశానంలో తగలబెడుతూ ఉంటారు. ఆలింగనం చేసుకొని ఆవేదన చెందుతున్న అర్ధాంగి విషయంలో మృతునికి రాగం ఉందా? చితిపై పెట్టి కాల్చుతున్న కుమారులపై మృతునికి ద్వేషం ఉందా? రెండూ లేవు. ఎందుకని? ప్రాణగతు డయ్యాడు కనుక.

అంతే. ప్రాణం పోయిన తరువాత దేహము ఉండినా, రాగద్వేషాలు, వాటి వల్ల కలిగే కామక్రోధాలు ఎలాగైతే లేవో, అలాగే దేహం ప్రాణంతో ఉన్నప్పుడు కూడా ఎవడు రాగద్వేషాలు లేకుండా, కామక్రోధాల వేగాన్ని అరికట్టి ఉంటాడో, వాడే సుఖవంతుడు. అతడే యోగి.

*కామక్రోధాల వేగాన్ని నిలువరించినంత మాత్రాన వ్యక్తి తరిస్తాడా? బ్రహ్మనిష్ఠ మాటేమిటి? అదే చెబుతున్నాడు.*

**యోఽన్తః సుఖోఽన్తరారామ స్త థాన్తర్జ్యోతి రేవ యః ।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥** 24

***యః-అంతః-సుఖః-అంతరారామః-తథా-అంతర్జ్యోతిః-ఏవ-యః***
***సః-యోగీ-బ్రహ్మనిర్వాణం-బ్రహ్మభూతః-అధిగచ్ఛతి***

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | సః | = ఆ |
| అంతస్సుఖః | = ఆంతరంగిక సుఖము గల వాడు | యోగీ | = యోగి |
| అంతరారామః | = ఆత్మరతి ననుభవించు వాడు | బ్రహ్మ భూతః | = బ్రహ్మభూతుడై |
| తథా | = అట్లే | బ్రహ్మనిర్వాణం | = మోక్షమును |
| యః | = ఎవరైతే | అధిగచ్ఛతి | = పొందుతాడు |
| అంతర్జ్యోతిః ఏవ | = ఆత్మ ప్రకాశము గలవాడో | | |

**అట్టి యోగి అంతరాత్మ యందే సుఖిస్తాడు. ఆత్మ యందే రమిస్తాడు. ఆత్మ ప్రకాశంతో శోభిస్తాడు. బ్రహ్మస్వరూపు డవుతాడు. బ్రహ్మరూప మైన మోక్షాన్ని పొందుతాడు.**

### వ్యాఖ్య

ఎవరి ఆత్మ సంబంధమైన అజ్ఞానం జ్ఞానం చేత నశింప బడిందో, అట్టి ఆత్మజ్ఞానం గల పండితులు సమదర్శులు అంటూ ఆత్మవిదుని వైభవాన్ని పద్దెనిమిదవ శ్లోకంలో వర్ణించడం జరిగింది. జనన మరణాలను ఈ లోకం లోనే జయించిన అట్టి జీవన్ముక్తులు బ్రహ్మము నందే, బ్రహ్మము గానే ఉన్నారంటూ పందొమ్మిదవ శ్లోకంలో చెప్పడం జరిగింది. ఈ స్థితి ప్రాప్తించాలి అంటే ఐదు లక్షణాలను కలిగి ఉండాలి.

బ్రహ్మవిదుని లక్షణాలు సూర్యునిలో ప్రకాశం లాగా, సహజం గానే బ్రహ్మవేత్తలో దర్శన మిస్తూ ఉంటాయి. బ్రహ్మవిదుడు కాని సాధకుడు ఈ లక్షణాలను ప్రయత్న పూర్వకంగా సాధించుకోవాలి. ఆ అయిదు లక్షణాలు :- (1) ప్రియాప్రియాలలో సమస్థితి. ఈ విషయంలో బ్రహ్మవేత్త స్థిరబుద్ధి కలిగి ఉంటాడు. సాధకుడు అవగాహనతో చరిస్తూ వాటిని సమంగా గ్రహించాలి. (2) అనాసక్తి. బాహ్య విషయాల యందు ఆసక్తి లేనివాడు. ఆత్మ యందే ఆనందాన్ని పొందువాడు. బ్రహ్మవేత్త అక్షయ సుఖాన్ని పొందే ఉంటాడు. సాధకుడు ప్రయత్నించి పొందాలి. (3) భోగాల యందు దోష దర్శనము. జ్ఞానికి ఇది సహజ లక్షణం. సాధకుడు భోగ రుచిని తెలిసిన వాడు కనుక భోగాశ జనిస్తుంది. దోష దర్శనం చేత దానిని జయించాలి. (4) కామక్రోధాల వలన పుట్టిన వేగాన్ని అరికట్టడం. ఈ విషయం బ్రహ్మవేత్తకు సిద్ధించి ఉంటుంది. బ్రహ్మవేత్త కాగోరే సాధకుడు





తీవ్రంగా ప్రయత్నించి, జ్ఞాన ప్రతిబంధకమైన ఈ వేగాన్ని నిలువరించాలి. (5) ఆత్మనిష్ఠ. ఎలాంటి లక్షణం గల బ్రహ్మనిష్ఠుడు బ్రహ్మమును పొందుతాడో అట్టి ఆత్మనిష్ఠ. ఆత్మవిదుడు దీనిని పొందే ఉన్నాడు. సాధకుడు దీనిని తయారు చేసుకొని తరించాలి.

బ్రహ్మవిదునిలో శోభించే ఈ ఐదు లక్షణాలను ఇరవైయవ శ్లోకం నుండి వరుసగా ఒక్కొక్క లక్షణాన్ని ఒక్కొక్క శ్లోకంలో చెబుతూ వచ్చి, ఇరవై మూడవ శ్లోకం వద్ద నాల్గవ లక్షణాన్ని ముగించి, ఐదవ లక్షణ మైన ఆత్మనిష్ఠను ప్రస్తుత శ్లోకంలో వివరిస్తున్నాడు. ఇంతటితో జ్ఞాన లక్షణ పంచకం ముగుస్తుంది.

ఆత్మ యందే సుఖం కలవాడు ***(అన్తః సుఖః)***, ఆత్మ యందే రమించు వాడు ***(అన్తరారామః)***, ఆత్మయే జ్యోతిగా కలవాడు ***(అన్తర్జ్యోతిః)*** అయిన అట్టి యోగి ***(సః యోగీ)***, ఆత్మయే బ్రహ్మము అని తెలిసిన వాడై ***(బ్రహ్మభూతః)***, బ్రహ్మరూపమైన మోక్షమును ***(బ్రహ్మ నిర్వాణం)*** ఇక్కడే, అంటే జీవించి ఉండగానే పొందుతాడు ***(ఇహ జీవన్ ఏవ అధిగచ్ఛతి ప్రాప్నోతి)***. ఇది శ్లోక తాత్పర్యం. ఇక విశ్లేషించుకుందాం.

### సచ్చిదాత్మ

ఈ శ్లోకంలో సుఖము, ఆక్రీడ, జ్యోతిస్సు అని ఏ మూడు లక్షణ విషయాలు ప్రస్తావించ బడ్డాయో, ఆ మూడింటికి 'అంతః' అను శబ్దము విశేషణంగా వాడటం జరిగింది. ఈ మూడు లక్షణాలు ఒకే విశేషణం చేత చెప్పబడ్డాయి. ఈ విశేషణము చేత 'అంతః' శబ్దము ఆత్మవాచకంగా తెలుస్తూ ఉంది.

***సర్వస్మాత్ అన్తరతరం యత్ అయమాత్మా*** - ఈ ఆత్మ అన్నిటి కంటే లోపల ఉంది అని ఉపనిషత్తు. అంటే, ఆత్మ సర్వాంతర్యామి. సర్వములో ఉన్న ఆత్మే ఈ ఆత్మ. ఈ ఆత్మయే సర్వాత్మ. ఈ ఆత్మయే బ్రహ్మ ***(అయం ఆత్మా బ్రహ్మ)***. బ్రహ్మాత్మ. బ్రహ్మాత్మ జ్ఞానమే మోక్షము.

ఆత్మ ఉంది ***(ఆత్మా అస్తి)***. ఉంది అంటే, సత్యంగా ఉంది ***(యదస్తి తత్ సత్యం)***. దీనిని పొందిన వాడు ఆత్మవిదుడు. ఆత్మజ్ఞాని. పొందుటకు ప్రయత్నించువాడు సాధకుడు.

ఆత్మ ఉంది అంటున్నాం. ఉంది కనుక, అర్థం చేసుకొనేందుకు ఉంది అని ప్రాథమిక అవగాహనగా అంగీకరించాలి. అవగాహన అనేది ఏదైనా, ఎప్పుడైనా అనుభవం మీదనే ఆధారపడి ఉంటుంది. 'ఉంది' అనే దానిని కూడా ఎవరైనా అనుభవం తోనే అర్థం చేసుకుంటారు.

ఒకటి ఉంది అంటే ఒకచోట ఉంది అని అర్థము. ఒక చోట ఉన్నది ఏదైనా కొంత కాలమే ఉంటుంది కనుక, ఒక కాలంలో ఉంది అని కూడా అర్థం చేసుకోవలసి ఉంటుంది. అలా ఒక చోట ఉన్నది మనకు ఎంత దూరంలో ఉంది? అనే ప్రశ్న వెంటనే లేస్తుంది. అంత దూరంలో ఉన్న దానిని చేరడానికి ఎంత కాలం పడుతుంది? అనే మరొక ప్రశ్న దానిని అనుసరిస్తుంది. ఈ రెండు ప్రశ్నలు దేశకాలాల చుట్టూ తిరుగుతూ ఉంటాయి. కాని, ఆత్మ దేశకాలాలలో తెలిసేది కాదు. దేశకాలాలలో ఆత్మ లేనిది కాదు. కాని, దేశకాలాలు లేకపోయినా ఆత్మ ఉంటుంది. ఇదే అర్థం కావాలి. అవుతుంది.

ఈ ఉండటము అనే దానిని కాస్త బాగా అర్థం చేసుకోవాలి. చెట్టు ఉంది. పుట్ట ఉంది. కొండ ఉంది. బండ ఉంది. ఇవన్నీ ఉన్నవే. అవి ఉన్నట్లు వాటికి తెలుసా? తెలియదు. తెలియ నపుడు, అవి ఉన్నవి అని చెప్పిం దెవరు? మనమే. అవి ఉన్నాయి. అవి ఉన్నట్లు వాటికి తెలియక పోయినా, మనకు తెలుస్తూ ఉంది కనుక మనం చెబుతున్నాం. ఆత్మ అలా ఉందా? కుండ లాగా, బండ లాగా ఉందా? పుట్ట లాగా, గుట్ట లాగా ఉందా? ఆత్మ అలా లేదు. ఆత్మ ఉంది. తాను ఉన్నట్లు తనకు తెలుస్తూ ఉంది. అంటే జ్ఞానపూరితంగా ఉంది. ఇంతవరకు స్పష్టంగా ఉంది కదూ? మరొక అడుగు ముందుకు వేద్దాం.

నేను ఉన్నాను ***(అహమస్మి)***. వ్యక్తిగా నేను ఉన్నాను. నేను ఉండటం అనేది మీరు గుర్తించడం మీద ఆధారపడి లేదు. నా ఉనికి మీ జ్ఞానంపై ఆధారపడింది కాదు. నేను ఉన్నాను. నేను ఉన్నట్లు నేను తెలుసుకుంటున్నాను. నేను ఉండటం, నేను ఉన్నట్లు నాకు తెలియడం అనేవి రెండుగా ఉన్నాయా? భిన్నంగా ఉన్నాయా? అలా ఉండే టట్లయితే, కొండను తెలుసుకుంటున్న నాకు కొండ దూరంగా ఉన్నట్లు, నన్ను తెలుసుకుంటున్న నా జ్ఞానానికి నేను వేరుగా ఉండవలసి వస్తుంది. నా ఉనికి ఒకచోట, నా జ్ఞానం మరొక చోట ఉన్నట్లు అవుతుంది. ఇదే వాస్తవ మైతే, నేను ఉన్నాను అనే జ్ఞానం నాకే ఎలా కలుగుతుంది? ఆలోచించండి.

కనుక, నా విషయంలో ఉండటము ***(సత్)*** తెలియడము ***(చిత్)*** రెండు కావు. ఒక్కటే. చిత్తు తన కన్నా వేరుగా సత్తును తెలుసుకోవడము అంటే, మనము మంచాన్నో, కంచాన్నో తెలుసుకున్నట్లు అవుతుంది. కనుక, సత్తును చిత్తు ప్రత్యేకంగా తెలుసుకోలేదు. సత్తే చిత్తుగా ఉంది. ఏది సద్రూపమో అదే చిద్రూపము కూడా. కనుక సత్తులో అంతా చిత్తే. జ్ఞానమే. సత్తులో ఒక భాగంలో జ్ఞానం ఉండి, మరొక భాగంలో లేకపోవడాన్ని ఊహించలేము. ఎందుకంటే, సత్తులో ఒక భాగంలో చిత్తు లేదు. కనుక చిత్తు లేని సత్తు ఉంది అని చెబితే, అలా చిత్తు లేని సత్తును తెలుసుకున్న దెవరు? చిత్తు లేదు అని తెలుసుకున్న దేదో అది ఉండాలి కదా? మరి, అలా ఉండి తెలుసుకున్నది చిత్తా, అచిత్తా? అచిత్ జడం. దానికి ఎలా తెలుస్తుంది? కనుక చిత్‌కే తెలియాలి. చిత్తుకు తెలిసే టప్పుడు చిత్తు లేకపోవడ మేమిటి?

కనుక సత్తు ఉంది. అది పూర్ణం. సత్తు చిత్తుగా ఉంది. చిత్తు పూర్ణము. పూర్ణము అనేది **సచ్చిదాత్మగా** ఉంది. సత్తు పూర్ణం కనుక దానిని విభజించడం సాధ్యపడదు. చిత్తు పూర్ణం కనుక దానిని కూడా విభజించడం సాధ్యపడదు. కనుక ఆత్మ అవిభాజ్య సత్తా స్వరూపము. సచ్చిదాత్మ స్వరూపము.

ఇట్టి పూర్ణాత్మలో అపరిపూర్ణత ఉంటుందా? అసంతృప్తి తలెత్తుతుందా? ఆనందం దూరం అవుతుందా? ఆనందం దూరం కాదు. సరే. ఆనందం ఎప్పుడుంటుంది? ఇదేం ప్రశ్న! ఆనందం ఎప్పుడు ఉండదు? అని నేను ప్రశ్నిస్తున్నాను. సమాధానం చెప్పండి చూద్దాం.

ఆనందం ఒకప్పుడు లేదు అంటే ఆ ఒకప్పుడు ఎప్పుడో నాకు తెలియదు గాని, అప్పుడు మాత్రం సదాత్మ లేదు అని అర్థం. సచ్చిదాత్మ లేదు అని భావం. లేనిది సదాత్మ ఎలా అవుతుంది? సదా ఉండేదే కదా సదాత్మ! సదా ఆత్మ ఉండే టప్పుడు ఆనందం ఎలా అదృశ్య మవుతుంది? ఆత్మ సదా ఉంది. కనుక అది సదాత్మ. ఆత్మ ఆనంద స్వరూపంగా ఉంది. అందుచేత అది సదానందం.

చివరగా, చిత్తు కాని సత్తు లేదు. ఆనందం కాని సత్తు లేదు. చిత్తు నుండి ఆనందం వేరు కాదు. సత్తు నుండి చిత్తు వేరు కాలేదు. ఆనందానికి దూరంగా సచ్చిదాత్మ లేదు. ఇప్పుడు చెప్పండి. జ్ఞానం కలిగిన వాడు దుఃఖంతో ఉండటము సాధ్యమా? ఆలోచించండి. కనుక ఆత్మ సత్తుగా, చిత్తుగా, ఆనందంగా వేరువేరుగా లేదు. అఖండంగా, సచ్చిదానంద స్వరూపంగా ఉంది.

**బ్రహ్మభూతుడు**

ఆత్మ సచ్చిదానంద స్వరూపము. ఆత్మ తానే అని తెలిసిన వాడు ఆత్మవిదుడు. మరి బ్రహ్మము ఎవరు? ఆత్మయే బ్రహ్మము. ఇదే బ్రహ్మాత్మజ్ఞానము. బ్రహ్మాత్మజ్ఞానము కలిగిన వాడు బ్రహ్మభూతుడు.

అంటే, ఆత్మ సచ్చిదానంద స్వరూపము అని తెలుసుకోవడం చేత, అంతవరకు అబ్రహ్మభూతుడుగా ఉన్నవాడు ఇప్పుడు బ్రహ్మభూతుడు అయ్యాడని అర్థమా? బ్రహ్మము అనంతము కనుక, అనంతము క్రొత్తగా





అయ్యేది ఉండదు. అనంతము ఎప్పుడూ ఉన్నదే. ఉన్న దానిని తెలుసుకోవడమే గాని బ్రహ్మభూతుడు క్రొత్తగా బ్రహ్మము అయ్యేది ఉండదు.

నేను బ్రహ్మమును కాను అనే వాడు కూడా బ్రహ్మమే. బ్రహ్మమును కాను అనుకొనే వాడు ప్రత్యేకించి, ప్రయత్నించి బ్రహ్మము కావలసిన అవసరం లేదు. తాను బ్రహ్మ మయ్యే ఉన్నాడు. అలా ఉన్నట్లు అతనికి తెలియదు. అదే అజ్ఞానము. బ్రహ్మమునకు సంబంధించిన అజ్ఞానము. బ్రహ్మమునకు సంబంధించిన జ్ఞానము కలిగితే బ్రహ్మమునకు సంబంధించిన అజ్ఞానము అంతరిస్తుంది. అప్పుడు బ్రహ్మము బ్రహ్మము గానే ప్రకాశించడం జరుగుతుంది. ***బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి*** - బ్రహ్మమైన వాడే బ్రహ్మమును పొందుచున్నాడు అన్నది ఉపనిషత్తు. దీనినే 'ప్రాప్తస్య ప్రాప్తిః' అంటారు. పొంది ఉన్న దానినే పొందడము అని అర్థము.

బ్రహ్మభూతుడు, బ్రహ్మవిదుడు, ఆత్మవిదుడు - ఇలా ఎన్ని పేర్లతో పిలుచుకున్నా అతడు బ్రహ్మజ్ఞానే. ***అంతః*** శబ్దవాచ్యుడు. అన్నిటి కన్నా అంతరతర మైన ఆత్మ తానైన వాడు ***(సర్వస్మాత్ అన్తరతరం యత్ అయమాత్మా)***.

ఇప్పుడు చెప్పండి. ఆత్మజ్ఞాని, లేదా బ్రహ్మభూతుడు సుఖించడానికి ఏమి పొందాలి? ఏమి చెయ్యాలి? చెయ్యడానికి, పొందడానికి తాను సుఖం లేనివాడా? సచ్చిదానంద స్వరూపమైన ఆత్మ కన్నా అన్యంగా సుఖ మెక్కడుంది? నిత్యానంద స్వరూపము, నిత్య సుఖాత్మ అయిన ఆత్మను విడిచి సుఖం కోసం ఎక్కడ ప్రయత్నించాలి? అనాత్మలో ప్రయత్నించాలా? నైమిత్తిక సుఖాల కొరకు ఆత్మజ్ఞాని పరితపించాలా? ఆత్మవిదునిలో ఆనందం వచ్చిపోయేది కాదు. సుఖం తన స్వరూపంగా ఉంది. అందుచేత బ్రహ్మభూతుడు సుఖం కొరకు బాహ్య ప్రపంచంలో పరిభ్రమించడు. తనలో, తానే, తానుగా సుఖరూపుడై ఉంటాడు. కనుకనే అతడు అంతస్సుఖుడు ***(యః అంతఃసుఖః అంతః ఆత్మని సుఖం యస్య సః అన్తః సుఖః)***.

అంతస్సుఖుడైన బ్రహ్మభూతుడు అంతరారాముడు. ***అంతః*** అనే శబ్దము ఆత్మవాచకము అని తెలుసుకున్నాం కదా! ***అంతః*** అంటే ఆత్మ యందే ఆరామము కలవాడు, ఆరమణము కలవాడు, క్రీడించు వాడు. అతడే అంతరారాముడు. బాహ్య వస్తువుల అపేక్ష లేకయే తనలో తాను క్రీడించు వాడు. అతడే అంతరారాముడు ***(అన్తః ఏవ ఆత్మని ఆరామః క్రీడా యస్య సః అన్తరారామః)***.

అంతస్సుఖుడు, అంతరారాముడు అయిన బ్రహ్మభూతుడు అంతర్జ్యోతిస్వరూపుడు. బాహ్య వెలుగులలో దృష్టిని నిలిపేవాడు కాకుండా, ఆత్మ వెలుగు లోనే దృష్టిని ఉంచిన వాడు కనుక అంతర్జ్యోతి రూపుడు. స్వప్రకాశ స్వరూపుడు. మరొక వెలుగును ఆశ్రయించుకున్న వాడు కాడు. సర్వ వెలుగులకు ఆధార మైన అంతర్జ్యోతి స్వరూపుడు ***(అంతః ఆత్మైవ జ్యోతిః ప్రకాశః యస్య సః అన్తర్జ్యోతిః)***.

**ఆఖ్యాయిక**

నాలుగు గంటలకు బ్రహ్మముహూర్తంలో ధ్యానాభ్యాసానికి కూర్చున్న సన్యాసి ఏడు గంటలైనా కుటీరం నుండి బయటకు రాలేదు. ఆయన దర్శనానికి కుటీరం బయట నిరీక్షిస్తున్న జమీందారు, 'స్వామీ! సూర్యోదయమై చాలా సేపైంది. ఎండ బాగా వచ్చేసింది. ఇక తమరు దయ చేయవచ్చు' అన్నాడు.

'నేను ఇప్పుడు రాలేను నాయనా! ప్రస్తుతం నాలో దివ్యంగా శోభిస్తున్న ప్రకాశాన్ని బాహ్య వెలుగులు భగ్నం చెయ్యవచ్చు. నన్నిలా ఉండనీ' అని లోపల నుండే బదులిచ్చాడు సన్యాసి.

బాహ్య వెలుగులు వేరు. అంతర్జ్యోతి వేరు. కళ్ళకు మిరుమిట్లు గొలిపే బాహ్య కాంతులు దృష్టిని

వక్రింప చేస్తాయి. ఆంతర్యం లోని వెలుగులు సాధకుని మంగళ స్నానం చేయిస్తాయి. మహిమను దర్శింప చేస్తాయి.

అట్టి బ్రహ్మవిదుడు, బ్రహ్మభూతుడు బ్రహ్మరూప మోక్షమును **(బ్రహ్మ నిర్వాణమ్)** ఇక్కడే, ఈ దేహంలో జీవించి ఉండగానే **(జీవన్ ఏవ)** పొందుతున్నాడు **(అధిగచ్ఛతి)**. జీవించి ఉండగానే ముక్తిని పొందినవాడు అవుతున్నాడు. అతడే జీవన్ముక్తుడు.

జీవన్ముక్తుని దేహము దేవాలయంగా శోభిస్తూ ఉంటుంది. సర్వేంద్రియాలు ఉపశమించి ఉంటాయి. చిత్త పవనాలు చలించకుండా ఉంటాయి. కామాది శత్రువర్గము గతించి పోయింది. అమానిత్వాది జ్ఞాన కుసుమాలు విరబూసి ఉంటాయి. వివేక వైరాగ్య పరిమళాలు వెదజల్ల బడుతూ ఉంటాయి. **పరమసుఖ వార్ధి యుప్పొంగి పొలుచుండు ముందట వసించు మోహించి మోక్షలక్ష్మి** - పరమానంద సాగరము ఆంతర్యంలో పొంగి ప్రవహిస్తూ ఉంటే, ఆ బ్రహ్మజ్ఞానిని మోహించి ముందు కొచ్చింది మోక్షలక్ష్మి.

*బ్రహ్మరూప మోక్షాన్ని పొందుటకు ఏకైక సాధనమైన జ్ఞానప్రాప్తికి సాధనాంతరాలను వివరిస్తున్నాడు ప్రేమతో వాసుదేవుడు.*

**లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః ।**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥ 25**

***లభంతే-బ్రహ్మ నిర్వాణం-ఋషయః-క్షీణకల్మషాః***
***ఛిన్నద్వైధాః-యతాత్మానః-సర్వభూతహితే-రతాః***

| | | | |
|---|---|---|---|
| క్షీణకల్మషాః | = నశించిన పాపములు గల వారు | రతాః | = ఆసక్తి గలవారు |
| ఛిన్నద్వైధాః | = ఛేదింప బడిన సంశయములు గల వారు | ఋషయః | = జ్ఞానులు |
| యతాత్మానః | = నియమింపబడిన దేహేంద్రియాదులు గల వారు | బ్రహ్మ నిర్వాణం | = బ్రహ్మానందమును |
| సర్వ భూత హితే | = సకల ప్రాణులకు హితము చేయుట యందు | లభంతే | = పొందుతారు |

**ఋషులు పాప రహితులు. సంశయ రహితులు. జితేంద్రియులు. సర్వభూతముల హితము నందు ఆసక్తిపరులు. వారు బ్రహ్మానందాన్ని పొందుతారు.**

**వ్యాఖ్య**

బ్రహ్మరూప మోక్షమును పొందిన వాడు బ్రహ్మభూతుడు అని ఇరవై నాల్గవ శ్లోకంలో చూశాము. బ్రహ్మభూతుడే ఈ శ్లోకంలో ఋషిగా దర్శన మిస్తున్నాడు. ఋషులు సమ్యగ్దర్శులు **(ఋషయః సమ్యగ్దర్శినః సంన్యాసినః)**. వారే సన్యాసులు. బ్రహ్మాత్మ జ్ఞానమును పొందిన వారు. ముక్తపురుషులు. జ్ఞానము కలిగిన ఋషులలో జ్ఞాన లక్షణాలన్నీ దివ్యంగా ప్రకాశిస్తూ ఉంటాయి. వాటిని ప్రస్తుత శ్లోకంలో వివరిస్తున్నాడు. ఈ లక్షణాలు ఋషులలో సిద్ధించి ఉంటాయి కనుక అవి దివ్యమైన దర్శనీయాలు. కాని, ఋషులు కాగోరే సాధకులు ప్రయత్న పూర్వకంగా ఈ లక్షణాలను సాధించుకోవాలి. ఈ విధంగా ప్రస్తుత శ్లోకం ఒక వైపు ఋషుల సిద్ధత్వ వైభవాన్ని వివరిస్తూ, మరో వైపు ముముక్షువులకు జ్ఞానప్రాప్తికి సాధనాంతరాలను తెలియ చేస్తూ ఉంది.

**క్షీణ కల్మషులు**

ఋషులు క్షీణ కల్మషులు. కల్మషము అనేది దోషము. పాపయుతము. రాగద్వేషాది దోషాలు, పాపాది





దోషాలు కల్మషాలు. వాటిని నశింప చేసుకున్న వారు ఋషులు కనుక వారు క్షీణకల్మషులు **(క్షీణ పాపాది దోషాః)**.

రాగద్వేషాదులు, పాపపు వాసనలు అంతఃకరణమును కలుషితం చేస్తాయి. అశుద్ధమైన చిత్తము జ్ఞానప్రాప్తికి ఉపకరించదు. సహకరించదు. అందుచేత, జ్ఞానప్రాప్తికి యత్నించు ముముక్షువులు బుద్ధిని శుద్ధి చేసుకోవాలి.

కర్మయోగ ఫలితం గానే బుద్ధి శుద్ధి పడుతుంది. కర్మయోగము ద్వారా చిత్తశుద్ధి, ఉపాసనల ద్వారా చిత్త నైశ్చల్యము ప్రాప్తించ గానే బుద్ధి లోని కల్మషా లన్నీ నశించి, అంతఃకరణ శుద్ధి ప్రాప్తిస్తుంది. ఇక జ్ఞానం ఏ క్షణాన్నైనా ప్రాప్తించ వచ్చు. ఈ వాస్తవాన్ని హృదయంలో ఉంచుకొని సాధకుడు నిరంతరం అప్రమత్తంగా ఉండాలి.

ఋషులు ముక్త పురుషులు. ఆత్మజ్ఞానం కలవారు. ఆత్మజ్ఞాన ప్రాప్తికి ముందే కర్మయోగ ఫలాలను పొంది ఉన్నారు కనుక వారిలో పాపాది దోషాలు అగుపించవు. అందుచేత వారు క్షీణకల్మషులు. కాని, సాధకులు జ్ఞానమును పొందాలి కనుక, కర్మయోగమును చక్కగా అనుష్ఠించి, కల్మషాలను పోగొట్టుకోవాలి.

**ఛిన్న ద్వైధులు**

కల్మష రహితులైన జ్ఞానులు సంశయ రహితులు. ఛిన్నద్వైధులు **(ఛిన్నద్వైధాః ఛిన్న సంశయాః)**. ద్విధ అంటే సంశయము (రెండుగా విభజింప బడింది కనుక **ద్విధ**). ద్వైధములు అంటే సంశయములు **(ద్వైధాః)**. ఒకే విషయంలో రెండు భావాలను **(ద్విధా)** ఆశ్రయించుకొని పుడుతాయి కనుక సంశయములు ద్వైధములు.

భగవంతుడు ఉన్నాడా, లేడా? **(ద్విధా)**. ఉంటే ఏకమా, అనేకమా? అతడు సృష్టితో సంగము ఉన్నవాడా? లేక అసంగుడా? సత్యము ద్వైతమా, అద్వైతమా? జీవేశ్వరులు భిన్నులా, అభిన్నులా? ఇలా ఒక విషయానికి సంబంధించి రెండు విరుద్ధాంశములను పొంది నపుడు ఉత్పన్న మయ్యేవే సంశయాలు. అవి 'ప్రమేయగత' సంశయాలు. అంటే, బ్రహ్మ సంబంధ మైనవి కావచ్చు. లేదా 'ప్రమాణగత' సంశయాలు అంటే, శాస్త్ర సంబంధ మైనవి కావచ్చు. సర్వ సంశయాలను నశింప చేసుకున్న వారు ఋషులు కనుక వారు ఛిన్నద్వైధులు. సర్వ సంశయాలు ఛేదింపబడిన వారు. సంశయ రహితులుగా శోభించడ మనేది ఆత్మజ్ఞానము యొక్క ఫలము **(ఆత్మజ్ఞానస్య ఫలం)**. ఆత్మజ్ఞానం కలిగితే, తెలుసుకో దగిన విషయాలకు సంబంధించిన సర్వ సంశయాలు ఛేదింప బడుతాయి **(ఛిద్యన్తే సర్వ జ్ఞేయ విషయాః సంశయాః)**.

ఆత్మజ్ఞానం కలవారు కనుక ఋషులు సంశయ రహితులుగా శోభిస్తారు. ఆత్మజ్ఞానం కొరకు ప్రయత్నించే సాధకులు ఆచార్యులను పరిప్రశ్నించి సందేహాలను నివృత్తి చేసుకుంటూ మోక్షమార్గంలో పయనించాలి. అంతమాత్రాన సంశయాలు సంపూర్ణంగా నశించవు. విషయం ఆత్మకు సంబంధించింది కనుక సులభగ్రాహ్యం కాదు. అందుచేత సందేహాలు అనివార్యంగా అంకురిస్తూనే ఉంటాయి. ఈ విషయంలో దేవతలు కూడా అతీతులు కారు అన్నది ఉపనిషత్తు.

**దేవై రత్రాపి విచికిత్సితం పురా** - దేవతలు కూడా పూర్వము ఆత్మ సంబంధమైన విషయంలో సంశయగ్రస్తు లయ్యారు అన్నది కఠోపనిషత్తు. సంశయాలు సంపూర్ణంగా నశించడ మనేది ఆత్మజ్ఞాన ఫలమే అని అర్థం చేసుకోవాలి. అజ్ఞానము నశిస్తేనే సంశయాలు నశిస్తాయి.

**భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యన్తే సర్వ సంశయాః**

అజ్ఞాన ముడి విడిపోయి నపుడు సందేహాలన్నీ పటాపంచ లవుతాయి అన్నది ముండకోపనిషత్తు.

**యతాత్ములు**

'యతము' అంటే నియమించడము అని అర్థము. ఇక్కడ ఆత్మ అంటే మనస్సు, ఇంద్రియములు అని కూడా అర్థము. కనుక, 'యతాత్ములు' అంటే నియమింప బడిన ఇంద్రియ మనస్సులు కలవారు అని అర్థము ***(యతాత్మానః సంయతేంద్రియాః).*** పరమాత్మ యందే దృష్టి గలవారు, అంతర్ముఖులు అని భావం. జ్ఞానులకు ఇది సహజంగా శోభించే లక్షణమైనా, సాధకులు ప్రయత్న పూర్వకంగా ఇంద్రియ నిగ్రహమును నిష్ఠతో సాధించాలి.

**సర్వభూత హితేరతులు**

సర్వ భూతములకు ఏది ప్రియమో, హితమో, అనుకూలమో దాని యందు ఆసక్తి కలిగిన వారు సర్వభూతహితే రతులు ***(సర్వేషాం భూతానాం హితే ఆనుకూల్యే రతాః).*** సర్వులకు ప్రియమైనది, హితమైనది ఆత్మే కనుక, సదా ఆత్మ యందే రమించే వారు అని అర్థము. సర్వభూతములకు హితము చేయువారు అనే అర్థమును గ్రహించినా, ఇక్కడ హితము చేయడము అంటే, ఆత్మజ్ఞానమునకు అనుకూలంగా అన్యులకు మేలు చేయడము అని భావము.

**ఆఖ్యాయిక**

ఒకనాటి సాయంత్రం కుటుంబ సభ్యు లందరూ సాగరతీరంలో కూర్చుని ఆనందిస్తున్నారు. పిల్లలు ఇసుకలో ఆడుకుంటున్నారు. వారికి కాస్త దూరంలో ఒక తాత, చేతికి సంచి తగిలించుకొని వంగి వంగి ఏవో ఏరి సంచిలో వేసుకుంటూ తిరుగుతున్నాడు. వంగిన ప్రతిసారి అతడు తనలో తాను ఏదో చెప్పుకుంటున్నట్లు అతని పెదవుల చలనం చెబుతూ ఉంది.

పిల్లలు ఆ తాతను సమీపించబోతే, తల్లిదండ్రులు వాళ్ళను వారించి తమ దగ్గరే ఉంచు కున్నారు.

తాత వయస్సులో చాలా పెద్దవాడుగా ఉన్నాడు. బట్టలు చిరిగి ఉన్నాయి. తల చింపిరిగా ఉంది. పిచ్చివాడేమో అనే అనుమానం కూడా పెద్దలకు కలిగింది. పైగా తాత మధ్య మధ్యలో బిడ్డల్ని చూచి నవ్వుతూ కూడా కనిపించాడు.

కొన్ని మాసాల తరువాత ఒక రోజు సాయంత్రం ఆ కుటుంబం మళ్ళీ సాగరతీరానికి రావడం జరిగింది. తీరంలో ఒక చోట చాలా మంది గుమిగూడి ఉన్నారు. కొందరి చేతులలో పూలమాల లున్నాయి. కొందరి చేతులలో విడిపూలు ఉన్నాయి. అందరూ ఖిన్నవదనులై ఉన్నారు.

అదేమిటో చూద్దామని పిల్లల్ని వెంట పెట్టుకొని తీరంలో ఉన్న కుటుంబీకులు దగ్గరకు వెళ్ళారు. అక్కడ తాత మృతదేహం పండబెట్టి ఉంది. అందరూ ఆయనకు దండలు వేసి దండాలు పెడుతున్నారు.

విచారించి గ్రహించింది ఏమనగా, ఆ తాతకు ఎవ్వరూ లేరు. ఆయన రామభక్తుడు. నిరంతరం రామ ధ్యానంలో కాలం గడిపేవాడు. విరామం దొరికితే సాగరతీరానికి వచ్చేవాడు. అక్కడ పడి ఉన్న గాజు ముక్కల్ని, ముళ్ళను రామనామం చెబుతూ ఏరి సంచిలో వేసుకొని పోయేవాడు. సాగరతీరంలో ఆడుకొనే పసిబిడ్డల చేతులకు కాళ్ళకు అవి గ్రుచ్చుకోకుండా అలా చేసేవాడు. అలా ఆయన జీవిత మంతా పరుల సేవలో, పరమాత్మ స్మరణలో సాగిపోయింది.

గతంలో ఆ తాతను సమీపిస్తున్న తమ బిడ్డలను వెళ్ళ వద్దని వారించిన తల్లిదండ్రులు, ఇప్పుడు బిడ్డల్ని వెంట బెట్టుకొని వెళ్ళి, తాము నమస్కరించి, పిల్లల చేత దండాలు పెట్టించారు.

మహాత్ముల చర్యలు సామాన్యులకు అర్థం కావు. నిస్వార్థపరులు, త్యాగధను లైన మహాత్ములు ప్రపంచానికి





పిచ్చివాళ్ళ లాగే కనిపిస్తారు. ఎవరైనా మహాత్ముల చేతల్ని చూడగలరే గాని, పవిత్రమైన వారి చిత్తాలలో ఏముందో తెలుసుకోగలరా? అందుకనే చాలా మంది మహాత్ములు ప్రపంచానికి అర్థం కాకుండానే మిగిలి పోయారు. వెలిగి పోయారు.

క్షీణకల్మషులు, సంశయ రహితులు, యతాత్ములు, సర్వభూతహితే రతులైన ఋషులు మోక్షరూపులు. వారిలో శోభించే ఈ దివ్య లక్షణాలు సాధకులకు మార్గగాములు.

ఈ విధంగా ఋషులు సమ్యగ్దర్శులై బ్రహ్మానందాన్ని పొందుతారు ***(లభన్తే బ్రహ్మ నిర్వాణం మోక్షమ్).*** నిర్వాణము అంటే వేరొక మతము చెప్పే శూన్యము కాదు. నిర్వాణము అంటే ఆనంద స్వరూపము అని తెలుసుకోవాలి. ***బ్రహ్మ నిర్వాణం ఋచ్ఛతి*** - బ్రహ్మరూప మోక్షాన్ని పొందుతాడు అని రెండవ అధ్యాయం ముగింపు శ్లోకంలో కూడా చెప్పడం జరిగింది.

మోక్షరూపులైన జ్ఞానుల విషయాన్ని తరువాత శ్లోకంలో కూడా చెబుతున్నాడు.

**కామక్రోధ వియుక్తానాం యతీనాం యత చేతసామ్ ।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥** 26

***కామక్రోధ వియుక్తానాం-యతీనాం-యతచేతసాం***

***అభితః-బ్రహ్మనిర్వాణం-వర్తతే-విదితాత్మనాం***

| | | | |
|---|---|---|---|
| కామక్రోధ వియుక్తానాం | = కామక్రోధముల చేత విడువబడిన వారు | బ్రహ్మనిర్వాణం | = బ్రహ్మానందము |
| యతచేతసాం | = నియమింప బడిన చిత్తము గల వారు | అభితః | = అంతటను |
| విదితాత్మనాం | = తెలియబడిన ఆత్మ గలవారు | వర్తతే | = ఉన్నది |
| యతీనాం | = యతులకు | | |

**యతి పురుషులు దేహము ఉన్నా లేకపోయినా మోక్షరూపులే. వారు కామక్రోధాల నుండి విడిపడి పోయారు. మనస్సును స్వాధీన పరచుకున్నారు. ఆత్మను తెలుసుకున్నారు.**

**వ్యాఖ్య**

వస్తు ప్రపంచంలో మనం జీవిస్తున్నాం. విషయ ప్రపంచంలో చరిస్తూ జీవనయాత్రను కొనసాగిస్తున్నాం. ఇది వస్తు ప్రపంచం కనుక వస్తువులతో నిండి ఉంది. కాని, ప్రపంచంలో వస్తువులే ఉన్నాయి. ఇష్ట వస్తువులు, అనిష్ట వస్తువులు అని లేవు. విషయాలే ఉన్నాయి. ఇష్ట విషయాలు, అనిష్ట విషయాలు అనేవి లేవు. ఇవన్నీ ప్రియాప్రియాలు. వ్యక్తులలో ఉన్నవే గాని ప్రపంచంలో లేవు.

ఏది ఇష్ట వస్తువు? అని ప్రశ్నిస్తే, ఫలానా అని చెప్పగలమా? ఒకరికి ఇష్టమైంది మరొకరికి ఇష్టం కాక పోవచ్చు. అలా ఇష్టమైన వ్యక్తికి కూడా ఇష్ట వస్తువు ఎప్పుడూ ఇష్ట వస్తువుగా ఉండ లేదు. దేశకాలాలు మారుతూ ఉంటే, అభిరుచులు మారిపోతూ ఉంటే, ఇష్ట వస్తువులలో ఇష్టం అదృశ్యమై, అది కేవలం వస్తువు గానే మిగిలిపోతూ ఉంటుంది. ఇష్టం ఉన్నంత వరకే వస్తువు వాంఛనీయంగా ఉంటుంది.

మనిషిలో ఏది ఇచ్ఛా విషయంగా ఉందో దానిని మనస్సు అభిలషిస్తూ ఉంటుంది. ఇదే కామము. అట్టి కామనా వస్తువును పొందుటకు చేసే ప్రయత్నానికి విఘాతం కలిగితే, కామం స్థానంలో మనస్సు నందు ద్వేష వృత్తి పుడుతుంది. ఇదే క్రోధము. ఈ కామక్రోధాలు మనస్సును అశుద్ధం చేస్తాయి. జ్ఞానప్రాప్తికి అవరోధాలుగా నిలుస్తాయి. ఈ అవరోధాలను కొనసాగించుకుంటూ జ్ఞానాన్ని పొంది తరించడము సాధ్యమయ్యే పని కాదు.

కనుకనే, ఈ కామక్రోధాల వేగాన్ని అరికట్ట మని ఇరవై మూడవ శ్లోకంలో చెప్పిన గీతాచార్యుడు, వాటిని సమూలంగా త్యజించమని ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు.

కామక్రోధాలు లేని వారు, చిత్తమును వశ పరచుకున్న వారు, ఆత్మను తెలుసుకున్న వారు అయిన యతులు, రెండు విధాల మోక్షమును పొంది ఉన్నారు.

**కామక్రోధ శూన్యులు**

ఇష్ట విషయానికి సంబంధించిన మనోవృత్తి, లేదా వృత్తి విశేషమే కామము. విషయాలు బయట ఉంటాయి. కామము ఇచ్చా విశేషంగా మనస్సులో ఉంటుంది. కామనా బుద్ధి చేత మనస్సు బాహ్య వ్యాపారాల లోకి ప్రవేశించడానికి ఇష్ట వస్తువు కారణ మవుతుంది. మనస్సు యొక్క బాహ్య ప్రవృత్తికి హేతువు కామమే.

కామమునకు విఘాతము కలిగి నపుడు, ఇష్టవస్తువు నందు అనిష్టా బుద్ధి ఏర్పడుతుంది. మనస్సు బాహ్య విషయాల లోకి ప్రవేశించడానికి అనిష్ట వస్తువు కూడా కారణ మవుతుంది. ఈ విధమైన బుద్ధి వృత్తి విశేషమే క్రోధము.

కామక్రోధాలు రెండూ బుద్ధిని కలత పెడతాయి. కలుషితం చేస్తాయి. కామక్రోధాలు ఉన్నాయి అంటే, వాటిని కదిలించిన రాగద్వేషాలు మనస్సులో ఉన్నాయి అని అర్థము. రాగద్వేషాలు మల దోషానికి సంబంధించినవి కనుక బుద్ధిని అశుద్ధం చేస్తాయి. శుద్ధి లేని బుద్ధి జ్ఞానప్రాప్తి సాధనాలైన శ్రవణాదులకు ఉపకరించదు.

కామక్రోధాల చేత కలుషితమైన బుద్ధి విచలిత మవుతూ ఉంటుంది. ఇదే విక్షేపము. విక్షేపానికి మల దోషమే కారణము. ఈ విధంగా కామక్రోధాలు జ్ఞానానికి ముఖ్య ప్రతిబంధకాలుగా తెలుస్తున్నాయి కనుక సాధకుడు వీటిని అరికట్టి తీరాలి. కాని, యతిపురుషులలో ఇవి కోఱలు తీసిన పాముల్లా పడి ఉంటాయి.

ఈ సందర్భంలో ప్రధానంగా ఒక్క విషయాన్ని మనం అర్థం చేసుకోవాలి. ఈశ్వరార్పణ బుద్ధితో కర్మయోగమును అనుష్ఠించు యోగులకు అంతఃకరణ శుద్ధి, జ్ఞానప్రాప్తి, సర్వకర్మ సన్యాసము అనే క్రమంలో మోక్షం సిద్ధిస్తుందని భగవానుడు అడు గడుగున ఉపదేశించి ఉన్నాడు ***(సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మ సంన్యాస క్రమేణ మోక్షాయ ఇతి భగవాన్ పదేపదే అబ్రవీత్).*** ఇంకా ఉపదేశింప బోతున్నాడు కూడా ***(వక్ష్యతి చ).***

చిత్తశుద్ధికి కర్మయోగము సాధనము కాగా, చిత్త నైశ్చల్యానికి ధ్యానము విశిష్టమైన సాధన. కర్మయోగము బహిరంగ సాధన. ధ్యానము అంతరంగ సాధన. ఆరవ అధ్యాయంలో ధ్యాన విశేషాన్ని ప్రవచింప బోతున్నాడు భగవంతుడు. సూత్రప్రాయంగా ఈ అధ్యాయం లోనే చివరి మూడు శ్లోకాలలో ధ్యాన పునాదిని నిర్మించ బోతున్నాడు. ఈ సందర్భంలో, అంటే, ఐదవ అధ్యాయాన్ని సమాప్తి చేస్తూ, ఇక్కడ కూడా కామక్రోధాలను ప్రస్తావించాడు అంటే, ధ్యానానికి కామక్రోధాలను నియమించడం ఎంత అవశ్యమో చెప్పకనే చెప్పిన ట్లైంది. అంతేకాదు, కామక్రోధాలను త్యజించని వాడు ధ్యానయోగి కాలేడు.

***కామః ఇచ్ఛా విషయేషు తస్య ప్రతిహతౌ జాతా చిత్తవృత్తిః క్రోధ ఇతి ఉచ్యతే, తదుభయ పరిత్యాగే ధ్యానాకారి భవేత్!*** - విషయముల యందలి ఇచ్ఛయే కామము. విషయేచ్ఛకు విఘాతం కలిగి నపుడు కలిగే చిత్తవృత్తియే క్రోధము. ఈ రెండిటిని త్యజించిన వాడు ధ్యానానికి అర్హుడు అవుతాడు అని స్వయంప్రకాశ యతీంద్రులు 'మోహముద్గర' గ్రంథ వ్యాఖ్యానంలో వ్రాశారు.





**యత చేతసులు**

నిగ్రహింప బడిన మనస్సు గల వారు యత చేతసులు. మనస్సును నియమించ లేని వారు ధ్యాన ఫలాలను అందుకోలేరు. ధ్యానంలో మనస్సే ప్రధానమైన పరికరము. నిగ్రహం లేని మనస్సు నిర్వికల్పం వైపు నడక సాగించ లేదు. ధ్యానంలో, మన మనస్సును మించి ప్రతిబంధకాన్ని కలిగించే శక్తి మరొకటి ఉండదు.

మనస్సు విషయ ప్రపంచం వైపు ఎందుకు పరుగులు తీస్తూ ఉంది? విషయాలతో సంబంధాలను ఏర్పరచుకో మని ఇంద్రియాలను ఎందుకు పురికొల్పుతూ ఉంది? ఏదో కారణ ముంది. అలాంటి సంయోగములో ఏదో ప్రయోజనం ఉంది. ప్రయోజనం లేకుంటే మనస్సుకు బాహ్య విషయ ప్రవృత్తి ఎందుకు ఏర్పడుతుంది? ప్రయోజనం లేకుండా ప్రవృత్తి ఎలా ఉంటుంది? కనుక ఏదో ప్రయోజన ముంది. ఏదో లాభం ఉంది. కాకపోతే, అది నిజమైన లాభం కాదు. లాభం ముసుగులో దోబూచు లాడే నష్టం. వాస్తవానికి ఇదొక దుష్ట ప్రయోజనం. అనిత్య ప్రయోజనాల వైపు బ్రతుకు నావను మళ్ళించి జనన మరణ సంసార సాగరంలో పడదోసే ప్రమాద భరితమైన వలయం. ఈ విషయంలో మనస్సుకు అవగాహన కల్పించాలి. అప్పుడే మనస్సు నిగ్రహింప బడుతుంది. ఇలా మనస్సును నిగ్రహించిన యతిపురుషులు యత చేతసులు.

**విదితాత్ములు**

విదితాత్ములు అంటే ఆత్మను తెలుసుకున్న వారు. ఆత్మను తెలుసుకోవడము అంటే, ఆత్మయే బ్రహ్మము అని తెలుసుకోవడము. తానే ఆత్మ అనే జ్ఞానము. జీవుడే బ్రహ్మము అనే జ్ఞానము. జ్ఞాతృ - జ్ఞాన - జ్ఞేయ భేదము లేని అఖండాత్మ జ్ఞానము. ఆత్మజ్ఞానమే మోక్షము. ఆత్మను తెలుసుకోవడము, ఆత్మను పొందడము అనేవి రెండు లేవు. ఆత్మ జ్ఞానరూపంలో ఉన్నందున ఆత్మను తెలుసుకోవడమే ఆత్మను పొందడము. ఇదే బ్రహ్మనిర్వాణము. అదే మోక్షము. సర్వత్ర మోక్షము. అంటే దేహము ఉన్నప్పుడు మోక్షమే. దేహం లేకపోయినా మోక్షమే ***(అభితః బ్రహ్మ నిర్వాణం).*** ***అభితః*** అంటే ***ఉభయతః*** అని అర్థం. జీవించినప్పుడే కాక, మరణానంతరము కూడా మోక్షమే. మరణం దేహానికే గాని ఆత్మకు కాదు కదా! కుండ ఉండినా, పగిలినా ఆకాశం యొక్క అనంత స్వరూపంలో మార్పు ఉండదు కదా! మోక్షం కూడా అంతే.

*జ్ఞానానికి అంతరంగ సాధన మైన ధ్యాన సాధనను ప్రధానంగా బోధించుటకు ఆరవ అధ్యాయాన్ని ప్రారంభించబోతూ, ధ్యాన ప్రక్రియను, ప్రయోజనాన్ని స్థాలీపులాక న్యాయంగా మూడు శ్లోకాలలో ప్రస్తావించి, ఆరవ అధ్యాయానికి నాంది పలుకుతూ, ఐదవ అధ్యాయాన్ని సమాప్తి చేస్తున్నాడు.*

**స్పర్శా న్కృత్వా బహి ర్బాహ్యం శ్చక్షు శ్చైవాంతరే భ్రువోః ।**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ ॥** 27

**యతేన్ద్రియమనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః ।**
**విగ తేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్త ఏవ సః ॥** 28

స్పర్శాన్-కృత్వా-బహిః-బాహ్యాన్-చక్షుః-చ-ఏవ-అంతరే-భ్రువోః
ప్రాణాపానౌ-సమౌ-కృత్వా-నాసాభ్యంతర చారిణౌ

యతేంద్రియ మనోబుద్ధిః-మునిః-మోక్షపరాయణః
విగతేచ్ఛా భయక్రోధః-యః-సదా-ముక్తః-ఏవ-సః

| | | | |
|---|---|---|---|
| యః | = ఎవడు | సమౌ | = సమానముగా |
| బాహ్యాన్ | = వెలుపలి వైన | నాసాభ్యంతరచారిణౌ | = ముక్కు లోపలనే సంచరించునట్లు |
| స్పర్శాన్ | = శబ్దాది విషయాలను | యతేంద్రియ మనోబుద్ధిః | = నియమింపబడిన ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని కలవాడై |
| బహిః ఏవ | = వెలుపలనే | విగతేచ్ఛా భయక్రోధః | = కోరికను, భయమును, క్రోధమును విడిచిన వాడై |
| కృత్వా | = చేసి | | |
| చ | = మరియు | | |
| చక్షుః | = దృష్టిని | మోక్ష పరాయణః | = మోక్షాపేక్ష కలవాడై |
| భ్రువోః | = కనుబొమ్మల | మునిః | = మననశీలుడు |
| అంతరే | = నడుమ | సః | = అతడు |
| కృత్వా | = నిలిపి | సదా | = ఎల్లప్పుడును |
| ప్రాణాపానౌ | = ప్రాణాపాన వాయువులను | ముక్తః ఏవ | = ముక్తుడే |

**బాహ్యా విషయాలను బాహ్యం లోనే ఉంచి, కనుబొమ్మల మధ్య దృష్టిని సారించి, ముక్కు లోపల సంచరించే ప్రాణా పాన వాయువులను సమం చేసి, ఇంద్రియ మనోబుద్ధులను నియమించి, కోరిక, భయము, క్రోధములను విడిచి పెట్టి, మోక్షమే ప్రధానంగా భావించు వాడు ఎప్పుడూ ముక్తుడే.**

**వ్యాఖ్య**

పరమేశ్వరుని కొరకు చేసే సాధన లన్నీ ప్రేమకార్యాలు. ఆ కార్యాలలో ఉన్న దంతా ప్రేమే. అందుకే నేమో, ***ప్రేమ కార్యమ్ ! ప్రేమైవ కార్యమ్!*** అని భక్తి సాధనను నిర్వచించాడు నారదమహర్షి. పరమ ప్రేమ స్వరూపుడైన పరమేశ్వరుని కొరకు అనుష్ఠించే సాధన లన్నీ ప్రేమ కార్యాలే అయినా, ధ్యానం ఈశ్వరప్రేమ యొక్క మహోన్నత రూపము.

సంవత్సరాల తరబడి భగవంతుని గురించి శ్రవణం చేసినా, భగవంతుడు ఎంత అర్థమయ్యాడు అనేది ఎవరికి వారు మదింపు వేసుకొని చూడవలసిన విషయం. వింటూనే ఉన్నా భగవంతుడు ఎలాగైతే అర్థం కావడం లేదో, చేస్తూనే ఉన్నా ధ్యానం కుదుట పడిన దాఖలాలు లేవు. భగవంతుడు బుద్ధిలో అర్థం కావలసిన వాడు కనుక, కర్మలకు చిక్కడు. మరి, ధ్యాన మేమిటి? ధ్యానం కూడా కర్మే అయితే, ధ్యానం వల్ల కూడా ఆయన మనకు దక్కడు అని అర్థం.

'ధ్యానం' అనేది క్రియాపదం కాదు, నామవాచకం. కనుక నువ్వు ధ్యానం చెయ్యలేవు. ధ్యానంలో ఉండ గలవు. సక్రమంగా ధ్యానం అలవడిన వారికి ఈ సత్యం అనుభవానికి అందుతుంది. ధ్యానం అనేది చేసేది కాదని, చైతన్యంలో అలా ఉండి పోవటమే నని ధ్యాన సమయంలో ధ్యానయోగి అర్థం చేసుకుంటాడు.

ధ్యానం చేస్తున్నాను అంటాడు ధ్యానయోగి. దేనిపై ధ్యానం చేస్తున్నావు? అని ప్రశ్నిస్తే, అతడు దేనిపై ధ్యానం చేసినా, అది బాహ్యానికి సంబంధించింది మాత్రం కాదు. బాహ్యం లోని వస్తువును గూర్చి చింతించడము కాదు. నిత్య జీవితంలో మన కన్నా అన్యమైన వాటిని ఎలా చింతిస్తున్నామో, అలా చింతన చేయడం ధ్యానం కాదు. నిత్యము మనము ఆచరించే ఏ కర్మతో కూడా ధ్యానానికి సామ్యము లేదు. కనుక, ధ్యాన సాధన ధన్యమైనదే అయినా, అనుకున్నంత సులభమైంది కాదు. అందుకనే, ప్రత్యేకించి ఒక అధ్యాయాన్నే భగవంతుడు గీతలో ధ్యానానికి కేటాయించాడు.

ధ్యానయోగి ధన్యజీవి. ధ్యానంలో ప్రవేశించే ముందు అతడు ఎలా ఉన్నాడో, ధ్యానం నుంచి బహిర్ముఖమయ్యే సమయానికి అలా ఉండడు. ఒక నూతనోత్సాహంతో, వినూత్నమైన శక్తితో విలసిల్లుతుంటాడు. పరిమితమైన దేహేంద్రియాదులకు అతీతంగా విహరించడం వల్ల ప్రాప్తించిన నూతన చైతన్యంలో ఓలలాడుతుంటాడు. బాహ్య విషయాలు, దేహేంద్రియాలు విధించిన పరిమిత జీవనం నుండి స్వేచ్ఛను పొంది హద్దు లేని ఆనంద సామ్రాజ్యంలో చైతన్య శక్తిగా విరాజిల్లుతూ ఉంటాడు.





కనుక, ధ్యానం అనేది ఒక ఆనంద క్రీడా విలాసము. ధ్యానంలో బాధలు లేవు. భయాలు ఉండవు. భయపెట్టడానికి, బాధపెట్టడానికి లోపల ఎవరున్నారని? అలాంటివి ఏవైనా ఉంటే, ఎవరైనా ఉంటే, అవన్నీ బాహ్యం లోనే ఉన్నాయి. ఆంతర్యంలో లేవు. ధ్యానంలో లేవు. ధ్యానంలో నువ్వే ఉన్నావు. నీతో పాటు ఒకే ఒక వ్యక్తి ఉన్నాడు. అతడే పరమేశ్వరుడు. నిన్ను నీవు ఎలాగూ భయ పెట్టుకోవు. ఇక భగవంతుడు అంటావా? ఆయన నీకు అభయ ప్రదానం చేసేందుకు ఉన్నాడే కాని భయ పెట్టడానికి కాదు. కాకపోతే, ఆంతరంగికంగా ఆనందానుభూతిలో ఓలలాడే మీ ఇరువురి మధ్య మరెవరూ ప్రవేశించకుండా నువ్వే జాగ్రత్త పడాలి. శోభన జీవితం లోకి వేదనలు చొరబడకుండా చూసుకోవాలి. ఈ విధమైన సూచన తోనే శ్లోకాన్ని ప్రారంభిస్తూ, ధ్యానసదనం తలుపులు తెరుస్తున్నాడు భగవంతుడు.

**ఉన్న చోటే ఉండనీ**

స్పర్శలు అంటే అనుభవింపబడే శబ్దాది విషయాలు అని ఇప్పటికే తెలుసుకున్నాం. శబ్దాదులు బాహ్యంలో ఉన్నాయి. అలా బాహ్యంలో ఉండే శబ్దాది విషయాలను బాహ్యం లోనే ఉంచి ***(బాహ్యాన్ స్పర్శాన్ బహిః కృత్వా)*** ధ్యానాన్ని ప్రారంభించాలి.

బాహ్య స్పర్శలు అంటే దేహానికి బాహ్యంలో ఉన్న శబ్దాదులు. మరి, బాహ్యవిషయాలు బాహ్యం లోనే ఉన్నాయి కదా! ఒక వైపు బాహ్యవిషయాలు అంటూ మరొక వైపు వాటిని బాహ్యం లోనే ఉంచాలి అని చెప్పడంలో ఆంతర్య మేమిటి?

బాహ్య విషయాలైన శబ్దాదులు బాహ్యం లోనే ఉంటే, అలా చెప్పవలసిన అవసరం లేదు. కాని, అవి అంతః ప్రవేశము చేసే అవకాశము లేక పోలేదు. అదే జరిగితే, ఆ తరువాత ఏదైనా జరుగుతుందేమో కాని ధ్యానం మాత్రం జరగదు.

బాహ్యంలో రూపా లున్నాయి. అవి చక్షురింద్రియానికి దృశ్యాలు. నేత్రాలు రూపాలను వీక్షించ గానే, అవి లోనికి ప్రవేశించి మనస్సులో విహరిస్తూ ఉంటాయి. ధ్యాన సమయంలో నేత్రాలు మూస్తాము కదా, అని మీరు అనుకోవచ్చు. కళ్ళు మూసి ధ్యానమగ్నమై ఉన్నా, బాహ్యంలో శబ్దం ఏర్పడితే, అందులోనూ అది మనకు ప్రియమైన శబ్దమైతే, అప్రయత్నంగా కళ్ళు తెరుచుకుంటాయి. ఒకవేళ కళ్ళు హఠం చేసినా శబ్దాలు చెవుల గుండా లోనికి వెళ్ళి, మనస్సును ప్రేరేపించి, తద్వారా కళ్ళను తెరిపిస్తాయి.

కనుక, బాహ్యంలో ఉండే శబ్దాది విషయాలను ధ్యాన సమయంలో లోనికి ప్రవేశించకుండా నిలువరించాలి. బాహ్యంలో ఉన్న వాటిని బాహ్యం లోనే ఉంచాలి. అదెలా సాధ్యం? అర్థం చేసుకుంటే సాధ్యం.

బాహ్యంలో విషయా లున్నాయి. బాహ్యంలో ఉన్న విషయాలన్నీ మన లోకి ప్రవేశిస్తాయా? ఏమో! నాకు అలా అనిపించడం లేదు. ప్రపంచం లోని విషయాలన్నీ పట్టడానికి కావలసినంత ఖాళీ స్థలం మనస్సులో ఉంటుందని నేను భావించడం లేదు. విషయాలు బాహ్యంలో ఎన్నయినా ఉండొచ్చు. మనం ఏ విషయాలను గూర్చి ఆలోచిస్తామో అవే మన మనస్సు లోకి ప్రవేశిస్తాయి.

మన ఇంట్లో జరిగే వివాహానికి మనం ఎవర్ని ఆహ్వానిస్తామో వారే వస్తారు గాని, ఊరిలో ఉన్న వాళ్ళందరూ వస్తారా? 'పిలవని పేరంటము' అనేది నానుడే గాని, దానికి కూడా పీటలు, పట్టు వస్త్రాలు ఉంటాయా? ఇదీ అంతే.

బాహ్యములో ఏ విషయాలు ఉన్నవో, వాటిని గురించి చింతించి నపుడు మాత్రమే అవి మన లోకి ప్రవేశిస్తాయి. వాటిని గూర్చి చింతించ నపుడు అవి లోనికి ప్రవేశించ గలుగుతాయా? ప్రవేశించ లేవు. మరి, అప్పుడు అవి ఎక్కడ ఉంటాయి? లోపలికి ప్రవేశం లేదు కనుక బయటే ఉంటాయి. అదే చేయమంటున్నాడు ధ్యానానికి ముందు. ఒక్క మాటలో చెప్పాలంటే, ధ్యానాన్ని ప్రారంభించే ముందే బాహ్య విషయ చింతనమును త్యజించాలి అని అర్థము. బాహ్య విషయ స్పృహ లేకుండా ఉండాలి. చింతన సాగకుండా చూసుకోవాలి.

అవరోధం కలిగిస్తా యని వస్తువుల్ని దూరం చేయ నవసరం లేదు. ప్రతిబంధకాలు ఎదురౌతా యని, విషయాలకు దూరంగా పారిపో నవసరం లేదు. విషయాలు లోనికి రాకుండా వాటిని బయట అరుగుల మీద కూర్చోబెట్టాలే గాని, మనం పరుగులు తీస్తే పొందే ప్రయోజనం మాత్రం శూన్యం.

తలుపులు తెరిస్తేనే మనిషి లోనికి ప్రవేశిస్తాడు. మనం ఆలోచిస్తేనే విషయాలు మనస్సు లోకి ప్రవేశిస్తాయి. పలకరిస్తేనే పులకరింతలు. పట్టించుకుంటేనే విషయాలు పని పెట్టుకుంటాయి. మనం పట్టించుకోక పోతే అవి మనల్ని పట్టుకొని కూర్చోవు. బయటే ఉంటాయి. ఈ విధంగా విషయాలను బయటపెట్టి, ధ్యాన వ్యాపారాన్ని లోపల సాగించాలి.

**భ్రూమధ్యంలో నిలపాలి**

బాహ్య విషయాలను బాహ్యంలో ఉంచిన తరువాత దృష్టిని భ్రూమధ్యంలో, అంటే కనుబొమ్మల మధ్య ఉంచాలి (***చక్షుః చైవ అంతరే భ్రువోః కృత్వా***). ఇదే ధారణ. ఏకాగ్రత కలగడానికి ధారణ ఉపకరిస్తుంది. ధారణ ప్రధానంగా ఏకాగ్రత కొరకే. భ్రూ మధ్యములో ఇలా దృష్టిని నిలిపి ధ్యానాత్పూర్వం కొనసాగించే ధారణను 'ఖేచరీ' ముద్రగా అభివర్ణించింది యోగమార్తాండము.

***భ్రువోః అంతర్గతా దృష్టిః ముద్రా భవతి ఖేచరీ!*** - ఇక్కడ, ఈ ఖేచరీ ముద్రలో భ్రూమధ్యంలో దృష్టి నిలపడానికి నేత్రాలు అర్ధ నిమీలనంగా ఉండాలని యోగమార్తాండము సూచించింది. ధ్యానంలో నేత్రాలను తెరిస్తే, మనస్సు బహిర్ముఖ మవుతుందని, మూస్తే నిద్ర వచ్చే ప్రమాదం ఉందని, అర్ధ నిమీలనంగా ఉంటే ఈ రెండు ప్రతిబంధకాలు ఉండ వని యోగమార్తాండం అభిప్రాయ పడింది. అదొక అభిప్రాయం మాత్రమే. ఈ విషయా లన్నీ ధ్యానయోగంలో విస్తారంగా విశ్లేషించుకుందాం.

దృష్టిని ఒక ప్రదేశము నందు నిలపడం అనేది ధారణ. పతంజలి మహర్షి తన యోగదర్శనంలో కూడా అలాగే సూత్రీకరించాడు. ***సూ॥ దేశబన్ధ శ్చిత్తస్య ధారణా*** - చిత్తము యొక్క (***చిత్తస్య***), లేదా చిత్తమును ఒక స్థానము నందు లేక ప్రదేశము నందు నిలుపుట (***దేశబన్ధః***) ధారణ అనబడుతుంది (***ధారణా***). ముందు ధారణ ఏర్పడితే, ఆ తరువాత ధ్యానం సహజంగా సాగుతుంది.

ఈ సందర్భమున గీతలో భగవంతుడు భ్రూ మధ్యమును ప్రతిపాదించాడు. శాస్త్రాలలో, ముఖ్యంగా యోగ ప్రధానమైన శాస్త్రాలలో ధారణ కొరకు అనేక ప్రదేశాలను సూచించడం జరిగింది. నాసికాగ్రము, జిహ్వాగ్రము, హృదయ స్థానము, నాభిచక్రము ఇలా అనేక ప్రదేశాలు చెప్ప బడ్డాయి. అంతేకాదు, యోగశాస్త్రాలలో ఆయా ప్రదేశాలలో సాగించే ధారణ వల్ల కొన్ని ప్రత్యేక ప్రయోజనాలు, సిద్ధులు సమకూరుతాయి అని కూడా చెప్పబడింది. భగవద్గీత మోక్ష శాస్త్రం కావడం చేత అలాంటి వాటిని స్పృశించదు.



**నాసికంలో నడపాలి**

బాహ్య విషయాలను బాహ్యం లోనే ఉంచి, దృష్టిని భ్రూమధ్యంలో నిలిపిన తరువాత, నాసాభ్యంతర మున, అనగా ముక్కు రంధ్రాలలో చలిస్తున్న ప్రాణాపాన వాయువులను సమం చేయాలి. ఇది ప్రాణాయామము. యోగ ప్రక్రియ.

***శ్వాస ప్రశ్వాసయోః గతి విచ్ఛేదః ప్రాణాయామః*** - బయట ఉన్న గాలిని లోనికి పీల్చడం శ్వాస అయితే, అలా పీల్చిన గాలిని బయటికి విడిచి పెట్టడం ప్రశ్వాస. మామూలుగా సాగిపోయే ఈ శ్వాస ప్రశ్వాసల గతికి విచ్ఛేదమును కలిగించడమే ప్రాణాయామము అన్నాడు పతంజలి మహర్షి.

ధ్యానము అనేది మానస వ్యాపారము. మనో వ్యాపారము ప్రాణాధీనంగా ఉంటుంది. ప్రాణము నియమింప బడితే, మనస్సు నియమింప బడుతుంది. మనస్సు కలత చెందితే ప్రాణము కూడా కలత చెందుతుంది. అందుచేత, శ్వాస ప్రశ్వాసలు గతి తప్పి చలిస్తూ ఉండటం మనం చూస్తాం. ప్రాణ మనస్సులు పరస్పరాధీనాలు. ఈ కారణం చేత ధారణ ధ్యానాల మధ్య ప్రాణాయామాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది. మనో నిగ్రహమే ఇక్కడ ముఖ్య ప్రయోజనము. కాని, ఈ విధమైన ముఖ్య ప్రయోజనమే గాక, అవాంతర ప్రయోజనము కూడా ఉంది అన్నాడు పతంజలి. ప్రాణాయామం వల్ల పాపక్షయం జరుగుతుంది అని కూడా సూత్రంలో విశద పరచడం జరిగింది.

***సూ॥ తతః క్షీయతే ప్రకాశావరణమ్*** - ప్రాణాయామము వల్ల (***తతః***) వివేకమును మూసి వేసిన కర్మ (***ప్రకాశావరణమ్***) క్షీణిస్తుంది (***క్షీయతే***) అన్నాడు యోగసూత్రంలో మహర్షి పతంజలి.

ఇది సూత్రము కనుక భాష్యాధీనము అనేది మరచి పోకూడదు. ఇక్కడ కర్మ అంటే, కర్మను ఆచరించి పొందిన పాపము, అట్టి పాపము చేత కలిగిన దుఃఖము అని అర్థము. ప్రాణాయామ అభ్యాసము చేత ఈ విధమైన దురితములు దుర్బలాలై క్షీణిస్తూ ఉంటాయని ప్రతీతి. కాకపోతే, ప్రాణాయామం వల్ల పాపాలు క్షీణిస్తాయే గాని పూర్తిగా నశించవు. పాపనాశము అనేది తపస్సు యొక్క ఫలం. కాని, ఆధునిక గురువులు ప్రాణాయామం వల్ల పాపాలు పూర్తిగా నశించి పోతాయి అని చెబుతున్నారు. కొందరైతే మరో అడుగు ముందు కేసి, కేవలం ప్రాణాయామం వల్లనే పరమార్థం ప్రాప్తిస్తుంది అని గాలి మాటలు పలుకు తున్నారు. ఏం చేద్దాం? కలియుగం ఇలాగే ఉంటుంది. నోరు చెప్పే వాడిది కదా! మన దేమి పోయింది? అనుకుంటాడు వినేవాడు. చెవులు వినే వాడివి కదా! నా కొచ్చే నష్టమే ముంది? అనుకుంటాడు చెప్పేవాడు. ***వ్యాపారం గందరగోళం - వ్యాపారి గంపశంకరం.*** అంతే.

'ఆయామః' అంటే నిగ్రహము. 'ప్రాణాయామః' అంటే ప్రాణమును నియమించుట అని అర్థము. మనస్సును నిశ్చలంగా ఉంచడానికి ప్రాణాయామం సహకరిస్తుంది. ప్రాణాయామం యోగ ప్రక్రియ కనుక, ఎవరికి వారుగా దీనిని అభ్యసించడం కన్నా, ప్రాణాయామంలో ప్రావీణ్యత సాధించిన వ్యక్తి శిక్షణలో అభ్యసించడం మంచిది.

ప్రాణానికి సంబంధించి మనస్సును నియమించడానికి మరొక అభ్యాసము ఉంది. దానిని ప్రాణ వీక్షణం అంటారు. ఇది కూడా ప్రాణానికి సంబంధించిందే గాని, ప్రాణాయామం మాత్రం కాదు.

ప్రాణాయామం చేసేది. ప్రాణ వీక్షణం చూచేది. ప్రాణ వీక్షణంలో మన శ్వాసల్ని మనం సాక్షిగా పరిశీలించడం జరుగుతుంది. బయట గాలి లోనికి పీల్చడము అనే పూరకమును, లోపల గాలిని బాహ్యానికి విడవటము అనే రేచకమును సాక్షీమాత్రంగా వీక్షించడము ప్రాణవీక్షణము. మనస్సును ప్రశాంతంగా

ఉంచడానికి ప్రాణ వీక్షణము ఉపయోగ పడుతుంది. మనస్సు ఆందోళన చెంది నపుడు గాని, కోపము తీవ్ర స్థాయికి చేరి నపుడు కాని, భయాన్ని కలిగించే పరిస్థితులు తలెత్తి నపుడు కాని ఈ ప్రాణ వీక్షణాన్ని అభ్యసిస్తే వెంటనే మీరు దాని ఫలితాన్ని చూడవచ్చు.

**అదుపులో ఇంద్రియ మనోబుద్ధులు**

ధ్యానయోగి ఇంద్రియ మనోబుద్ధులను నియమించి ఉంటాడు. ఇంద్రియాలను ఇంద్రియ విషయాల నుండి విరమించడము ఇంద్రియ నిగ్రహము. విషయాల నుండి విరమించడము అంటే స్థూలంగా విషయాలకు దూరం కావడం కాకుండా, విషయాల యందు ఆసక్తి లేకుండా చూసుకోవాలి. విషయాల లోని దోషాలను విచారించడము చేత అది సాధ్య మవుతుంది. విచారము విస్తృత మయ్యే కొలది, అవసర నిమిత్తము విషయాల మీద మనం స్వేచ్ఛతో మనస్సు పెట్టడం జరుగుతుందే గాని, విషయాలు వాటంతట అవి అటు ఇంద్రియాలను గాని, ఇటు మనస్సును గాని ఆకర్షించి ప్రలోభ పెట్టే స్థాయిలో ఉండవు. ఈ విధంగా విషయాల నుండి ఇంద్రియాలు విముఖం కావడమే అష్టాంగ యోగములో 'ప్రత్యాహారము'.

విషయాలు ఇంద్రియాలను ప్రేరేపించి నపుడు మనస్సు శక్తివంతంగా ఉండాలి. మనస్సుకు అవగాహన కల్పించాలి. విషయాల లోని దోషాలను అర్థమయ్యేలా చేయాలి. అప్పుడు మనస్సు ప్రపంచం నుండి విరమిస్తుంది. ఇంద్రియాలను విషయాల వైపు త్రిప్పేది మనస్సే కనుక, విషయాల నుండి మనస్సు వెనుకకు మరలగానే, ఇంద్రియాలు కూడా విషయాల నుండి విడిపడి మనస్సును అనుకరిస్తాయి. ప్రత్యాహారము ఇలా సాగుతుంది అంటాడు పతంజలి.

**సూ॥ స్వ విషయ సంప్రయోగే చిత్త స్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః**

ఇంద్రియాలకు ***(ఇంద్రియాణామ్)*** ఇంద్రియ విషయాలతో సంబంధము లేకపోవుట చేత ***(స్వ విషయ అసంప్రయోగే)***, చిత్తాకారమునే అనుకరించుటను ***(చిత్త స్వరూపానుకార ఇవ)*** ప్రత్యాహారము అంటారు అని యోగ దర్శనములో మహర్షి పతంజలి.

ఇంద్రియ మనోబుద్ధులను నిగ్రహించిన ధ్యానయోగి మననశీలుడై మోక్షపరాయణుడు కావడానికి ఇచ్ఛా భయ క్రోధాదుల నుండి విడిపడి ఉంటాడు.

**దూరమైన ఇచ్ఛా భయక్రోధాలు**

ఇచ్ఛ అంటే కోరిక. అదే కామము. కామము అనేది రాగవృత్తి. క్రోధము అనేది ద్వేషవృత్తి. ఈ సందర్భంలో ఇచ్ఛాక్రోధాదులు అని భగవంతుడు చెప్పినవే గతంలో అనేక చోట్ల ప్రస్తావించిన కామక్రోధాదులు. వాటికి తోడు భయ మనే గుణము ప్రత్యేకించి చెప్పబడింది. కనుక, కామక్రోధాలు, భయము నుండి విడిపడిన వాడు 'విగతేచ్ఛా భయక్రోధుడు'.

ఏ కోరికల నుండి విడిపడాలి అని అనుకుంటున్నామో, ఆ కోరికలు మనవే. అవివేకం చేత మనం తయారు చేసుకున్నవే. అవి మరెవరివో కావు. మనం తగిలించుకున్న వాటిని మనమే తొలగించు కుంటున్నాము. తగిలించుకు న్నంత తేలికగా వాటిని తొలగించు కోవడము సాధ్య పడదు. తగిలించుకునే సమయంలో అవి మన కన్నా అన్యంగా ఉన్నాయి. కాని, ఇప్పుడు అవి మనతో తాదాత్మ్యం చెంది పోయాయి. తొలగించుకోను వీలు కానంతగా మమేకమై పోయాయి. కనుక, వాటిని వివేకంతో దూరం చేసుకోవాలి.

కామక్రోధాలను పదే పదే భగవంతుడు ప్రస్తావిస్తున్నాడు అంటే, వాటిని జయించడం ఎంత కష్టమో





అర్థం చేసుకోవచ్చు. కామదహన సన్నివేశాన్ని పెద్దలు హాస్యస్ఫోరకంగా చెబుతూ ఉంటారు. కామక్రోధాలలో ఏది దారుణమో వివరించ లేక అలా చెబుతూ ఉంటారు.

మన్మథుణ్ణి దగ్ధం చేసి వాడి మీద పై చేయి సాధించగలిగా నని శివుడు సంబర పడిపోతే, ఏమైతే నేమి పార్వతి నిచ్చి శివుడికి పెళ్ళి చేయ గలిగాను. చస్తే ఏమి? చచ్చైనా సరే శివుడి మీద పై చేయి సాధించ గలిగాను అని మదనుడు మురిసి పోయాడట. ఇంతకీ ఇద్దరిలో పై చేయి ఎవరిదో ఆ పై వాడికే తెలియాలి.

కామక్రోధాలతో పాటు భయం నుండి కూడా యతి పురుషుడు విడిపడి ఉంటాడు. రెండవ వస్తువు ప్రమేయం తోనే భయం పుట్టు కొస్తుంది. అద్వితీయాత్మ తానే అనే జ్ఞానం కలిగిన వానికి భయం ఎలా ఉంటుంది? కనుకనే అతడు మౌని.

**మననశీలుడు మోక్ష పరాయణుడు**

మననశీలుడు, అంటే మననం చేసేవాడు ముని ***(మననాత్ మునిః)***. మునియే సన్యాసి. అతడే యతిపురుషుడు. మోక్షమే పరమగతిగా కలవాడు కనుక, అతడు మోక్షపరాయణుడు. ఎవడు ఈ విధంగా ఉన్నాడో ***(యః)*** అట్టి యతిపురుషుడు లేదా సన్యాసి ***(సః)*** నిత్యము ముక్తుడే అగుచున్నాడు ***(సదా ముక్త ఏవ)***. అతడు నిత్యముక్తుడు. నిత్యసన్యాసి. ఐదవ అధ్యాయం - మూడవ శ్లోకంలో నిత్యసన్యాసిగా కీర్తింపబడ్డ వాడు ఇతడే. జీవించి ఉండగానే ముక్తుడు. జీవన్ముక్తుడు.

*ఈ విధంగా ధ్యానంలో సమాహితమైన చిత్తం కలవాడు తెలుసుకుంటున్నది ఏమిటో, పొందుతున్నది ఏమిటో తెలియజేస్తూ ఐదవ అధ్యాయాన్ని సమాప్తి చేస్తున్నాడు.*

**భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్ ।** 29
**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి ॥**

**భోక్తారం-యజ్ఞతపసాం-సర్వలోక మహేశ్వరం**
**సుహృదం-సర్వభూతానాం-జ్ఞాత్వా-మాం-శాంతిం-ఋచ్ఛతి**

| | | | |
|---|---|---|---|
| యజ్ఞతపసాం | = యజ్ఞతపస్సులకు | మాం | = నన్ను |
| భోక్తారం | = భోక్తగా | జ్ఞాత్వా | = తెలిసికొని |
| సర్వలోక మహేశ్వరం | = సర్వ లోకములకు ప్రభువు | శాంతిం | = శాంతిని |
| సర్వభూతానాం | = సర్వభూతములకు | ఋచ్ఛతి | = పొందుచున్నాడు |
| సుహృదం | = మిత్రుడుగా | | |

**అర్జునా! నేను యజ్ఞ తపస్సుల ఫలమును అనుభవించే వాణ్ణి. సర్వ లోకములకు ప్రభువును. సమస్త ప్రాణులకు మిత్రుణ్ణి. ఇలా నన్ను తెలుసుకొని శాంతిని పొందు.**

**వ్యాఖ్య**

**శాంతి స్వరూపం**

జీవితంలో మనిషి ఆశించే దానికి, నిజ జీవితంలో జరుగుతున్న దానికి పొత్తు కుదరడం లేదు. జీవితంలో జరిగే వాటికి, వాటిని తాను అర్థం చేసుకొనే పద్ధతికి అసలే సంబంధం లేదు. ఇక్కడే మనిషి బ్రతుకులో ఘర్షణ ఆరంభ మవుతూ ఉంది. రోజు రోజుకీ శాంతి అనేది కుందేటి కొమ్ముగా మారుతూ ఉంది. అంతా

విచిత్రంగా సాగిపోతూ ఉంది. కాని, మనస్సుకు ఇది అర్థం కావడం లేదు. అందుకే మనస్సు అశాంతితో అలమటిస్తూ ఉంది.

ఏదీ ఎవరిదీ కాని ఈ ప్రపంచంలో అన్నీ తమవే నని, తమ కొరకే ఉన్న వని అందరూ భావిస్తున్నారు. ఇది వాస్తవమే అయితే, అందరూ సంతృప్తితో ఉండేవారు. శాంతిలో ఓలలాడే వారు. అలా ఎందరున్నారీ ప్రపంచంలో ఆలోచించండి?

పొందిన ఏ ఒక్క దానిని నిలబెట్టుకొనే అవకాశం, సామర్థ్యం లేకపోయినా, ప్రతి మనిషికి ఈ లోకంలో ప్రతి ఒక్కటి కావాలి. అన్నీ అందరికీ ఎలా లభిస్తాయి? పోనీ లభించాయే అనుకుందాం. ప్రపంచంలో ఉన్న వన్నీ మనిషికి హస్తగత మైతే, అవన్నీ ఎక్కడ పెట్టుకోవాలి? ప్రపంచం పట్టే అంత స్థలం ఎక్కడుంది? మళ్ళీ అశాంతేనా! మరి, హస్తగతమైన తరువాత, ఎక్కడో ఒకచోట పెట్టుకోవాలి కదా? అదెక్కడ? పొలాలలో పండిన ధాన్యాన్ని తెచ్చి గాదెలలో నింపుకుంటున్నాం. వ్యాపారంలో సంపాదించిన ధనాన్ని బ్యాంకులలో పెట్టుకుంటున్నాం. అనుభవాలను, నిందాస్తుతులను, సుఖదుఃఖాలను, జయాపజయాలను, ఆవేదనలను, అవమానాలను, అశాంతిని, అన్నిటిని మనస్సులో దాచుకుంటున్నాం. కాని, విశ్వమంతా మనదే అయితే, దానిని ఎక్కడ పెట్టుకోవాలి? చెప్పండి. మీరు చెబుతారనే ఆశ తోనే ప్రశ్నిస్తున్నాను. చెప్పండి. నోరు విప్పి మాట్లాడండి. మనస్సు విప్పి ఆశించిన వారు నోరు విప్పి మాట్లాడ రెందుకని? ఏం మాట్లాడతారు? ఆలోచించే కొద్ది కళ్ళు మూత పడు తున్నాయే గాని, మార్గం ఎక్కడా తెరుచుకోవడం లేదు. మరి, దీనికి ఉపాయ మేమిటి?

మీరు చెబుతారా, నన్ను చెప్పమంటారా? మీరెలాగూ చెప్పడం లేదు. దాని అర్థం నన్ను చెప్పమనే కదూ? చెబుతాను వినండి! ప్రపంచం అంతా మన హస్తగత మైతే, ఎక్కడున్న దానిని అక్కడే ఉంచుకోవాలి. అంతే. మరి, ప్రస్తుతం ఉన్న ప్రపంచం అలాగే ఉంది కదూ! మధ్యలో అశాంతి తల దూర్చింది ఎక్కడ?

మరి, అలా ఉంచేస్తే ఏది నాదైనట్లు? అదలా ఉంచండి. ఇంతకీ మీది ఏదో, అది ఒక్కటి చెప్పండి. దానిని ఎక్కడ ఉంచుకున్నారో కూడా చెప్పండి. తరువాత ప్రపంచాన్ని ఎక్కడ ఉంచాలో ఆలోచిద్దాం.

అయ్యో! మొన్ననే నేనొక కంప్యూటర్ కొన్నాను. దానిని మా ఇంట్లో నా పడక గదిలో పెట్టుకున్నాను.

సరే, మంచిది. కంప్యూటర్ నీది. గృహం కూడా నీదే. నీదైన కంప్యూటర్‌ను నీదైన గృహంలో పెట్టుకున్నావు. అంతా సవ్యంగా ఉంది. ఇక, ఆదుర్దా ఏముంది?

మరి, నీ ఇంట్లో నీ వస్తువు ఉన్నప్పుడు ఆందోళన చెందని నీవు, నీవు సాధించుకున్న ప్రపంచం నీదైన ప్రపంచం లోనే ఉండే టప్పుడు దేని కోసం ఆదుర్దా పడుతున్నావు? ప్రపంచం అంతా నీది కావాలి. విశాలమైన ఆ ప్రపంచం నీ కున్న ఒక ఇంటి లోనో, లేదా రెండు ఇండ్ల లోనో సర్దుకు పోవాలి. సరిపెట్టుకోవాలి. అంతేనా? ఆశ చాలా పెద్దది. అవగాహన చాలా చిన్నది. ఆశ ఆకాశ మంత. అవగాహన ఆవగిం జంత. ఏదీ నిలుపుకోలేని చిన్న బుద్ధిలో శాంతి నిలుస్తుందా? మరి, శాంతిని పొందే దెలా?

చెప్పనా? ప్రపంచం అంతా నాది కావాలని ఆశించడం తప్పు కాదు. నీదే అయిన తరువాత, ఎక్కడ దాచుకోవాలి? అని ప్రశ్నించుకోవడం కూడా తప్పు కాదు. నీదైనది నీది కాని చోట లేదు అనేది అర్థం కాకపోవడమే దోషం.

అన్నీ నీవే. అన్నీ ఉన్నాయి. ఎక్కడున్నవి అక్కడ ఉన్నాయి. ఉండవలసిన రీతిలో ఉన్నాయి. లేని దంటూ లేదు. లేని దంటూ లేదు కనుక, లేని దాని కొరకు ప్రయత్నమూ లేదు.





హృదయంలో కొరత లేదు. వెలితి లేదు. అశాంతి లేదు. హృదయంలో శాంతి నిండుకుంది. బ్రతుకంతా శాంతిమయ మైంది. ఈ శాంతి పట్టుకోవడంలో చిక్కిందా? లేక విడిచి పెట్టడంలో దక్కిందా? నేను చెప్పనా! 'పట్టుకొని పోగొట్టుకున్నాం. విడిచిపెట్టి రాబట్టుకున్నాం'. అంతే. ఇదే సన్యాసము. కర్మసన్యాసము. జ్ఞానకర్మ సన్యాసము. అమృతానంద ప్రాప్తికి హేతువైన సన్యాసము ***(త్యాగే నైకే అమృతత్వ మానశుః).***

ప్రపంచంలో ఇప్పుడు నాది ఏది? పోనీ, నాది కాని దేదో చెప్పండి. నా కున్న దేమిటి? నాకు లేని దేమిటి? చెప్పనా! 'నాకు ఏదీ లేదు. కాని, నాకు లేని దంటూ లేదు'. ఏదుందో, ఏది లేదో నాకు అవసరం లేదు. నేను ఉన్నాను. చాలు. నాలో శాంతి ఉంది. కాదు కాదు, నేనే శాంతి. నా స్వరూపమే శాంతి.

ఇది పూర్ణ శాంతి. పూర్ణానంద శాంతి. దీనిని పెంచేవారు లేరు. తగ్గించే వారు లేరు. ఇది చెదరని శాంతి. కరగని శాంతి. తరగని శాంతి.

ఇప్పుడు చెప్పండి. శాంతిని పొందడానికి ఏం చెయ్యాలి? శాంతికి కారణా లేమున్నాయి? బాహ్యంలో ఏమీ లేవు. శాంతి మన స్వరూపం. శాంతి బాహ్యము నుండి కొనేది కాదు. ఆంతర్యంలో కనుగొనేది.

అశాంతికి కారణా లున్నాయి. శాంతికి కారణాలు లేవు. కనుక, వాస్తవానికి మన ప్రయత్నా లన్నీ అశాంతి కొరకే గాని శాంతి కొరకు కాదు. ఇది మనస్సుకు అర్థమైతే, ఆ తరువాత అశాంతి కొరకు ప్రయత్నించదు. శాంతి సాగరంలో పవ్వళిస్తుంది.

శాంతి అనేది అన్వేషణలో దొరికేది కాదు. అవగాహనలో దక్కేది. దివ్యంగా శోభించేది. అందుచేతనే, అర్జునా! నన్ను తెలుసుకొని ***(మాం జ్ఞాత్వా)*** మానవుడు శాంతిని, సర్వ సంసార నివృత్తిని, మోక్షమును పొందుతున్నాడు ***(శాంతిం సర్వ సంసార ఉపరతిం ఋచ్ఛతి ప్రాప్నోతి)*** అని జ్ఞానకర్మ సన్యాసానికి ఫలమైన శాంతిని అందించి అయిదవ అధ్యాయాన్ని సమాప్తి చేస్తున్నాడు.

### అభేద దర్శనం

పరమేశ్వరుణ్ణి తెలుసుకుంటే శాంతిని ఎలా పొందుతాము? తెలుసుకొనేది మన కన్నా అన్యంగా ఉంటుంది. పొందింది మనదై ఉంటుంది. పొందిన దానిని తెలుసుకోవడం అంటే అర్థం చేసుకోగలం కాని, తెలుసుకుంటే పొందినట్లే అనే దానిని ఎలా అర్థం చేసుకోవాలి?

శాంతి అనేది వస్తువు కాదు పొందడానికి. అది మన స్వరూప మని, అనుభూతి స్వరూప మని ఇప్పటికే విస్తారంగా చెప్పుకున్నాం. శాంతి అనేది స్వరూపము. ఈశ్వర స్వరూపమే శాంతి. ఇది జ్ఞానానికి సంబంధించిన విషయం.

శాంతి ఈశ్వర స్వరూపం కనుక, ఈశ్వరుణ్ణి పొందితే శాంతిని పొందినట్లే కదా! మరి, శ్లోకంలో అలా లేదే! ఈశ్వరుణ్ణి పొందితే శాంతిని పొందుతావు అని కాకుండా, ఈశ్వరుణ్ణి తెలుసుకుంటే శాంతిని పొందుతావు అంటున్నాడే!

అవును. ఈశ్వరుడు శాంతిరూపుడు. ఈశ్వరుణ్ణి తెలుసుకోవడ మంటే ఏమిటి? ఈశ్వరుడు జగత్కారణ మని, సర్వజ్ఞుడని, సర్వవ్యాపి అని, ఈ సృష్టికి అభిన్న నిమిత్త ఉపాదాన కారణ మని, ఏక మని, అద్వితీయ మని తెలుసుకోవడమే కదా! అవును. మరి, నువ్వెవరు? **అయమాత్మా బ్రహ్మ** - ఈ ఆత్మయే బ్రహ్మము! జీవుడు ఈశ్వర స్వరూపుడే కదా! నిజమే. మరి ఈశ్వరుడు శాంతి స్వరూపుడు అయినప్పుడు జీవుడైన నువ్వెవరు? శాంతిరూపుడవే కదా! ఇదే **జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి.** ఈశ్వరుణ్ణి తెలుసుకోవడము

అంటే జీవుడే ఈశ్వరుడు అని తెలుసుకోవడం. జీవేశ్వరుల అభేద దర్శనమే జ్ఞానం. ఇదే పరమశాంతి. జ్ఞానప్రాప్తి యొక్క ఫలం. జ్ఞాన ప్రసాదం.

**యజ్ఞ తపసాం భోక్తారం**

ఎవరిని తెలుసుకోవడం చేత జీవులు పరమశాంతిని పొందుతున్నారో అట్టి మహేశ్వరుడు సర్వ యజ్ఞములకు, తపస్సులకు భోక్తగా శోభిస్తున్నాడు. భోక్త అంటే అనుభవించే వాడు. యజ్ఞ తపస్సులకు భోక్త అంటే యజ్ఞ తపస్సుల యొక్క ఫలాలను అనుభవించే వాడు అని అర్థము.

అనుభవించే వాడు ***(భోక్త)*** ఎవడో, అతడే ఆచరించిన వాడు ***(కర్త)*** అయి ఉండాలి. యజ్ఞ తపస్సులకు భోక్త పరమేశ్వరుడు అంటే, యజ్ఞ తపస్సులను ఆచరించిన వాడు తానే అని అర్థము. మరి, పరమేశ్వరుడు యజ్ఞ తపస్సులను ఎప్పుడు ఆచరించాడు? 'నన్ను కర్మలు అంటవు - నాకు కర్మఫలాల యందు స్పృహ లేదు' *(4 - 14)* అని చెప్పినవాడు తానే కదా! మరి ఇక్కడ తానే భోక్త అంటున్నా డేమిటి?

యజ్ఞమైనా, తపస్సైనా, నిత్యకర్మ అయినా, నైమిత్తిక కర్మ అయినా చేసేది నేను కదా! నేను చేసిన కర్మ యొక్క ఫలాలకు భోక్త నేను కావాలి కాని పరమేశ్వరుడు ఎలా అవుతాడు? 'కర్మ చేసేది జీవుడు - అనుభవించేది దేవుడు' - ఇదెక్కడి న్యాయం?

నిజమే. చేసిన వాడే అనుభవించాలి. కర్తయే భోక్త కావాలి. భోక్త తానే అని పరమేశ్వరుడు చెబుతున్నాడు కనుక కర్త కూడా తానే అయి ఉండాలి. మరి కర్త జీవుడు కదా? జీవుడు కర్త యైనపుడు, ఈశ్వరుడు భోక్త ఎలా అవుతాడు? ఎందుకు కాడు? ఒకవేళ జీవుడే ఈశ్వరుడై ఉంటే? అప్పుడు ఈశ్వరు డెవడు? కర్తగా జీవుడైన వాడే ఈశ్వరుడు. కర్తగా జీవుడై కర్మ నాచరించిన వాడే, భోక్తగా ఈశ్వరుడై కర్మఫలాలను అనుభవిస్తున్నాడు. సర్వ కర్మలలో కర్త రూపంలో ఉన్నవాడు తానే. భోక్త రూపంలో ఉన్నవాడు కూడా తానే.

***భోక్తారం యజ్ఞ తపసాం - (భోక్తారం యజ్ఞానాం తపసాం చ కర్తృరూపేణ దేవతా రూపేణ చ) -*** ఆచరించే జీవుడి రూపం లోను, అనుభవించే దేవతా రూపం లోను ఉన్నవాడు తానే కనుక కర్త తానే. భోక్త తానే. సాధారణంగా మనం ఆచరించే వేదోక్త మైన యజ్ఞకర్మలు మరియు శ్రౌత స్మార్త కర్మలకు; ఇంకా సత్యము, అహింస, వేదాధ్యయనము, శమము మొదలైన తపస్సులకు సంబంధించిన సర్వ కర్మలకు కర్తయు, భోక్తయూ మహేశ్వరుడే.

ఒక వ్యక్తి ఇంద్ర యాగమును నిర్వహించాడు అనుకుందాం. అలా నిర్వహించిన వాడు జడమా? లేక చైతన్యమా? జీవమా? లేక నిర్జీవమా? చైతన్యమే. జీవమే. జీవచైతన్యమే. మరి, జీవచైతన్య మేమిటి? జీవ చైతన్యము, ఈశ్వరచైతన్యము అని రెండు చైతన్యాలు ఉన్నాయా? చైతన్యము అనేది ఒక్కటే గాని రెండు కాదు. కాలేదు. కనుక జీవచైతన్యమే ఈశ్వరచైతన్యము. ఈశ్వరచైతన్యమే జీవచైతన్యంగా తెలుస్తూ ఉంది.

యజ్ఞమును నిర్వహించిన వాడు పూర్ణాహుతిలో ***ఇంద్రాయ స్వాహా న మమ ఇదం*** - ఈ యజ్ఞ ఫలాన్ని ఇంద్రునికి సమర్పిస్తున్నాను - ఇది నాది కాదు అంటున్నాడా, లేదా? అలా సమర్పించే యజ్ఞ ఫలాన్ని ఇంద్రుడు స్వీకరిస్తున్నాడా, లేదా? స్వీకరిస్తున్నాడు కాబట్టే సమర్పిస్తున్నాం. స్వీకరించక పోతే సమర్పించడం ఎందుకు?

దేవతల నుద్దేశించి యజ్ఞాలు నిర్వహించి నపుడు, యజమాని సమర్పించే యజ్ఞ ఫలాన్ని ఆయా దేవతలు స్వీకరిస్తారు. మరి, అలా ఫలాన్ని అనుభవించే భోక్త రూపంలో ఉన్న ఇంద్రుని చైతన్యము ఈశ్వర చైతన్యము కన్నా వేరైనదా? కాదు.





యజ్ఞకర్మ నాచరించిన కర్త రూపంలో ఉన్న యజమాని లోను, యజ్ఞ కర్మ ఫలమును అనుభవిస్తున్న భోక్త రూపంలో ఉన్న దేవత లోను, ఒకే చైతన్యం భాసిల్లే టప్పుడు, ఆ చైతన్యము ఈశ్వర చైతన్యమే అని నిర్ధారింపబడి నప్పుడు కర్త ఎవరు? భోక్త ఎవరు? కర్త రూపంలో ఉన్నది, భోక్త రూపంలో ఉన్నది రెండూ ఈశ్వరుడే. కర్త వేరు భోక్త వేరని ఉపాధి భేదంతో చూస్తున్నామే గాని ఉపాధి వినిర్ముక్త మైన చైతన్య స్థాయి నుండి చూచి నపుడు భేదం ఎక్కడుంది? ఈశ్వరుడే కర్తగా, భోక్తగా అభేదంగా, అఖండంగా శోభిస్తున్నాడు.

మరి, కర్త రూపంలో ఈశ్వరుడే ఉన్నాడు అనేది వాస్తవ మైతే, 'నన్ను కర్మలు అంటవు - నాకు కర్మఫల స్పృహ లేదు' *(4 - 14)* అని భగవంతుడు చెప్పడ మేమిటి? ఈ వాక్యాలు పరస్పర విరుద్ధంగా లేవా? లేవు. ఉండలేవు.

అర్జునా! సర్వ కార్యాలకు ***(సృష్టి కార్యంతో సహ)*** నేనే కర్త నైనను, నన్ను అకర్తగా, అవ్యయునిగా తెలుసుకో *(4 - 13)* అని చెప్పే ఉన్నాడు కదా! ఇదే కదా కర్మలలో అకర్మదర్శనం *(4 - 18)!*

ఈ విధంగా కర్త యైన ఈశ్వరుడే అకర్తగా ఉన్నాడు. భోక్త యైన ఈశ్వరుడే అభోక్తగా శోభిస్తున్నాడు. కర్మలకు అంటకుండా కర్మలలో, కర్మఫలాలను ముట్టకుండా కర్మఫలాలలో ఆయన దివ్య కరచరణాలే అదృశ్యంగా కదులుతున్నాయి. ఈ విధంగా పరమేశ్వరుని ఎవరు తెలుసుకుంటారో ***(జ్ఞాత్వా)*** వారు శాంతిని పొందుతున్నారు ***(శాంతిం ఋచ్ఛతి).*** శాంతిని పొందాలని అభిలషించే వారు పరమేశ్వరుని ఈ విధంగా, యజ్ఞ తపస్సులకు భోక్తగా అర్థం చేసుకోవాలి.

ఏమిటి అలా చూస్తున్నారు? కథ మళ్ళీ మొదటి కొచ్చిందేమిటా అనుకుంటున్నారా? అదేమీ లేదు. జ్ఞాన నౌక చల్లగా, మెల్లగా ముందుకు సాగి పోతూనే ఉంది. గట్టు మీద చెట్లు అచలం గానే ఉన్నాయి. నీటిలో నావ చలిస్తూనే ఉంది. ఇటు అటు, అటు ఇటు చూడటంలో కదిలే చోట కదలిక లేనట్లు, కదలిక లేనిచోట కదలిక ఉన్నట్లు గోచరిస్తూ ఉందేమో, ఎవరికి వారుగా చూసుకోవాలి. నేను చేయగలిగింది ఏమీ లేదు.

అదేమిటయ్యా! ఈశ్వరుడు అకర్తగా, అభోక్తగా ఉన్నాడు సరే. అది తెలుసుకోవడం వల్ల నే నెలా శాంతిని పొందుతాను? నువ్వే ఈశ్వరుడు కనుక. ఈశ్వరుణ్ణి అకర్తగా, అభోక్తగా తెలుసుకోవడం అంటే, నిన్ను నీవు అకర్తగా, అభోక్తగా తెలుసుకోవడము అని అర్థము. అలా నిన్ను నీవు తెలుసుకొని, ఆ తరువాత నువ్వు కర్మలలో కూరుకు పోయినా, నువ్వు కర్మ చేయని వాడివే అని నాల్గవ అధ్యాయం లోనే అర్థం చేసుకున్నాం కదా! ***(కర్మణి అభిప్రవృత్తః అపి న ఏవ కించిత్ కరోతి సః).*** ఈ విధంగా ఈశ్వరజ్ఞానం, జీవుడు ఈశ్వరుడే అనే బ్రహ్మాత్మజ్ఞానం పరిపూర్ణమైన శాంతిని ప్రసాదిస్తూ ఉంది.

**సర్వలోక మహేశ్వరం**

యజ్ఞ తపస్సులకు భోక్త యైన పరమేశ్వరుడు సర్వలోక మహేశ్వరుడు. లోకములు అంటే దృశ్యములు. ***లోక్యన్తే ఇతి లోకాః.*** చూడబడేవి లోకములు. సర్వ లోకములు అంటే చూడబడే లోకములు అన్నీ అని అర్థము. వాటన్నిటికీ ప్రభువు కనుక సర్వలోక మహేశ్వరుడు. మహేశ్వరుడు అంటే శ్రేష్ఠుడైన ఈశ్వరుడు అని అర్థము.

ఈశ్వరుడు అంటే ప్రభువు. పాలించే వాడు, శాసించే వాడు, ఆధిపత్యము చెలాయించే వాడు అని అర్థా లున్నాయి. ***ఈశితుం శీలం అస్య*** - అధికారము వహించే లక్షణము గల వాడు ఈశ్వరుడు. కేవలము సన్నిధి మాత్రం చేత, ***ఈష్టే*** - చలింప చేయువాడు ఈశ్వరుడు. ***మహః*** విశేషణం చేత ఆయన మహేశ్వరుడు.

***మహ్యతే జనైః ఇతి మహః, మహ పూజాయామ్*** - జనుల చేత పూజింప బడేవాడు కనుక మహుడు.

సమస్త లోకాలను శాసించే వాడు, నడిపించే వాడు తానే. సర్వ లోకాల చేత పూజింప బడే ఐశ్వర్యవంతుడు కనుక, ఆయన సర్వలోక మహేశ్వరుడు.

లోకాలు అనేకము ఉన్నాయి. ఒక్కొక్క లోకానికి ఒక్కొక్క ప్రభువు ఉంటాడు. వరుణలోకానికి వరుణుడు, ఇంద్రలోకానికి ఇంద్రుడు, సూర్యలోకానికి సూర్యుడు, చంద్రలోకానికి చంద్రుడు, యమలోకానికి యముడు, కుబేరలోకానికి కుబేరుడు - ఇలా ఒక్కొక్క లోకానికి ఒక్కొక్క ప్రభువు ఉంటాడు. అందరికీ, అన్ని లోకాలకు ప్రభువు కావడం చేత ఆయన సర్వలోక మహేశ్వరుడు.

**ఈశ్వరస్య భావం ఐశ్వర్యం** - ఈశ్వరస్య భావమే ఐశ్వర్యం కనుక శాసనశీలం గల ఈశ్వరుడు షడ్గుణైశ్వర్య సంపన్నుడు. ఈశ్వరుని ఐశ్వర్యము రెండు విధాలుగా ఉంటుంది. (1) సోపాధిక ఐశ్వర్యం. (2)నిరుపాధిక ఐశ్వర్యం. అంటే, ఉపాధి రహిత ఐశ్వర్యం.

సర్వజ్ఞత్వము, సర్వ వ్యాపకత్వము, సర్వ శక్తిమత్వము మొదలైన లక్షణా లన్నీ సోపాధిక ఐశ్వర్యానికి సంబంధించినవి. ఈ సోపాధిక ఐశ్వర్యాన్నే మాయోపాధి అంటారు. మాయోపాధి లేకుండా స్వరూపంతో, ఉపాధి రహితంగా ఉండటమే నిరుపాధిక ఐశ్వర్యం. అదే సత్యము, జ్ఞానము, అనంతము అయిన బ్రహ్మ స్వరూపము.

కనుక, పుణ్యఫల విశేషం చేత దేవతాది లోకాలకు ప్రభువు లైన ఇంద్రాది దేవతలు ఉపాధులు కలిగి, పరిమితమైన ఐశ్వర్యముతో శోభిస్తూ ఉంటారు. కాని, పరమేశ్వరుడు ఉపాధి రహిత చైతన్య స్వరూపుడు అయినందున ఆయన సర్వలోక ప్రభువు. సర్వలోక మహేశ్వరుడు ***(సర్వలోక మహేశ్వరమ్).*** అందుచేతనే మహేశ్వరుని ***ఏష సర్వేశ్వరః*** అని బృహదారణ్య కోపనిషత్తు కీర్తించింది.

**కర్తా భోక్తా మహేశ్వరః**

దేవతలు వారి వారి లోకాలకు మాత్రమే ప్రభువులు. పరమేశ్వరుడు సర్వ లోకాలకు, లోకాధిపతులకు ప్రభువు కనుక ఆయన సర్వలోక మహేశ్వరుడు. దేవతల లోని శక్తి పరమేశ్వరుడే. అలాగే యజ్ఞాలలో మనం సమర్పించే వన్నీ దేవతల ద్వారా దేవదేవుడైన మహేశ్వరునికే చెందుతాయి. ఎవరికి ఈ జ్ఞానం వంట పడుతుందో వారే శాంతి స్వరూపు లవుతారు.

నన్ను మించిన ప్రభువు లేడు అనే మదంతో ఇంద్రుడు విర్రవీగాడు. గోవర్ధన పర్వతాన్ని ఎత్తి ఇంద్రుని మద మణచాడు గోవిందుడు.

***సత్త్వం మమైశ్వర్య మదా ప్లుతస్య కృతాగసస్తేఽ విదుషః ప్రభావమ్ !***
***క్షన్తుం ప్రభోఽ థార్హసి మూఢ చేతసో మైవం పునర్భూ దసతీశ మేమతిః ॥***

ప్రభో! నేనే ప్రభువును అనే మదముతో మగ్నమైన వాణ్ణి ***(ఐశ్వర్య మద ఆప్లుతస్య).*** నీ మహిమను తెలియని వాణ్ణి ***(తే ప్రభావం అవిదుషః).*** నీ విషయంలో అపరాధం చేశాను ***(కృత ఆగసః).*** నా తప్పును క్షమించు ***(మమ క్షంతుం అర్హసి).*** పరమేశ్వరా! ***(ఈశ!)*** ఇక మీదట ***(అథ)*** అవివేకి నైన నాకు ***(మూఢ చేతసః మే)*** మళ్ళీ ఇలాంటి చెడ్డ బుద్ధి ***(పునః అసతీ బుద్ధిః)*** ఈ విధంగా కలుగకుండు గాక ***(ఏవం మా భూః)!*** అని సురలోక ప్రభువైన ఇంద్రుడు సర్వలోక ప్రభువైన మహేశ్వరుని ప్రార్థించాడు.

అదే సమయానికి గోలోకం నుండి కామధేనువు ***(సురభిః)*** అక్కడికి వచ్చి, తన సంతానమైన గోవులను రక్షించిన గోపాలునికి బ్రహ్మదేవుని ఆదేశముతో క్షీరాభిషేకం చేసింది. తన క్షీరము చేత శ్రీకృష్ణుని





అభిషేకించింది ***(ఆత్మనః పయసా అభ్యషించత్).*** గోవులను రక్షించుటకు గోవర్ధన గిరి నెత్తిన వాడు కావడం చేత ఈ సందర్భం లోనే పుణ్యాత్ముౖరా లైన సురభి శ్రీకృష్ణునికి 'గోవిందుడు' అని పేరు పెట్టినట్లు ***(దశార్హం గోవిందం ఇతి చ అభ్యధాత్ )*** భాగవతం చెబుతుంది. ఆ క్షణం నుండి గోపాలుడు గోవిందు డయ్యాడు.

గోవర్ధన గిరిని అర్చించే టప్పుడు, గోప గోపీ జనంతో కలిసి శ్రీకృష్ణుడు కూడా పూజ చేశాడు. అర్చించే వాడుగా శ్రీకృష్ణుడు కర్త. సురభిమాత అభిషేకించే మంగళ వేళ తానే పూజలను అందుకొని భోక్త అయ్యాడు. కర్త, భోక్త తానే అని గోవర్ధనలీలలో నిరూపించాడు.

ఇదే అద్వయానుభూతి. అఖండానుభూతి. అద్వైతానుభూతి. అందుకే నేమో, శ్రీమద్భాగవతం - దశమ స్కంధము - సప్తవిం శాధ్యాయములో, అంటే ఇరవై ఏడవ అధ్యాయములో అద్భుతమైన ఈ గోవర్ధన లీలను వ్యాస భగవానుడు సమాప్తం చేస్తూ, సురభిమాత గోవిందుని అభిషేకించి, అర్చించిన తరువాత కలిగిన ఫలం ఏమిటో అనితర సాధ్యంగా ఒక్క శ్లోకంలో వర్ణించాడు. ఇదే గోవర్ధనలీలలో చివరి శ్లోకం. ఈ శ్లోకంతో అధ్యాయంతో పాటు గోవర్ధన గిరి వృత్తాంతము కూడా సమాప్త మవుతుంది.

***శ్లో ॥ కృష్ణేఽ భిషిక్తే ఏతాని సర్వాణి కురు నందన!***
***నిర్వైరా ణ్యభవం స్తాత క్రూరాణ్యపి నిసర్గతః ॥***

'హే పరీక్షిత్తూ! ***(కురునందన!)*** నాయనా! ***(తాత!)*** శ్రీకృష్ణుడు అభిషిక్తుడు కాగానే ***(కృష్ణే అభిషిక్తే సతి),*** సహజంగా ***(నిసర్గతః)*** పరస్పర విరోధము గల క్రూర జంతువులు ***(క్రూరాణి),*** తమ లోని శత్రు స్వభావాన్ని పోగొట్టు కున్నవి ***(అక్రూరాణి)*** అయ్యాయి ***(అభవన్)'*** అన్నాడు శుకబ్రహ్మ. అంటే, గజ సింహాదులు, వ్యాఘ్ర మృగాదులు, గరుడ సర్పాదులు తమ సహజ స్వభావా లైన ద్వేషాదులను పోగొట్టుకుని, స్వభావ సహజమైన స్వరూప ప్రేమను వ్యక్త పరచాయట. అదే అద్వైత వైభవము.

**సర్వభూతానాం సుహృదం**

సర్వలోక మహేశ్వరుడైన పరమేశ్వరుడు అందరికీ తోడుగా ఉన్నాడు. సర్వ ప్రాణుల హృదయాల లోనే ఉన్నాడు. అందరికీ మిత్రుడుగా ఉన్నాడు ***(సుహృదం సర్వ భూతానాం హృదయేశయం).*** ఇంట్లో ఎవరున్నారో చెప్పలేము. ఎవరు ఉంటారో చెప్పలేము. కానీ, ఒంట్లో మాత్రం ఎవ్వరూ లేరు. పరమేశ్వరుడే ఉన్నాడు.

**సుహృద్** అంటే మిత్రుడు అని అర్థం. స్నేహితులు అందరికీ ఉంటారు. ఒకరి స్నేహితుడు అందరికీ స్నేహితుడు కావాలి అనే నియమం లేదు. చెరకులో తీపి ఉంది అంటే, అది అందరికీ తీపి గానే ఉంటుంది. కాని స్నేహితుడిలో ఉండే స్నేహం అందరి కొరకు ఉండదు. తన స్నేహితుడు, లేదా స్నేహితులు ఎవరో ఆ కొద్ది మందికి మాత్రమే పరిమితంగా ఉంటుంది.

పరమేశ్వరుడు అలా కాదు. ఆయన అందరికీ మిత్రుడు. చాలా గొప్ప మిత్రుడు. ఆయన మిత్రత్వాన్ని వర్ణించడానికి మాటలు లేవు. వేదమాతే వర్ణించలేక పోయింది. నీకు ఎందరైనా గొప్ప స్నేహితులు ఉండొచ్చు. కాని, ఈశ్వరుని లాగా ఉండ లేరు. అంత ప్రేమ కలిగిన వాళ్ళు, అంత శక్తి కలిగిన వాళ్ళు, సదా అందుబాటులో ఉండేవాళ్ళు, ప్రత్యుపకారం ఆశించకుండా సహాయం చేసే స్నేహితులు ఎక్కడ దొరుకుతారు?

ఎంత గొప్ప స్నేహితుడైనా, ఏదో ఒక చోట, ఏదో ఒక కాలంలో మన నుండి ఏదో ఒక సహాయాన్ని తప్పక ఆశిస్తాడు. ఏ విధమైన ప్రత్యుపకారాన్ని ఆశించకుండా సర్వ ప్రాణులకు దగ్గరగా ఉండి ఉపకారం చేసేవాడు పరమేశ్వరు డొక్కడే ***(సుహృదం సర్వ భూతానాం, ప్రత్యుపకార నిరపేక్షతయా ఉపకారిణాం).***

ఎంతటి ప్రాణమిత్రుడు మనకు ఉన్నా, అలాంటి వాడే మరొకడు ప్రాప్తిస్తే, అతనితో కూడా తప్పక స్నేహం చేస్తాం. కాని భగవంతుడు అలాంటి స్నేహితుడు కాడు. ఆయన స్నేహం రుచి మరిగితే, మరొక స్నేహితుడు రుచించడు. మనకు కావలసిందంతా ఆ ఒక్క వ్యక్తి నుండే అందుతుంది.

మనల్ని ప్రేమించే వారినే మనం ప్రేమిస్తాము. మనల్ని ద్వేషించే వారిని ప్రేమించగలమా? అది ఒకే ఒక్కడికి సాధ్యం. అతడే భగవంతుడు. ఆయన మిత్రత్వం లోని వైభవ మేమిటంటే, తనను అంగీకరించని వారిని కూడా ఆయన ప్రేమిస్తాడు. తనను దూషించే వారిని కూడా ప్రేమిస్తాడు. ఇది నమ్మ శక్యమా అనిపిస్తుంది. కాని, ఇంతకన్నా నమ్మదగిన సత్యం మరొకటి ఉంటుందని నేను అనుకోవడం లేదు.

నీకు మంత్రి మిత్రుడుగా ఉండొచ్చు. ముఖ్యమంత్రి చెలికాడు కావచ్చు. ప్రధానమంత్రితో నేస్తం ఉండొచ్చు. రాష్ట్రపతి స్నేహితుడు కావచ్చు. ఎంతటి ప్రాణమిత్రు లైనా, సదా మనతో కలిసి ఉండగలరా? కాని, భగవంతుడు సదా కలిసే ఉంటాడు. క్షణం విడిచి పెట్టకుండా ఉంటాడు. మన హృదయం లోనే ఉంటాడు. అందుకే ఆయన **సుహృత్.**

**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి**

పరమేశ్వరుడు సర్వ ప్రాణుల హృదయ ప్రదేశము నందే ఉంటున్నాడు అని భగవద్గీత - పద్దెనిమిదవ అధ్యాయంలో భగవంతుడే చెబుతాడు.

సర్వప్రాణులకు **సుహృత్** గా ఉన్న భగవంతుడు సర్వప్రాణుల హృదయాలలో ఉన్నాడు. **హృత్** అంటే హృదయము. **సు** అంటే చక్కని అని అర్థము. **సుహృత్** అయిన పరమేశ్వరుని కలుసుకోవడానికి చక్కని ఉపలబ్ధి స్థానం హృదయము **(సుహృత్).** ఈశ్వరుడు **సుహృత్.** హృదయము కూడా **సుహృత్.** అందుకే పరమేశ్వరుడు హృదయంలో వసిస్తున్నాడు. కాని, దురదృష్ట మంతా ఏమిటంటే, ప్రాణం కన్నా దగ్గరగా ప్రాణనాథుడైన పరమేశ్వరుడు హృదయంలో సదా మన కోసం నిరీక్షిస్తూ ఉన్నా అంత దగ్గరలో ఉన్న వాడిని గుర్తించలేని దుస్థితిలో మనం ఉన్నాం. మానవాళి దురవస్థకు ఇదే ప్రధాన కారణం.

పిలిస్తే పలకని వాళ్ళ కోసం, వినిపించినా వినిపించనట్లు నటించే వాళ్ళ కోసం, పని కట్టుకొని పరితపిస్తూ ఉంటాం. కేవలం మనస్సులో స్మరించినంత మాత్రాన ప్రతిస్పందించి, దివ్యమైన ప్రేమను ప్రసాదించే మహితాత్ముని పట్టించుకోకుండా చిందు లేస్తున్నాం. చింతలలో మగ్గుతున్నాం.

నా కెవ్వరూ లేరు అని కొందరు. నా కెవరున్నారు? అని మరి కొందరు. నేను ఏకాకిని అని ఒకడు. నేను దిక్కు లేని వాణ్ణి అని మరొకడు. ఇదంతా నిజమేనా? సర్వ సౌభాగ్య ప్రదాతను హృదయంలో పెట్టుకొని అభాగ్యులుగా జీవించ వలసిన అగత్యం ఎందుకు పట్టింది? స్మరించ దగిన వాణ్ణి విస్మరించడం చేత. విస్మరించ దగిన ప్రపంచాన్ని స్మరించడం చేత.

జరిగింది జరిగి పోయింది. తెలియక కాలాన్ని, బ్రతుకును వృథా చేసుకున్నాం. ఇప్పుడు తెలిసింది కదూ! ఎవరి వైపు తిరిగితే మరొకరి అవసరం జీవితంలో ఉండదో, ఏ ఒక్కని ఆశ్రయిస్తే, అన్నీ తానై మనల్ని తరింప చేస్తాడో, అట్టివాడు మన హృదయం లోనే ఉన్నాడు. అన్నీ తానై ఆదుకోవడానికి, అన్నీ తానై ఆనందింప చేయడానికి సిద్ధంగా ఉన్నాడు. సంసిద్ధంగా ఉన్నాడు. ప్రసిద్ధంగా ఉన్నాడు.

**యేషా మహం ప్రియ ఆత్మా సుతశ్చ సఖా గురుః సుహృదో దైవ మిష్టం !**





నన్ను ఆశ్రయించిన భక్తులకు నేను ప్రియుడుగా, ఆత్మగా, బిడ్డగా, సఖుడుగా, గురువుగా, స్నేహితుడుగా, ఇష్ట దైవంగా ఉన్నాను అన్నాడు భాగవతం - తృతీయ స్కంధంలో భగవంతుడు.

ఇంకేం కావాలి? పదండి! వెళ్ళి కలుసుకుందాం. దర్శించుకుందాం. దర్శించి తరించిపోదాం. మరి, హృదయంలో ఉండేవాణ్ణి ఎలా కలవాలి? ఎక్కడ కలవాలి? హృదయం లోనే కలవాలి. ధ్యానం అనే అంతరంగ సాధన ద్వారానే కలవాలి. అదెలాగో కూడా తానే చెబుతున్నాడు. ధ్యానమందిర తలుపులను తెరచి, ఆయన తలపులతో మనల్ని తన్మయుల్ని చేయబోతున్నాడు. అస్తు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం

యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసంన్యాసయోగో నామ పఞ్చమోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు కర్మసన్న్యాసయోగ మనే ఐదవ అధ్యాయము.**

